డిసెంబర్ 26 విడుదల!

నందిగం దేవీప్రసాద్
సమర్పించు
రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్

ఈ కట్నాల సాలెగూడు నుంచి
ఆడది బయట పడేదెప్పుడు?

# అనాదిగా ఆడది



BAN THE DOWRY

ఎస్.రామలింగేశ్వరరావు

అనిల్ కుమార్




PADMALAYA PUBS.

# అన్నీ ప్రభుత్వమే నిర్వహిస్తే....?

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

"మీది వయసు మళ్లిన దేశం, మేము పిన్న వయస్కులం" అని 1961లో వియన్నాలో సమావేశం అయినప్పుడు కృశ్చేవ్ అన్నారట కెన్నెడీతో. "సరిగా చూడండి. మేము అంత వయసు మళ్లిన వాళ్లం కాదని మీకు తెలుస్తుంది" అని సున్నితంగా ఎదురు దెబ్బ తీసారట కెన్నెడి.

ఒక దేశం వయసు ఎంత? మనదేశం లాంటి దాని వయసు ఎంత ఉంటుంది? అది తాను ఎంత పిన్న వయసులో ఉన్నానని భావిస్తే అంత చిన్నదిగా ఉంటుంది. మన దేశంలోని జనాభాలో మూడింట రెండు వంతులు పైగా 40 ఏళ్ల లోపువారే కాబట్టి మనది అంత చిన్నది, అంత పెద్దది కాక నడివయసులో ఉన్న దేశం అని చెప్పవచ్చు. కొందరు మనం అయిదు వేల సంవత్సరాల నాటి వాళ్లం అని అంటూ ఉంటారు కదా, మరి దాని సంగతి ఏమిటి? వాళ్ళు చెప్పేది కూడా వాస్తవమే కాని కొద్ది తేడా ఉంది. ఒక నాగరికతగా మన వయస్సు అయిదు వేల సంవత్సరాలే అయినా ఒక దేశం లేదా జాతిగా మన వయస్సు 40 ఏళ్లకి మించదు. రెండూ సిద్ధాంతపరంగా అయినా, మరో విధంగా అయినా సరైనవే.

మరి ఎందువల్లనో మనం పిన్న వయస్సులో ఉన్న దేశం లాగా ప్రవర్తించటం లేదు. దీనికి మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చేనాటికి మన నాయకులు బాగా వయసుమీరిన వారుగా ఉండటానికి సంబంధం ఉందేమోననిపిస్తున్నది. అప్పటికి మహాత్మాగాంధీ వయసు 80, నెహ్రూకి 58 ఏళ్ళు అంటే ప్రభుత్వోద్యోగులు పదవీ విరమణ చేసే వయస్సు. మన నాయకులకి కూడా అమెరికా సంయుక్త రాష్ట్రాలకి కెన్నెడి అధ్యక్షుడిగాఎన్నికైనప్పుడు ఆయనకి ఉన్న వయసు ఉండి ఉంటే పరిస్థితులు మరో రకంగా ఉండేవి నెహ్రూకి కెన్నెడీకి పొత్తు కుదిరేది కాదు. నెహ్రూగారు చాలావరకూ ఇంగ్లీషువాడే అవటం వల్ల ఆయనకి అమెరికన్ లంటే అభిమానం ఉండేది కాదు. అక్కడే ఆయన పొరపాటు పడ్డారని నాకనిపిస్తున్నది ఆయన అతిగా అభిమానించిన బ్రిటన్ వయసు మళ్లిన దేశమే కాకుండా అలాగే కనిపిస్తుంది. అమెరికా అందుకు భిన్నంగా చలాకీగా చైతన్యవంతంగా ఉంటుంది. నెహ్రూ కానీ, ఆ తర్వాత ఆయన కుమార్తె కానీ ఆ దేశాన్ని దూరంగా ఉంచకపోతే వారి చైతన్యంలో ఎంతో కొంత మనకి కూడా అబ్బేది.

బ్రిటిష్ వారికి గతం తప్ప ఇంకేమి మిగల లేదు. లండన్ వెళితే మీకు అక్కడో రాజుగారిది, ఇక్కడో రాణిగారిది స్మారక చిహ్నాలు మినహా మరేమి కనిపించవు. వందల సంఖ్యలో పర్యాటకులు, అందులో చాలా మంది బ్రిటిష్ వారే, ఒకదాని తర్వాత మరొకటిగా అక్కడి రాజప్రాసాదాలని సందర్శిస్తూ ప్రభుత్వ వసతి గృహాలలో విందులు ఆరగిస్తూ ఉంటారు. అవన్నీ ఒకనాటి రాజ వంశీకులవీ, వాళ్ల దొరసానులవీ. కాని ఇప్పుడు వాటి అదృష్టం తిరగబడి జనం కోసం ఎదురు చూస్తున్నాయి. అలా రాజప్రాసాదాలు పర్యాటకులతో నిండి ఉంటే కర్మాగారాలు వట్టిపోయి వేలం పాటదారుల కోసం నిరీక్షిస్తున్నాయి. ఒకప్పుడు భారత దేశంతో సహా ప్రపంచం అంతటినీ పరిపాలించిన నలభై లక్షల కుటుంబాలు నేడు దిక్కుతోచనిస్థితిలో ఉన్నాయి.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పరిస్థితి ఇందుకు పూర్తి వ్యతిరేకంగా ఉన్నది. అక్కడ రాజప్రాసాదాలు లేవు. అమెరికా అధ్యక్షుడు వాషింగ్టన్ వదలి న్యూయార్క్ వెళ్తే ఆయన ఒక హోటల్‌లో బస చేయాల్సి ఉంటుంది. అమెరికా అధ్యక్షుడు మన రాష్ట్రపతులు, గవర్నర్‌లు, ఇంకా చెప్పాలంటే మన రాజకీయవాదులు, అధికారులలా కాక ఆయన ఎక్కడికి వెళ్లినా హోటల్లోనే ఉంటారు. మన దేశంలో లాగా అక్కడ ఆయనకి ప్రభుత్వ వసతి గృహాలూ, గవర్నర్‌ల రాజభవనాలూ ఉండవు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో నిరుద్యోగులు వేలాదిగా ఉన్నా కొత్తగా స్థాపించే కంపెనీలలో వేలాది మందికి ఉద్యోగాలు దొరుకుతూ ఉంటాయి కొన్నేళ్లకి ఒకసారి అమెరికా ఆర్థికరం నిత్యనూతనం అవుతూనే ఉన్నది కొత్త పరి కొత్త సాంకేతిక విజ్ఞానం అక్కడ దినది. చెందుతున్నాయి. మీరు దానిని కాపిటలిజం లేదా మరేదైనా అనండి. ఆ దేశంలోని వ్య. ప్రగతికి దోహదం చేసే విధంగా రూపొందించ బడింది.

ఆ దేశం ప్రభుత్వం కానీ, అక్కడి రాష్ట్ర ప్రభుత్వాలు కానీ అక్కడ కంపెనీలని స్థాపించడం లేదు, ఉద్యోగాలని సృష్టించడం లేదు అమెరికాలో చెప్పుకోదగినటు వంటిది ఏది ప్రభుత్వరంగంలో లేదు. అక్కడ ప్రభుత్వ ప్రమేయం చాలా అరుదుగా కనిపిస్తుంది. భారత దేశంలో సోషలిజం పేరిట ఎక్కడ చూసినా ప్రభుత్వ రంగమే కనిపిస్తుంది. ఎందుకంటే మనం బ్రిటిష్ వారి ప్రభుత్వ సంక్షేమ వ్యవస్థని అనుసరిస్తున్నాము కాబట్టి. అన్ని చోట్లా ప్రభుత్వమే అయితే సంక్షేమం అన్నది కేవలం కాగితాలకే పరిమితం అవుతుంది ప్రతిదీ ప్రభుత్వమే నిర్వహించడం వల్ల మనకి అసలు పని లేకుండా పోతున్నది. ఇక మనం చేసేది ఏమిటంటే ప్రభుత్వం అది చెయ్యలేదు, ఇది చెయ్యలేదని దాన్ని విమర్శించడమే. ఈ రకమైన సంస్కృతికి బాధ్యత నెహ్రూదే అంటాను. ఇది ఫాబియన్ సోషలిజం సంస్కృతి. ప్రభుత్వం మన జేబులలో నించి డబ్బు తీసుకుని రేపన్నది లేనట్లు ఖర్చు పెడుతుంది. బహుళ జాతి సంస్థలతో, లేదా ఆయుధ వ్యాపారులతో ఒప్పందాలు కుదుర్చుకుంటుంది. ఎక్కువ ధర పెట్టి సాంకేతిక విజ్ఞానాన్ని కొనుగోలు చేస్తుంది. రైతుల వద్ద నించి ధాన్యం కొని దానిని



వర్షాలకి కారే గోదాములలో నిలవ చేసి అవి పాడై పోయేలా చేస్తుంది. కరెంటుని అతి తక్కువగా ఉత్పత్తి చేసే విద్యుత్ కేంద్రాలని ప్రభుత్వమే నిర్మిస్తుంది. తమాషాగా అయిదు చుక్కల హోటళ్ళు కట్టిస్తుంది, వాటిలో ప్రభుత్వాధికారులే ఉంటూ ఉంటారు. ప్రభుత్వమే బస్సులని నడుపుతుంది, ఎంతో మంది జనం వాటి కింద పడి చస్తుంటారు. ఇక మనం చేసేది, చేయడానికి ఏముంటుంది? సకాలంలో ప్రావిడెంట్ ఫండ్ అందలేదని, పోలీసులు మహిళలపై అత్యాచారాలు చేస్తున్నారని, ఢిల్లీ అభివృద్ధి సంస్థ కట్టిన ఇళ్ళు ఒక్క వర్షాకాలం కూడా నిలవక కూలి పోయాయని మనం పత్రికలకి ఉత్తరాలు రాస్తూ ఉంటాము. మనది చైతన్య రహితమైన సమాజంగా తయారైంది అలాంటి సమాజంలో వ్యవస్థ ఇచ్చిందే పుచ్చుకునే స్థితిలో మనం ఉంటాము. సణుగుతూ ఉండే వాళ్ళూ, చిత్తం దొరా! అనే వర్గం తయారవుతుంది. ఒక జాతి నిర్మాణానికి ఇది సరైన పద్ధతి కాదు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలు పెట్టుబడిదారి వ్యవస్థ గల దేశం అయితే కావచ్చు. అలాంటి వ్యవస్థ దేశాన్ని తాను నిర్దేశించుకున్న గమ్యం వైపు తీసుకు వెళ్తుందంటే దాని కోసం ఎంత ఖర్చు పెట్టాల్సి వచ్చినా మనం వెనుకాడ కూడదు. అసలు వచ్చిన చిక్కల్లా మనకి ఖర్చు పెట్టటమే ఇష్టం ఉండదు. ప్రపంచంలో ఉన్న దాదాపు అన్నీ మనకి ఊరికే అంది
...)కున్నట్లుగా రావాలను కుంటాము. మన
అవి అక్కడున్నట్లు భావిస్తాము. మనకి
...క విజ్ఞానం కావలసి వస్తే మరో ప్రశ్న
...ండా . అది ఒక కానుకగా మనకి అంద
జేయబడాలని మనం కోరుకుంటాము. గత సంవత్సరం నేను కొందరు భారతీయ జర్నలిస్టులతో కలిసి కామన్ మార్కెట్ దేశాలని పర్యటించాను. ఆ ఉమ్మడి విపణిలో వెన్న, ఆహార ధాన్యాలు గుట్టలు గుట్టలుగా పేరుకు పోయి వాటిని ఏమి చెయ్యాలో వాళ్ళకి తోచకుండా ఉన్నది. ప్రతి పత్రికా సమావేశంలోనూ ఒకటే ప్రశ్న ప్రధానంగా వినిపించింది. అదేమిటంటే, ఆ ఆహార పదార్థాలని భారత దేశానికి, మరి కొన్ని పేద దేశాలకి కానుకగా ఎందుకు ఇవ్వకూడదూ? అన్నది. అసలు ఎవరైనా మనకి కానుకగా ఏదైనా ఎందుకు ఇవ్వాలి అన్నదానికి నాకు సరైన కారణం కనిపించదు. ఇప్పుడు మనకి సమృద్ధిగా ధాన్యపు నిల్వలు ఉన్నాయి కావాలంటే అదే విధంగా మనం వెన్న, నెయ్యి కూడా సమృద్ధిగా ఉత్పత్తి చేసుకోగలము. కాని మన పూర్వీకులు ప్రతిదానికి అప్పటి రాజులు, మహారాజుల వైపు చూసినట్లు ఇప్పుడు మనం అన్నిటికీ ప్రభుత్వం వైపు చూస్తూ ఉంటే ఎప్పటికీ అవి మనకి లభ్యం కావు. పేర్లు మారితే మారి ఉండవచ్చు కానీ ఇప్పుడూ మనకి రాజులు, మహారాజులూ ఉన్నారు. అందువల్లనే మన దేశం ఇంకా ప్రపంచంలో అతి పేద దేశంగానే ఉంటున్నది. □

## రాజకయ్యాలు

—శంకు




తెలుగు 'స్టార్‌వార్స్'






# అందమైన రక్షణ

## అందంగా ఉండే యిళ్ళ కోసం నెరొలాక్ ఏక్రలిక్ ఎమల్షన్

### పెయింట్ టెక్నాలజీ తెలిసిన కంపెనీ నుండి.

వాతావరణం, కాలం ఈ రెండూ కలిగించే నష్టాన్నుండి ఏ యిల్లూ తప్పించుకోలేదు.

అందుకని మీ యింటికి కావలసింది ఒక ఉత్తమమైన పెయింట్ యిచ్చే రక్షణ. సిలికోన్‌తో నెరొలాక్ ఏక్రలిక్ ఎమల్షన్. దీని రంగుల యొక్క ఆకర్షణీయమైన ఛాయలు మీ యింటి గోడలలో కొత్త అందాలను నింపుతాయి. వీటి యొక్క ఉత్తమ లక్షణాలు మీ గోడలకు చిరకాలపు రక్షణ నిస్తాయి. నెరొలాక్ ఏక్రలిక్ ఎమల్షన్, నెరొలాక్ సింథటిక్ ఎనామిల్, నెరొలాక్ ఆయిల్ బౌండ్ డిస్టెంపర్-యివన్నీ పెయింట్ టెక్నాలజీని తెలుసుకొని అర్థం చేసుకున్న కంపెనీ వారిచే తయారు చేయబడ్డాయి. కాన్‌సాయీ పెయింట్స్, జపాన్ వారితో, మా సహకారంతో భారత దేశంలోకి, మారుతీ కోసం, ఆధునిక పెయింట్ టెక్నాలజీ వచ్చింది.

గుడ్‌లాస్ నెరొలాక్ పెయింట్స్— ఉత్తమమైన టెక్నాలజీ మీకు ఉత్తమమైన పెయింట్స్ అందిచ్చేందుకు.






**నెరొలాక్ పెయింట్స్**

ప్రతి రూపం, ప్రతి రంగూ, మరెంతో మేలుగా!



ULKA-GNP-1-85 TEL

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

20-26, డిసెంబరు, 1985
శ్రీ క్రోధన నామ సం. మార్గశిర. శు. నవమి
**సంపుటము 78 : సంచిక 15**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు. | 2-50 |
| పోస్ట్‌లో 6 నెలల చందా | రు. | 71-50 |
| పోస్ట్‌లో 12 నెలల చందా | రు. | 143-00 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధినగరం; విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
**నటి సత్యకళ.**
**(ఫోటో : వి. సత్యమూర్తి)**






### ముఖచిత్రం

"చిరునవ్వుల చిన్నారి
వాలు చూపుల వయ్యారి
వలపు తలపుల భామ
వయసు పొంగుతో ఉరూత లూగిస్తున్న
మా అభిమాన అందచందాల
ఏకైక నటి
ముద్దుల మోహనాంగి
మురిపాల కన్నెలేడి
'శ్రీదేవి' ముఖ చిత్రంతో వెలువడిన
ఆంధ్రుల అభిమాన
ఆంధ్ర సచిత్ర వారపత్రిక
దీపావళి సమయాన కోటి సాహిత్యపు
కాంతులు వెదజల్లి
పాఠకులను అలరించినది."

—కె. సురేంద్రనాథ్, గోరంట్ల

★ ★ ★

8-14 నవంబరు'85 సంచిక అందాల తార 'శ్రీదేవి' ముఖ చిత్రం అత్యంత ఆకర్షణీయంగా ఉంది.

బి. లక్ష్మణశాస్త్రి, భీమవరం

★ ★ ★

శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన పత్రిక (8-14) చాలా బావుంది. అభిమాన నటిని అందంగా ముద్రించిన పత్రికకు నా శుభాభినందనలు.

వై. వి. రామకృష్ణమూర్తి, కొత్తగూడెం

### ఆశ్చర్యంగా ఉంది!

దీపావళి సంచిక ముఖచిత్రం శ్రీదేవి చాలా అందంగా యున్నది. ఆమె వ్రాసిన టపాకాయల కోసం అన్నది చాలా బాగున్నది గాని 10 సంవత్సరముల క్రింద చిల్లర కొరతలేదు. చిల్లర దొరకలేదంటే చాలా ఆశ్చర్యము అయింది.

పుప్పాల సత్యనారాయణ, టిట్లాఘర్

### సీరియల్స్

త్రివేణీసంగమం మాకు బాగా నచ్చింది. ఈ నవలలోని అరుంధతి పాత్రను రచయిత చాలా ఉదాత్తంగా చిత్రీకరించారు. స్త్రీ పాత్రలను యధాతథంగా చిత్రించుటలో గల రచయిత నైపుణ్యం ఎంతో అభినందనీయం.

జి. పాప, శృంగవరపుకోట

★ ★ ★

ముఖ పత్ర సుందరి శ్రీదేవి దీపావళి వెలుగులను విరజిమ్ముతున్న ఆంధ్రపత్రిక కనువిందుగా ఉంది. "త్రివేణీసంగమం" సీరియల్ చదువుతుంటే చేజేతులా తన జీవితాన్ని నాశనం చేసుకున్న వనజని చూస్తుంటే, జాలి, సానుభూతి కలుగుతున్నాయి. ఆమె జీవితం మళ్ళీ చిగురిస్తే బావుండును.

కొండమూరి శ్యామ, గుత్తి నదివి

★ ★ ★

8-11-85 ఆంధ్ర సచిత్ర వారపత్రికల్లో "త్రివేణీ సంగమం" సీరియల్ అయిపోయిందని చూసి చాలా బాధనిపించింది. చదువుతున్నంతసేపు ఆసక్తికరంగా, రసవత్తరంగా సాగిన ఈ నవల అప్పుడే అయిపోయిందా అనిపించింది.దాని ముగింపు నా కెంతగానో నచ్చింది. కథ దుఃఖాంతమేమో అనుకున్న పాఠకుల ఆలోచనలకు భిన్నంగా ఒక్క మలుపుతో సుఖాంతంచేసి త్రివేణీ సంగమం టైటిల్ అతికినట్లుగా వ్రాసిన రచయిత ఎంతైనా అభినందనీయులు.

వి. నరసింహమూర్తి, చోడవరం

★ ★ ★

"త్రివేణీ సంగమం" సీరియల్ ముగింపు చాలా బాగున్నది. రచయిత దూరి వెంకటరావుగార్కి మా అభినందనలు.

పి. మురళీకృష్ణ, లీలశ్రీ, హిరమండలం


**(65 వ పేజీ చూడండి)**

# 3డి సీరియల్ ప్రారంభం!

సాయంత్రం.... నాలుగు గంటలు కాబోతూంది. ఎండ వెచ్చగానే తప్ప వేడిగా లేదు.

మునిసిపల్ గ్రౌండ్ కలకలలాడు తూంది. ఎన్నికలొస్తున్నాయంటే వూళ్ళూ.... సభలు జరుగుతాయంటే మైదానాలూ సంబరపడి పోడం సహజమే మరి.

మెయిన్ రోడ్డు పక్క—మునిసిపల్ గ్రౌండు. గేటు ముందర పెద్ద అక్షరాలతో – అందరికీ 'ఆహ్వానం'. లోపల – సుందరంగా అలంకరించ బడిన వేదిక. గ్రౌండులో చాలాచోట్ల మైకులు ...

రోడ్డు మీద పోయే వారికి కూడా – వేదిక మీది వక్త మాట్లాడేది – చెవులు గింగిర్లెత్తేలా వినిపించేలాగ. సభ ప్రారంభమయి పోయినట్లే ఉంది. ఆ వక్త ప్రత్యేకంగా ఉన్నాడు!చిత్రంగా కనిపిస్తున్నాడు.

## రచయిత పేరు కనుక్కోండి!

ఈ త్రి-డి సీరియల్ నవల రాసినవారు తమ రచనల ద్వారా పాఠకులకి సుపరిచితులే. ఈ రచయిత తాము రాసిన వాటిలో ఏ ఒక్క రచనా మరో దానిని పోలి ఉండదు కాబట్టి పాఠకులు తమ పేరుని కనుక్కోలేరని అంటున్నారు. పాఠకులు ఈ సీరియల్‌ని ప్రారంభం నించీ చదివి నాలుగు వారాలలోగా దీని రచయిత ఎవరై ఉంటారో ఊహించి సహేతుకంగా 250 అక్షరాలకి మించకుండా రాసి, తమ ఫోటో ని జతపరచి పంపవలసిందిగా కోరుతున్నాము. సహేతుకంగా సరైన పేరు రాసిన పాఠకుల రచనలని వారి ఫోటోలతో సహా సీరియల్‌తోపాటు 5వ వారం నించి మొదలుపెట్టి చివరిదాకా ప్రచురిస్తాము. ముందు అందినవాటిని ముందుగా ప్రచురించే ప్రాతిపదికపై రచనల పరిశీలన జరుగుతుంది కాబట్టి పాఠకులందరూ ఉత్సాహంతో ఈ సీరియల్ రచయితని కనుక్కోటానికి ప్రయత్నించగలరని ఆశిస్తున్నాము.

పాఠకులు తమ రచనలని ఫోటోలని నాలుగు వారాలలోగా సంపాదకుడు, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 520003కి పంపాలి. ప్రచురణకి అర్హంకాని రచనలని, ఫోటోలని తిప్పి పంపగోరేవారు తగినన్ని తపాలా బిళ్ళలు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరచి పంపగోరుతున్నాము.

సంపాదకుడు

కాషాయ వస్త్రాలూ.... గెడ్డాలూ... మీసాలూ... నుదుట – పెద్ద పెద్ద విభూది రేఖలూ. ఔను. అతను – పూర్వాశ్రమంలో సన్యాశే. బాబాయే. అతని రూపంలాగే కంఠమూ – ప్రత్యేకంగానే ఉంది. ఆ బాబా ఎమ్మెల్యేకి పోటీ చేస్తున్నారు!

"మనుషులందరూ సమానమే. అందరూ వొక్కటి మధ్యలో వొచ్చిన తారతమ్యాలు మనం తెచ్చి పెట్టుకున్నవి మానవులు అజ్ఞానంతో తెచ్చి పెట్టుకున్న యీ అంతరాలే అన్ని అనర్థాలకి మూలకారణం. ఇవి – మానవులు సృష్టించినవే కాని దైవం నిర్దేశించినవి కావు. ఒక విషయం చూడండి.... చివరకే మనిషికయినా కావలసింది ఆరడుగుల జాగాయే.. అంతవరకూ అతను భూస్వామే అయినా గర్భ దరిద్రుడే అయినా. మనుషులందరిలోనూ ఉండేది – అదే రక్తం. "

జనం – నవ్వుకుంటున్నారు ఎదురు ప్రశ్నలు వేస్తున్నారు పక్కన వినిపించినా మానినా తమలో తాము మాట్లాడుకుంటున్నారు

రక్తంలో తేడాలు గ్రూపులున్నాయి స్వాములు వారు సైన్సు చదువుకున్నట్లు లేదు "

# త్రివేణి

"అందరూ సమానమే. కొందరు మరింత సమానం."

"స్టేజెక్కి వేదాంతం చెబుతున్నాడు. అసలీ సన్యాసికి రాజకీయాలెందుక్కావలసి వొచ్చాయి? అడిగేవాడు లేక.."

రకరకాల విసుర్లు.

వక్త గంభీరంగా చెప్పుకుపోతున్నాడు. "నాకు తెలుసు.. మీరేమనుకుంటున్నారో యోగికి రాజకీయాలెందుకనుకుంటున్నారు. ఔనా? మిమ్మల్ని.. ప్రజలని.. చైతన్యవంతులని చేద్దామని. ప్రజాసేవ చేద్దామని. ఇన్నాళ్ళూ చెయ్యలేదా అంటే చేశాను. ఎమ్మెల్యే అయితే యింకా ఎక్కువ చెయ్యవొచ్చునని. నాకున్న అర్హతేమిటంటారా? సినిమా వాళ్ళ కంటితీసిపోయానా? వాళ్ళ కంటె నా జ్ఞానం.. క్రమశిక్షణ... నీతి.. నియమం.. ఎక్కువ కావా?సరే.. విషయంలోకి వొద్దాం.. అన్నట్టు... విషయమంటే ఒకటి జ్ఞాపకం వచ్చింది. మీకొక విషయం తెలుసా? మనిషి.. శవానికి చితి మీద అగ్ని సంస్కారం చేసే ముందు.. కట్టె మీద ఏమి ఉండనివ్వరు. పేదవాడయినా... ధనవంతుడయినా... సామాన్యుడయినా మహారాజయినా... వొంటి మీద ఏమి మిగలకుండా... దహనం కావలసిందే. అందుకే – పోయేవాడు వెంబడి రాదు పూచిక పుల్లయినా. కనుక.. మహాజనులారా!.. మనుషులందరూ సమానమే..."

ఒక్క సారాగాడు స్వామి – గుక్క తిప్పుకుందుకు.

సరిగ్గా అదే క్షణంలో ....

అతన్ని వెక్కిరించడానికా అన్నట్టు... అతను గొంతెత్తి చాటుతున్న సమానత్వాన్ని పరిహసించడానికే అన్నట్టు...

రోడ్ము మీద.. గ్రౌండు కానుకుని ఉన్న రోడ్ము మీద... కోలాహలం. ఆర్భాటం. మందుగుండు సామాను చెవులు దద్దరిల్లేలా మోగుతూంది. తారా జువ్వలు ఆకాశంలో వెలుగు పువ్వులు పూయిస్తున్నాయి. బ్యాండ్ మేళం గట్టిగా సంగీతం కురిపించేస్తూంది. ఎంతో హడావిడి ఆర్భాటమూ... జనం, జనం.

టాపులేని కారు. శయ్యలాగ అమర్చబడిన ఎత్తయిన సీటు మీద... ఐశ్వర్యవంతుడి శవం. దాని మీద – ఎన్నో పూలదండలు. ఎంతో ఖరీదయినవి. పక్కన.. మంచిగంధపు చెక్కలు. వాటి సువాసన ఆమడ దూరానికి వ్యాపిస్తో. ఆ శవాన్ని... కారుని... అనుసరిస్తూ.. వందలకొద్దీ మనుషులు! మెల్లగా కదులుతోందా జనవాహిని. అందరూ ఒకసారయినా అటు చూస్తున్నారు. మెల్లగా.. చాలా మెల్లగా.. ఎట్టకేలకు ఆ శవం కారు... ఆర్భాటం ..మారంగా



వెళ్ళాయి.

అప్పుడు...

వెదురు పేళ్ళ . మంచం. పడుకో బెట్టిన నిచ్చెనలాటి – ఏడుకట్ల సవారి. దాని మీద మనిషి. ఆ సవారి అందంగా లేదు. ఆ మనిషి ఖరీదయిన మనిషిలా లేడు. ఆ శవానికి పట్టుమని పదిమంది కూడా జనం లేరు. శవం ముందు కుండని.. ఉట్టిలో వేలాడుతున్న కుండని పట్టుకుని నడుస్తున్నవాడు ఏడుస్తున్నాడు. ఆ శవం వేపు ఆట్టే మంది చూడటం లేదు. ఆ శవం – నిశ్శబ్దంగానూ అతి సామాన్యంగానూ... వేగంగానూ వెళ్ళిపోయింది. ఆ వెనుక.. వాళ్ళు మునిసిపాలిటీ వాళ్ళలా ఉన్నారు. వాళ్ళీడ్చుకు పోతున్న శవం – చుట్టబడిన చాపలోంచి బయట పడిపోతూంది. అయినా వాళ్ళు దానిని యీడ్చుకుపోతున్నారు తొందరగా. మునిసిపాలిటీ వాళ్ళీడ్చుకుపోతున్న శవం – ముష్టివాడిది లాగ ఉంది. చిత్రంగా.. విచిత్రంగా.. ఒకదాని వెంట ఒకటిగా.. మూడు శవాలు!ధనవంతుడిదీ.. సామాన్యుడిదీ .. పేదవాడిది.

వక్తయిన స్వాముల వారు ఖంగుతిన్నారు.. తనకి – ఆదిలోనే హంసపాదెదురయినట్లనిపించింది. ఎలాగో సర్దుకున్నారు.

"మీరు.. నేను.. అందరూ పీల్చేది ఆ గాలే. మనమందరమూ సమానమే. దేవుని దృష్టిలో మానవులంతా సమానం..." పుంజుకుంటున్నారు. శ్రోతలలో ఉన్న స్వాముల వారి అనుయాయులు చప్పట్లు కొట్టి 'లీడ్' యిస్తున్నా – ఎక్కువ మంది మాత్రం ఉపన్యాసం వినడంలేదు అది ఎంత హోరుమంటూ చెవుల్లో పడుతున్నా.

"ఇలాటి కబుర్లు కతలూ యెన్నినలేదు?అందరూ అలాగే చెబ్తారు. ఓట్ల కోసం మాట్లవి." చుట్ట వెలిగించుకుంటూ పక్కవాడితో అంటున్నాడొకడు.

"డబ్బునోడికి లేనోడికి ఓటొక్కటే. అక్కడే సమానం. ఎందుకో యీ వోట్లలచ్చన్లు!"

బాబాగారు – పద్యంలోకి దిగారు. "తల్లి గర్భమందు తాబుట్టినప్పుడు.. మొదట బట్ట లేదు.

# త్రివేణి

తుదను లేదు.."...."చూశారా, వేమువు మనకెంత చక్కగా... స్పష్టంగా... అందరూ సమానంగా జీవించండని చెప్పక చెబుతున్నాడో! మనం గ్రహించగలగాలంతే. గ్రహించి మసలుకోవా లంతే...."

"మరి – మాష్టారూ! .. బోర్న్ విత్ గోల్డెన్ స్పూనిన్ వహౌత్ – దీని కేమంటారు?" కిసుక్కున నవ్వాడొక ఎడ్యుకేటిడ్.

ఎలాగో ఒకలాగ తన మాటలు వాళ్ళ చెవిలో పోసేసి... వాళ్ళ నాకర్షించేసి... వోట్లు నొల్లేసుకోవాలని స్వాముల వారి తాపత్రయం. "ఎంత గొప్ప వాడయినా – నవమాసాలూ మాతృగర్భంలో... నరకంలాటి ఆ జైలులో గడపవలసిందే. ఎంతటి వారయినా – పుడుతూ దిగంబరులే."

"బాబాగారికి న్యూడిజం (నగ్నత్వం) మీద మోజెక్కువేమో."

"కనుక.. జన్మించేటప్పుడూ... మరణించే టప్పుడూ సర్వవిధాలా సమానులమయిన మనం..మానవులం.. మధ్యలో ఎందుకిన్ని విభేదాలూ అంతరాలూ సృష్టించుకోవాలని నేను మిమ్మల్ని ప్రశ్నిస్తున్నాను.

ఒక యువకవేమన్నాడు?" .. వక్త – మినీ కవిత చదివాడు.

"కన్ను తెరిస్తే – జననం<br>
కన్ను మూస్తే – మరణం<br>
రెప్పపాటే కద – జీవితం?"

ఆ చక్కని – చిన్న.. అల్పాక్షరాలలో అనంతార్థాన్ని ... వేదాంత సమస్తాన్ని యిముడ్చుకున్న కవితకి – నిజంగానే శ్రోతలు చకితులయ్యారు.

"రెప్పపాటు జీవితం కోసం ఎందుకన్ని రెపరెపలు? జీవించు.. జీవించని.. జీవించడం ప్రతి జీవి హక్కు. ఈ చిన్న నిజాలను.... మనం గ్రహించగలిగితే.... మానవ జీవితం మహానందంగా సాగగలదు. మహోత్కృష్టమైనది కాగలదు. చిన్న నిజాలను అర్థం చేసుకుంటే – మనలో చైతన్య దీపాలు వెలుగుతాయి. ఆ దీపాలు – మనలోని స్వార్థం, కుటిలత్వం... నైచ్యం... హింస.. దోపిడీ.. అనే చీకటి కోణాలను పటాపంచలు చేసేసి మన మనుగడను సౌఖ్యవంతమూ అర్థవంతమూ గావిస్తాయి. నేను దీక్ష పూనినది – అందరిలోనూ, యీ సత్య–చైతన్య దీపాలు వెలిగించాలనే." ఆగాడు. మంచినీళ్ళు తాగాడు. ఇంకేం చెప్పాలో తోచనట్లు.. గెడ్డం సవరించుకుంటూ... కళ్ళు మూసుకుని.. మళ్ళీ మొదటికి వొచ్చేశాడు.

"కనుక... మహాజనులారా! మనమందరమూ– మానవులం.."

"గొప్ప సత్యం! బాబాగారు అక్షరసత్యాలు చెప్పేస్తున్నారు." నవ్వు.

"ఒకేలాగ పుట్టి...." మైకు చెడిపోయినట్లుంది. మాటలు – మరి వినిపించలేదు.

మానవ జన్మ సందర్భంలో సమానత్వం గురించి వారు ఉద్ఘాటించబోతున్న ఆ క్షణంలో...

## 2

మునిసిపల్ గ్రౌండు కెదురుగా.. రాజవీథి కటువేపు ప్రభుత్వ ఆసుపత్రి. హాస్పిటల్ వెనుక.. అందమయిన అమ్మాయి ముఖం మీద లేచి మచ్చలయిన పింపుల్స్‌లా.. నగరం మధ్యలో గుడిసెలు. ఒకటి రెండూ కాదు. పాతికో ముప్ఫయ్యో. అది – లేబర్ కాలనీ. నేడో రేపో ఆ గుడిసెలను పీకేసి నగరాన్ని సుందరంగా చేయాలన్న ప్రతిపాదన పురపాలక సంఘానికి లేకపోలేదు. ఐతే– ఆ ప్రణాళిక కాగితాల మీద కమ్మగా నిద్రపోతూంది.

ఆ లబర్ కాలని పాతిక ముప్ఫయి గుడిసెలలోనూ – మరీ అధ్వాన్నంగా ఉన్న ఓ గుడిసె – జనంతో... ఆడ జనంతో బిలబిలలాడుతోంది. రాములమ్మ– నొప్పులు పడుతోంది. ఉండి ఉడిగి గుడిసె పైకప్పు ఎగిరి పోతుందేమో అన్నట్లు ఆర్తనాదాలు చేస్తూంది. ఆమెవి – పురుటి నొప్పులు. ఆ పురుటికి... రాములమ్మ నొప్పులికి






# డయనోరా CT 212 టివి కొనాలనే నిర్ణయం తీసుకోడానికి శ్రీనివాసన్‌కి 6 నెలలు పట్టింది.

## ఆయన భార్యకి 60 సెకన్లు ఎక్కువ పట్టింది.

6 నెలల క్రితం శ్రీనివాసన్ ఒక కలర్ టి.వి. కొనాలని నిర్ణయించుకున్నాడు. మార్కెట్‌లోవున్న టి.వి.ల గురించి తెలుసుకోవడం ప్రారంభించాడు. ఒక విషయం ఆయనకు సహాయపడింది.

—తనకి సరిగ్గా ఏమి కావాలో ఆయనకు తెలుసు మేటి సాంకేతిక విజ్ఞానంతో లభించే విశిష్టమైన చిత్రం మరియు స్పష్టమైన శబ్దం అందించే టి.వి. అతనికి కావాలి. సంవత్సరాల తరబడి అద్భుతంగా పనిచేసే దానిమీద అతను ఆధారపడవచ్చు.

చిరకాలంగా పేరు ప్రఖ్యాతులు సంపాదించిన చిహ్నం దానికి వుంది. విక్రయానంతరం నిపుణుల సేవ లభిస్తుంది. అతనికి అవసరమయితే. శ్రీనివాసన్‌కి ఆ నిర్ణయం తీసుకోడానికి ఎంతో కాలం పట్టింది అయితే ఒకసారి అతను నిర్ణయం తీసుకున్నప్పుడు దానికి తిరుగులేదు. డయనోరా CT212 Mark I కాక మరేదీ అతనికి అవసరంలేదు.

ప్రేమా శ్రీనివాసన్‌కి అంత తేలికగా తృప్తి కలగదు. తన భర్త ఎదురుచూసేవేకాక మరికొన్ని ఆమెకు కావాలి.

తన డ్రాయింగ్ రూమ్‌కి ఆ అదనపు ప్రత్యేకతని అందించే టివిని ఆమె కోరింది. అందమైనది, సున్నితమైన కంట్రోల్స్, అంతర్జాతీయ రూపకల్పన. ప్రేమా శ్రీనివాసన్ కలర్ టివి ఆ ప్రత్యేక తరహాకి చెందినదయి వుండాలి.

ఒక్క చూపే ఆమె డయనోరా CT 212 Mark I కొనడానికి కారణమయింది.



Dyanora®

# డయనోరా®

కలర్




వివిధ వర్ణాలే మీ మనోభావాలయితే

DYN-1836

కారణభూతుడయిన సింహాచలం – గుడిసె కల్లంత దూరంలో కూర్చున్నాడు. అతని ముఖంలో ఏ భావమూ స్పష్టంగా ప్రతిఫలించడం లేదు. గెడ్డమూ మీసమూ పెరిగి... కళ్లలో సారా ఎర్రగా నిండి. ఒకటి మాత్రం నిజం. రాములమ్మ ఆ కనేదేదో త్వరగా కని పారేస్తే బాగుండును. మూర్రోజుల్నించీ మహ చికాగ్గా ఉంది. కడుపు వల్ల మూర్రోజుల్నించి పనిలోకి పోడం లేదది. దాన్తో యింట్లో తిండానికేమి ఉండడం లేదు. రిక్షా లాగితే వొచ్చేది – సారాకో తిండికో ఏదో వొకదానికే తప్ప రెండింటికీ చాలడం లేదు. తిండి కంటె సారాయే ముఖ్యం కదా? మొదట సారా... తరువాత తిండీ.

మూర్రోజుల నుంచి తిండే.. మూణ్నెల్ల నుంచి ఆడ సుఖమూ లేకుండా చేసేస్తూంది రావులమ్మ కడుపు. ఎవడు తెచ్చుకోమన్నాడు దాన్ని కడుపు? చిరాకేస్తూంది – తిండిలేక .. ఆడ సుఖం లేక. ఆ కడుపు సంగతేలి పోతే తప్ప ఏ సుకమూ ఉండేటట్లు కనపడదు. అలా గుడిసెగిరి పోయేలా అరవకపోతే తొందరగా కని పారెయ్యో కూడదూ? తంటా తీరిపోతుంది కదా. తనక ఓ బొట్టో బొట్టుడో పుడతాడు కాబోలు. ఎవరయితే ఏం? ఏం బాముకోవాల? ఈ గుడిసెలో తమ బతుకుల్లో ఏం సుఖపడాల? బొట్టయితే ఏం... బొట్టుడయితే ఏం? ఎవళ్లో వొకళ్లు. ఇంకా చంపుకు తినకుండా త్వరగా ఊడిపడితే అదే చాలు.

## త్రివేణి

నిషాలో... వైయిరాగ్యంతో ..నిట్టూర్చాడు. ఓడి అంటిద్దామని తలెత్తేసరికి...

★ ★ ★ ★ ★

మూడంతస్తుల మేడ అది. ఫైవ్‌స్టార్ హొటల్లా ఉండడమే కాదు. అంత ఖరీదయినది కూడా. అది – మెటర్నిటీ నర్సింగ్‌హోమ్. అధమం ఐదు వేలయినా పట్టుకోనిదే ఆ నర్సింగ్‌హోమ్‌లో ప్రసవం జరపరు. అక్కడి డాక్టరు – విదేశాలకి వెళ్లి వచ్చినది. అసలక్కడ డాక్టర్లనరు. గైనకాలజిస్ట్.. అబ్‌స్టెట్రిషియన్.. అలాగ.. సామాన్యులకి నోరు తిరగని.. అర్థంకాని పేర్లుంటాయక్కడి డాక్టరమ్మలకి. వాళ్లు యీ లోకంలో వాళ్లలా కాక... దేవలోకంలోంచి దిగి వొచ్చిన వాళ్లలా ఉంటారు – మల్లెపూవు కంటె తెల్లనివీ, పావురం రెక్క కంటె మెత్తనివీ అయిన దుస్తుల్లో. ఆ నర్సింగ్‌హోమ్... అదే యింద్ర భవనంలా ఉంటుంది. ఏ. సి. చేయబడి – ఎన్నో హంగులతో నిండి ఉంటుంది. లేబర్ రూమ్ – (లేబరు క్లాసు కనుకుంటే – లెంప లేసుకోవలసినంత నేరం. అది.. పెద్దింటి స్త్రీల ప్రసవ వేదనా మందిరం) నుంచి యివతలకు ఏవిధమయిన శబ్దమూ రాజాలదు. సౌండ్ ప్రూఫ్ రూమది. నిజానికక్కడ – ప్రసవం మేడీజీ. నొప్పి..చికాకు... ఏమీ లేకుండా బేబీస్‌ని ప్రసవింపజేసే – మందులు... ఇంజక్షన్స్... యంత్ర సామగ్రిలాటి ఇన్‌స్ట్రుమెంట్సూ బోలెడున్నాయక్కడ. పిండి కొద్దీ రొట్టె ఏమో కాని అక్కడ-ఫీజు కొద్దీ సులభతర ప్రసవం. అక్కడ బేబీని డెలివర్ చేయడం ప్రిస్టేజ్. గ్రేట్ లేడీస్ అక్కడ గ్రేట్ బేబీస్‌ని డెలివర్ చేస్తారు. ఆ వూర్కి ఆ నర్సింగ్‌హోమ్ గర్వకారణం. ఆ వూరి గొప్పవారికా నర్సింగ్‌హోమ్ –ప్రిస్టేజ్ సింబల్. సోషల్ స్టేటస్. అందుకే అక్కడ వెయిట్ చేస్తున్నారు వెంకటేశ్వర్రావ్. వెంకటేశ్వరరావంటే – వెంట్రు లక్షలు పెంచుకున్న బిజినెస్ మాగ్నెట్. ఊళ్లో పది మంది రిచ్‌మన్‌లోనూ ఒకరు. అందుకే – ఆ నర్సింగ్‌హోమ్ తాలూకు వెయిటింగ్ రూము ఆత్రత పడిపోతూంది. ఆరాటపడి పోతోంది. కంగారు పడిపోతూంది. హడావిడి పడిపోతూంది.

వెయిటింగ రూమనబడే ఆ పెద్ద హాలులో సౌకర్యాలు తక్కువుండి కాదు. అక్కడ సోఫాలున్నాయి, వాటిలో కూర్చోనూవచ్చు. పడుకోనూవచ్చు. అక్కడ– వాష్ బేసినులున్నాయి. లావొటరీస్ ఉన్నాయి హాలుకి అటాచ్‌డ్‌గా. టీపాయి మీద ఫారిన్ మాగజైన్లున్నాయి. వాటి అట్టల మీద అందమయిన బొమ్మలున్నాయి. అక్కడ పిలవకుండానే పలికే బోయ్ ఉన్నాడు. బ్రాంది నుంచి బిరియానీ వరకూ ఏదయినా చిటికెలో

తెస్తాడు. అక్కడ ఫ్రిజ్ ఉంది. దానిలో ఐసూ ఉంటుంది, ఐసువాటరూ ఉంటాయి. అక్కడ – లేనివిలేవు. బ్రాందీ తాగి.. బిర్యానీ తిని.. సోఫాలో దొర్లుతూ... ఫారిన్ మాగజైన్లు చూస్తూ... గంటలని నిముషాలుగా గడిపెయ్యవొచ్చు. నిజానికి ఆ వెయిటింగ్ హాలు గంటల్ని నిముషాలుగా చేసేందుకే. అందుకే అక్కడ – సంగీతం. గోడల మీద –సౌందర్యం (నిండిన చిత్రాలు). ఐతే – అక్కడ అనుభవించే ప్రతి సుఖ నిముషానికీ బిల్లు ఔతుంది. చాలా ఎక్కువే ఔతుంది. వెంకటేశ్వర్రావు లాటి వాళ్ళకా బిల్లు లెక్కలో నిది కాదు. అందుకే– ఆ వెయిటింగ్ హాలు కంత కంగారు. అలాటి వారు

కొందరి పేషంట్ల (క్లయింట్ల) కా నర్సింగ్‌హోమ్ ప్రిస్టేజయితే – కొందరు (వెంకటేశ్వర్రావ్ లాటి ఐశ్వర్యవంతులు) ఆ నర్సింగ్‌హోమ్‌కే ప్రిస్టేజ్. వారడగుపెట్టడం వల్ల – ఆ హోమ్ ధనమయిందని వాళ్ల భావన. వారిని సర్వవిధాలా సంతృప్తి పరచాలనీ తద్వారా తమ నర్సింగ్‌హోమ్‌కి ప్రస్తుతంతో పాటు ముందు ముందు కూడా చాలా లాభమని వాళ్ల ఆశ. అందుకే ఆయన పట్ల అంత శ్రద్ధ. అందుకే ఆయన శ్రీమతి ప్రసవం పట్ల అంత ఆత్రతా, శ్రద్ధా– స్టాఫ్ అందరికీ.

"మీకెవరు కావాలి రావ్‌జీ? బోయ్ ఆర్ గాళ్?" ఆమె చేతిలో పనే అన్నట్లడుగుతోంది డాక్టర్.

"ఎవరయినా ఫరవాలేదు. ఎవరయినా వొకటే." నవ్వారాయన. వారి శ్రీమతి చుట్టూ డాక్టర్స్.... ప్రసవ మందిరంలో.

★ ★ ★ ★ ★

చిన్న అద్దెయిల్లు. ఇంటి ముందు– రోడ్డు మీద.. గట్టులాటిది ఉంటే –దాని మీద కూర్చున్నాడు పాపారావ్. అతని దృష్టి మాత్రం – యింటి వేపే ఉంది. వరండాలో ఆడవాళ్ళున్నారు. వరండా వెనుక గదిలో తన భార్య ఉంది. ఆమె పక్కన – మంత్రసాని ఉంటుంది. ఔను. తన భార్య పురుడు పోసుకోబోతోంది. తనకి అబ్బాయో... అమ్మాయో.. ఊహుఁ.. అబ్బాయే... అమ్మాయి కాదు... పాపం శమించుగాక.. అబ్బాయే పట్టాలి. అమ్మాయి వొద్దు గాక వొద్దు. ఒకర్తుంది చాలు. బాబోయ్... ఆడపిల్ల ఎంత మాత్రమూ వొద్దు. ఆడపిల్లంటే – తనలాటి సంసారి పని దివాలాయే. ఆడపిల్ల పుడుతూనే ఖర్చు. బట్టలు.. నగలు.. కట్నం!... ఇంతా చేస్తే ఆ మొగుడు ఎప్పుడు పుట్టింటికి తగిలేస్తాడేమో అని భయమే. ఆడపిల్ల – పెట్రోల్ లాటిది.. అపవాదనే నిప్పు యిట్టే అంటుకుంటుంది ఆమెకూ తద్వారా యింటికీ. గుండెల మీద కుంపటి. ఇల్లు దివాలా తీయించేది. మనశ్శాంతి లేకుండా చేసేది. చెప్పులనరగదీసేది. మనిషిని లొంగదీసేది. వొద్దు బాబోయ్...వొద్దు. ఆడపిల్ల ఎంత మాత్రమూ వొద్దు. తనలాటి సామాన్య సంసారికి... పగవాడిక్కూడా వొద్దు. అబ్బాయయితే...

ఐదేళ్లు కాదు, పదేళ్ల వరకూ మొండి మొలతో తిరిగినా బాధలేదు. వొంటి మీద బంగారం పెట్టక్కర్లేదు. చదువు చెప్పిస్తే చాలు. మగాడు ఎలాగయినా బతికీగలడు. చివరకి కూలి పని చేసుకునో.. మరొకడి నెత్తి కొట్టో.. ఎలాగో వొకలాగ.

మగ– మహారాజు!.. నిజమే. మగపిల్లడయితే – వేల కొద్దీ కట్నం. ఉద్యోగం చేస్తే– నెల కింత జీతం... ఇంటికి రాబడి. కట్నం ఫిక్సెడ్ డిపాజిట్. జీతం – రికరింగ్ డిపాజిట్. కట్నంతో కోడలు.. అంటే.. చాకిరి చేసే మనిషి. ఫ్రీ సర్వెంటు. అన్నివిధాలా లాభమే. నష్టమన్నదే లేని వ్యవహారం. మగపిల్లడయితే – యిల్లే బంగారం.

పుట్టబోయేది మగపిల్లడయితే.. ఇంతకు మునుపు పుట్టిన ఆడపిల్లలకు పాపపరిహారం. ఆ మైనస్‌లకి యీ ప్లస్. కనీసం –లాభనష్టములు సమానం. ఏమో... ఏం చెప్పగలరు? తక్కువ కట్నంతో ఆడపిల్లల పెళ్లయి.... ఎలాగూ వీడి పెళ్లి దాని తరువాతే ఔతుంది కనుక – అంతకంత లాగెయ్య వొచ్చునేమో. అదృష్టం బాగుండి.... మంచి ఉద్యోగం దొరకాలే కానీ... ఎంతెంత కట్నాలు... ఎన్నెన్ని కానుకలు!

పుత్రుడు – పున్నామ నరకం నుంచి తప్పించువాడు.

పుత్రుడు – వంశోద్ధారకుడు. ఇంటి పేరు నిలిపేవాడు.

పుత్రుడు – మాతాపితరులకు పుత్రోత్సాహము కలిగించువాడు. అన్నివిధాలా పుత్రుడే లాభదాయకం. అందుకే– పెద్దవాళ్లు పూర్వులూ కూడా –పుత్రోత్సాహమనే అన్నారు కానీ పుత్రికోత్సాహం అనలేదు. వాళ్లది– దివ్యదృష్టి.. వారి పలుకులమోఘాలూ.

ఏడుకొండలవాడా.. వెంకటేశ్వరస్వామి.. నాకు అబ్బాయినే ప్రసాదించు. అమ్మాయిని ఎంత మాత్రమూ వొద్దు. అబ్బాయి పుట్టాడో.... నీ కొండకు వొస్తాము. తలనీలాలర్పించుకుంటాము. నేనూ, మా అబ్బాయీ. ఈ వొక్క కోరికా తీర్చు. ఈ వొక్క వరమూ ప్రసాదించు. ఆపద మొక్కులవాడా!... నాకు ఆడపిల్ల మాత్రం వొద్దు.

ఇంట్లోంచి... పెళ్లాం వేస్తున్న కేకలతనికి స్పష్టంగా వినిపిస్తున్నాయి. అతని గుండె దడదడ లాడింది. భార్య వేదనకు హృదయం ఆర్ద్రమయి ఎంత మాత్రమూ కాదు. ఆమె కనబోయేది ఆడపిల్లా మగపిల్లాడా అని. అంతే. ఆత్రతతో అతని గుండె అధిక వేగంతో కొట్టుకుంటూంది.

(ఇంకా ఉంది)

## సాక్షాత్కారం

సర్వతేజోమయుణ్ని కదా అని
కాంతులు వెదజల్లుతూ
కళ్ళు మిరిమిట్లు గొలిపితే
ఎలా దర్శించగలను?
నయన మనోహరంగా
మృదుల రాగరంజిత రూపంలో
సాక్షాత్కరించు
స్వామి!

–గోవిందరాజు రామకృష్ణరావు

ఇటీవల ఢిల్లీ తెలుగు సంఘం వారు ప్రముఖ మిమిక్రీ కళాకారుడు 'ధ్వని-బ్రహ్మ' శ్రీ చిట్టూరి గోపీచంద్ (గుంటూరు)ని, మైమ్‌కళాకారుడు శ్రీ కళాధర్‌ను ఢిల్లీకి ఆహ్వానించినప్పటి చిత్రం. ఢిల్లీ తెలుగు సంఘం కార్యదర్శి శ్రీ ఆర్. ఏ. ఎస్. ఆర్. రావును ఈ చిత్రంలో చూడవచ్చు.



# వ్యక్తిగతం



మాస్కోలో జరిగిన ప్రపంచ చదరంగం ఛాంపియన్ షిప్ పోటీలలో గారి కాస్పరోవ్ (22) అత్యద్భుతమైన విజయాన్ని సాధించి గత పదేళ్ళుగా మకుటంలేని మహారాజుగా ఉన్న అనతొలీ కార్పోవ్‌ని తెరమరుగుకి వెళ్ళేలా చేసారు. అతి చిన్నవయసులో ప్రపంచ ఛాంపియన్ అయిన ఘనత కాస్పరోవ్‌కి దక్కింది. ఈ పోటీలో గెలిచినందుకు ఆయనకి 10 లక్షల స్విస్ ఫ్రాంక్‌లు, స్ఫటికాలతో తయారైన చదరంగం బహుమతిగా లభిస్తాయి... □



నేర పరిశోధనలో అగ్రగణ్యుడిగా పేరు పొందిన శ్రీ ఎ. స్వామి (78) ఇటీవల బొంబాయి లోని బ్రీచ్ కాండ్ ఆసుపత్రిలో మరణించారు. ఎన్నో బ్యాంకు దోపిడీలు, హత్యలని పరిశోధించి నేరస్థులని చట్టానికి పట్టి ఇచ్చిన ఈయన 1930లో సబ్ ఇన్‌స్పెక్టర్‌గా పోలీసు శాఖలో చేరారు. స్వయం కృషి, ప్రతిభలతో 1967 లో పదవీ విరమణ చేసే సమయానికి ఆయన పోలీసు డెప్యూటీ కమిషనర్ స్థాయికి ఎదిగారు. సంచలనం సృష్టించిన లాయడ్స్ బ్యాంక్ దోపిడీ కేసులో దోషులని పట్టుకుని చట్టానికి అప్పగించినందుకు ఈయనకి ముఖ్యమంత్రి బంగారు పతకం బహూకరించ బడింది. చునావాలా నాలుగు హత్యల కేసు, జైపూర్ బ్యాంక్ దోపిడీ, బందిపోట్లచే మహాలక్ష్మీ దేవాలయం దోపిడీ కేసులు ఈయన పరిష్కరించిన వాటిలో పేరెన్నికగన్నవి. 1946 భారత పోలీసు మెడల్, 1956లో పోలీసు పతకం అందుకున్నారు. ఈయన విశిష్ట సేవలకి గుర్తింపుగా 1966 లో అత్యంత ప్రతిష్టాకరమైన రాష్ట్రపతి పోలీస్ మెడల్ లభించింది. ఈయనకి భార్య, కుమారుడు, ప్రముఖ గాయనిగా పేరు పొందిన శ్రీమతి ఉషా ఉథుప్ (ఉషా అయ్యర్)తో సహా నలుగురు కుమార్తెలు ఉన్నారు. మరొక కుమారుడు శ్రీ త్యాగరాజ్ స్వామి ఈయన మృతికి మూడు రోజుల ముందే కాన్సర్‌తో మరణించారు..... □

# వారఫలం

## 20-12-1985 శుక్రవారం మొదలు
## 26-12-1985 గురువారం వరకు

★ **మేషం :** మీ రాశికి గ్రహానుకూలం గల వారం, ధనయోగం, లాభం, వృత్తియందు అనుకూలం, కళారంగానుభవం గల వారికి సదవకాశాలు. ఒకానొక విషయంలో అంటే వివాదగ్రస్తమైన విషయంలో మేలు కలుగుతుంది. స్త్రీలకు . అన్ని రంగాలలో శ్రమించేవారికి మేలే.

★ **వృషభం :** పూర్వం చేసిన పనులు మీ ప్రగతికి అడ్డం రాగలవని గ్రహింపగలుగుతారు. అడపా దడపా ప్రయాణాలకు కూడ అవకాశం గల వారం. అడిగినవారినల్లా నమ్మి కష్టించి సంపాదించిన డబ్బు అప్పుగా యివ్వడం ఏమంత శ్రేయంగాదు. -మరలా వసూలు కావటం కష్టమే కదా! స్త్రీలకు : ఉద్యోగరీత్యా చేసిన ప్రయత్నం సఫలమే.

★ **మిథునం :** మీ మాటకు విలువ పెరుగుతుంది. సర్వవిధాలా ముఖ్య గ్రహాలు అనుకూలంగా ఉండటం వలన ధనధాన్య సంగ్రహమునకు, ఎంతో కాలంగా ఆశించిన వాహనం సేకరింపగలగటం గమనింపదగిన అంశాలు. స్త్రీలకు : ఒక వేళ నూతన వస్త్ర సేకరణయో, విలువగల నగల సేకరణకో అవకాశమున్నది.

★ **కర్కాటకం :** మీ అంచనా ప్రకారమే శుభకార్యానుకూలత, మీరు ఆశించిన విధంగానే వృత్తియందు ప్రగతి, మీరు తలంచిన ప్రకారమే ప్రయాణానుకూలత నిశ్చయం. గ్రహానుకూలత గల వారం. స్త్రీలకు : హటాత్తుగా కొందరకు ప్రయాణం, కొందరకు బంధుజాలంతో శుభప్రస్తావనలు.

★ **సింహం :** మీతో ఎంతో కాలంగా సహకరించిన మిత్రులో బంధువులో, గ్రహానుకూల్యత లేకపోవటంతో దూరమవుతారు. ఒకవేళ విరోధులుగా మారటం కూడ సంభవమే. 'తమ తమ నెలవులు తప్పిన తమ మిత్రులే శత్రువులు' గదా! స్త్రీలకు . నూతనాంశాలు గ్రహిస్తారు.మిత్రవర్గాన్నుండి అనుకూలం.

★ **కన్య :** 'శని, గురు గ్రహాలు' బాగా అనుకూలురు. ఈ వారమంతా యీ రాశి జాతకులు సర్వవిధాలా మేలు పొందగలుగుతారు. ఉద్యోగ యత్నం చేసిన వారికి అనుకూలమే. స్త్రీలకు : కళారంగాన, సాహితీరంగాన, నాటక నాట్య రంగాన ప్రవేశముంటే మేలే జరుగుతుంది, గమనించాలి.

★ **తుల :** గ్రహానుకూలత లేని సమయాన జాగ్రత్తగా ఉండాలి. మౌనంగా-ఉండటం కూడా మేలే. లేనిపోని వ్యవహారాల జోలికి పోవటం ఏమంత శ్రేయంగాదు, అధికారమూ దుర్వినియోగం చేయరాదు. స్త్రీలకు : ప్రయాణ మూలకంగా యిబ్బందులు రాగలవు.

★ **వృశ్చికం :** స్థితియందు కొంత మెరుగున్నా, అధిక వ్యయం, యిబ్బందులకు లోనుకావటం, ఒకవేళ అటు యిటు తిరుగుచూ డబ్బు పోగొట్టుకోవటం ఈ వారం 'గ్రహచార'మని గ్రహించాలి. స్త్రీలకు : ఉద్యోగరీత్యా మాట పడగలరేమో! గ్రహించి, మెలగండి.

★ **ధనుస్సు :** ఆదాయం చేకూరుటకు అనుకూలమైన గ్రహస్థితి యున్నది. పత్రికా నిర్మాతలకు, ప్రకటనదారులకు. వ్యవస్థయందు పనిపాటలు చేసేవారికి అనుకూలప్రదం. నూతన వ్యాపారంలో మెలకువ గల వారికి, చేయి తిరిగిన వ్యాపారానుకూల్యత గల వారికి చక్కటి గ్రహానుకూలం. ధనలబ్ధి, స్త్రీలకు : కళా సాహిత్యాభిమానులకు సదవకాశాలు, స్వల్పంగా ఆదాయం.

★ **మకరం :** మంచి ఫలితాలను చూరగొంటారు. ధనధాన్య సంపత్తికి అనుకూలం. ఉన్నత విద్యార్జన రీత్యా ప్రాకులాడు వారికి విజయవంతం. కొందరకు గృహ మార్పుగాని, నూతన గృహ నిర్మాణ కార్యకలాపములందు నిమగ్నతగాని చెప్పదగిన వారం. అంతేగాక వారాంతంలో యిష్ట బంధువులు యింటికి రాగలరు. స్త్రీలకు : స్వల్పాదాయం, ఉద్యోగరీత్యా సంకట పరిస్థితులు.

★ **కుంభం :** అనేక విధాలా మేలైన దినాలు. శారీరకంగా జాగ్రత్తపడవలెనని హెచ్చరిక. చాలామందికి ఉద్యోగ వృత్తులందు మంచి పరిస్థితి యేర్పడిందనే ఆనందం కలుగుతుంది. చాలామందికి చిన్నవో, పెద్దవో ప్రయాణాలు కూడ చెప్పదగిన సమయమే. స్త్రీలకు : సర్వత్రా అనుకూలం. ఆదాయం, ఆనందం.

★ **మీనం :** అయినవారితో మీకు ఈ వారం పేచీలు రావచ్చు. అనుకున్న వ్యవహారాలు ఏవీ ఎటూ తెమలకపోవచ్చు. జాయింటు వ్యాపారమయితే యిబ్బందులుండగలవు. బాగా చాకచక్యంతో మిత్రబృందంతో మెలగవలసిన కాలం. స్త్రీలకు : ఆస్తి, అంతస్థులందు పెంపు, నూత్నోద్యోగ యత్నమందు అనుకూలం.

విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి




సృష్టిలో ఆడవారు అందంగా ఉంటారా? లేక మగవారు అందంగా ఉంటారా? అనే ప్రశ్న ఎదురైనప్పుడు తపీమని సమాధానం చెప్పడానికి కుదరదు. కాని శాస్త్రాధారాలని ముందుంచుకొని మాట్లాడితే ఆడవారికన్నా మగవారే అందమైనవారని సందేహించకుండా చెప్పవచ్చు. సాక్ష్యాల గురించి మాట్లాడాలికదా!

ప్రకృతిలో కనిపించే జంతుజాలాన్ని గురించి ఆలోచిద్దాము. మగసింహపుఠీవి, సౌందర్యం, రాజసం ఆడసింహానికి లేవు! అంబోతు అంగసౌష్టవం ఆవుకులేదు! మగనెమలి ఎంత అందంగా ఉంటుందో అందరికీ తెలుసు. ఆడనెమలి దానిముందు నిలువలేదు. మదపుటేనుగు పురుషదర్పంతో ఘీంకరిస్తూ ఉంటే ఎంత హృద్యంగా ఉంటుందో చెప్పనలివికాదు. ఆడ ఏనుగు దానికి ఎంతమాత్రమూ పోటీకాదు. మగదుప్పి అందం ఆడదుప్పికిలేదు. కోడిపుంజు అందం కోడిపెట్టకులేదు. ఇలాగ ఏ జంతువును తీసుకొన్నా మగజంతువే అందంగా ఉంటుంది. అలాగే మనిషి విషయంకూడా!

స్త్రీల అందాలని గురించి మనకవులు తక్కువేమి వర్ణించలేదు. అంగాంగాన్ని తనివితీరా కవిత్వంలోకి దింపి ఆనందించారు. అయితే అంతమాత్రాన స్త్రీలు అందంగా ఉన్నారని అర్థంకాదు. స్త్రీపట్ల ప్రకృతిగతంగా మగవాడికుండే చాపల్యం కవులచేత అలా వర్ణింప జేసింది. కళ్ళు కలువలని, పళ్ళు మల్లెపూలని, మోము చందమామ అని, అధరాలు మందారాలని, వక్షోజాలు రివ్వున ఎగిరే చకోరపక్షులని, నడుము సన్నాయి అని, జఘనం గగనమని– ఇలా రకరకాలుగా స్త్రీలని పొగడి పొగడి మహిళలపట్ల పురుషులకుండే మోహాన్ని తెలుపుకున్నారు కవులు. ఆ కవులే మగవారిని గురించి వర్ణించేటప్పుడు ఆజానుబాహువు, ఆరడుగులవాడు, మేఘగంభీర రూపుడు, సుమసదృశ హృదయుడు, సువిశాలమైన వక్షస్థలమున్నవాడు, కండలు తిరిగిన దేహమున్నవాడు– అంటూ వర్ణించారు. ఇవంతా కల్పనలేకాని శాస్త్రరీత్యా ప్రపంచంలో ఎవరూ నూటికి నూరుపాళ్ళు స్త్రీగాకాని, పురుషుడుగా కాని ఉండరు!

స్త్రీ పురుషభేదం లేకుండా అందరిలో స్త్రీ హార్మోన్‌లు, పురుష హార్మోన్‌లు ఉంటాయి. స్త్రీ హార్మోన్‌లు ఎక్కువగా ఉండి, పురుష హార్మోన్‌లు తక్కువగా ఉంటే స్త్రీ రూపొందుతుంది. అలాగాక దీనికి వ్యతిరేకమైన పరిస్థితి ఏర్పడితే పురుషుడు రూపొందుతాడు. స్త్రీ, పురుష హార్మోన్‌ల మోతాదునుబట్టి స్త్రీ, పురుష లక్షణాలు బహిర్గతమవుతాయి. హార్మోన్‌లతో వచ్చేమార్పులే కాక, జన్యుపరమైన మార్పులు కూడా సంభవిస్తే నపుంసకులు, అర్ధనారీశ్వరులు పుట్టే అవకాశం ఉంది. కాబట్టి చెప్పొచ్చేదేమిటంటే కండలు తిరిగిన ఆడవాళ్ళు; సుమకోమలులుగా వయ్యారాన్ని ఒలకబోసే మగవారూ ఉన్నారని! అప్పుడు అందం ఎవరిసొత్తని ప్రశ్నించుకొంటే సమాధానం అంత తేలికగా దొరకదు. అందువల్ల మగతనపుపాలు ఎవరికైతే హెచ్చుగా ఉంటుందో వారే అందంగా ఉంటారని చెప్పుకోవచ్చు!

మగవారు అందంగా ఉంటారు అనే నిర్ణయానికి వచ్చాక, అందమైన మగవారు ఆడవారిని అయస్కాంతాలలాగా ఆకర్షిస్తారా? లేదా? అనే విషయం చర్చనీయాంశం అవుతుంది. అందమైన మగవాళ్ళు ఎలా ఉండాలో ఇంతకు ముందే తెలుసుకొన్నాము కదా! అలాంటివాళ్ళుగా దుర్యోధనుడు, రావణాసురుడు, భీమసేనుడు, హిరణ్యకశ్యపుడు మొదలైనవాళ్ళు కనిపిస్తారు. విజ్ఞానశాస్త్రాల దృష్ట్యా చెబితే వీరంతా నూటికి తొంభైశాతం మగవారే! అంటే ఆడవారిని విపరీతంగా ఆకర్షించవలసినవారు!! కాని వాస్తవానికి అలా జరగలేదు. దుర్యోధనుడంటే పడిచచ్చిన ఆడవాళ్ళులేరు! రావణాసురుని మోహించి ఎంతోమంది యక్షగంధర్వ కిన్నెర కింపురుష దేవరాక్షస స్త్రీలు వచ్చినా శ్రీకృష్ణునితో పోలిస్తే అదేపాటి? భీమసేనుని హిడింబి ఒకటే ఇష్టపడింది. ద్రౌపదికి భీమసేనుడు భర్త! ఎవరూ కాదనరు. కానీ ఆమెకి సన్నగా, ఆడవాళ్ళలాగా ఉండే నకులుడు, సహదేవుడు అంటేనే ఇష్టం! అర్జునుడు బృహన్నలగా ఉన్నప్పుడు మరి ముచ్చట పడి పోయిందట ద్రౌపది! హిరణ్యకశ్యపుని అంతటి అందగాడిని ఎంతమంది స్త్రీలు ప్రేమించారు? కాబట్టి పూర్తి మగవాడిని– అంటే, స్త్రీలక్షణాలు ఏమాత్రం లేనివారిని– ఆడవారు ఇష్టపడరని తెలుస్తుంది.

మరి ఆడవాళ్ళకి ఎవరంటే ఇష్టం? అనే ప్రశ్న ఉదయిస్తుంది. దీనికి సమాధానం చెప్పుకోవాలంటే పదహారువేలా ఎనిమిదిమందిని అయస్కాంతంలా ఆకర్షించిన కృష్ణపరమాత్ముడిని గురించి కాస్త తెలుసుకోవాలి. రాధని వీరిలో చేర్చలేదు సుమా! కృష్ణుని గురించి వర్ణించే శ్లోకం ఇలా ఉంటుంది.

కస్తూరి తిలకం లలాట ఫలకే
వక్షస్థలే కౌస్తుభం
నా సాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం
కరే కంకణం
సర్వాంగే హరిచందనంచ కలయం
కంఠేచ ముక్తావళి
గోపస్త్రీ పరివేష్టితో విజయతే
గోపాల చూడామణి–

శ్లోకం అర్థాన్ని బాగా గ్రహిస్తే ఆడవారికి మల్లే కృష్ణుడు అలంకరణ చేసుకొన్నాడని తెలుస్తున్నది. సినిమాకృష్ణుడిలా ఈ కృష్ణుడికి






పెద్దబొజ్జ, ఎత్తు పిర్రలూ లేవు. ఈ కృష్ణుడు నల్లనివాడు. సన్నటివాడు నడుము ఉందా? లేదా? అనిపించేవాడు. లావణ్యము, సౌకుమార్యము స్వంతం చేసుకొని ఆడదానిలాగా నడిచేవాడు. ఒక్క మాటలో చెప్పాలంటే కృష్ణుడు ఉట్టి ఆడంగిరేకులవాడు! అయితేనేం ఆడవాళ్ళు ఆయనంటే పడిచచ్చారు. రాసలీలలు మొదలుపెట్టి చిట్టచివరికి వేదాంతం చెప్పాడనుకోండి. అది వేరే సంగతి. చెప్పేదేమిటంటే ఆడవారి మనస్తత్వం, ఆడవారిని అనుసరించే తత్త్వం ఉన్న మగవారినే ఆడవాళ్ళు ఇష్టపడతారు! ఇలాంటి లక్షణమే జంతువులలో కూడా ఉందని పరిశోధనలు స్పష్టం చేస్తున్నాయి. అడంగిరేకులవాడని మగవాళ్ళు గేలిచేస్తే చేసారుకాని, ఆడవాళ్ళు మాత్రం ఆ ఆడంగిరేకుల వాడిపట్ల విపరీతమైన మక్కువను

పెంచుకొంటారు. ఇది ఆషామాషికి అంటున్న మాటకాదు. పరిశోధనా యధార్థం. కృష్ణుడి సంగతి వదలిపెట్టి రాముడి సంగతి తీసుకొన్నా అంతే. ఆయన లావణ్యం చూచి ఇనుపకచ్చడాలు కట్టుకొన్న మునులు సైతం మోహించారట! మీసాలు గడ్డాలు కూడా రామునికి ఉన్నట్లు కనిపించవు. పైగా నీలమేఘశ్యాముడు! 'అరవింద దళాయ తాక్షం' అని కదా రాముణ్ణి వర్ణిస్తారు. మగ మహాధీరులైన రాక్షసులని కూడా కాదనినెరజాణతనమున్న రాముడినేకదా శూర్పణఖమోహించేంది. ఇక ఈశ్వరుని సంగతి చూస్తే ఆయన సాక్షాత్తూ అర్ధనారీశ్వరుడు! వయసుతో నిమిత్తంలేకుండా ఆయన సౌకుమార్యాన్ని చూచేకదా గిరిజ మరి మరి ఇష్టపడి కోరుకొంది.

అందుచేత రెండు నిర్ణయాలకి రావచ్చు. మొదటిది అందంలో ఆడవారికన్నా మగవారే పైచేయి అనే అంశం! ఎవరి అందం వారిదే అనుకొన్నా మగవాడి అందం ముందు స్త్రీ అందం నిలవదనేది స్పష్టం. అయితే స్త్రీకి ప్రకృతి దీనికి నిష్కృతిగా మరోవరం ప్రసాదించింది. బాధలని, వ్యాధులని తమాయించుకోగలశక్తి ఆడవారికే ఎక్కువ. ఎక్కువమంది ఇళ్ళలో బామ్మలు, అమ్మమ్మలు ఉంటారు. తాతయ్యలు చాల తక్కువ. అంటే ఆడవారికన్నా సహజంగా మగవారే ముందుగా మరణిస్తారని తెలుస్తుందన్నమాట. రెండవ అంశం ఏమిటంటే ఆడవాళ్ళు మగధీరులకన్నా ఆడతనం కలిగిన మగవాళ్ళనే ఇష్టపడుతారనే సంగతి! ఆడవారితో సర్వేలు జరిపి నిర్ణయించిన వాస్తవం ఇది!

ఏది ఏమైనా ఇలాంటి అంశాలలో త్వరగా నిర్ణయాలకు రావడం సముచితంకాదు!

—డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# భగవాన్! నాకీ జీవితం వద్దు

హాల్లో లైట్స్ వెలిగాయి . . .

అప్పటి వరకూ సరిత ఒడిలో ఆమె చేతుల్లో చేతులు కలిపి కూర్చున్న శేఖరం చటుక్కున చేతులు తీసుకున్నాడు.

సరిత కూడా సర్దుకుని తల వంచుకుని కూర్చుంది శేఖర్ లేచి నుంచున్నాడు

"డాడీ .. డాడీ. "

శేఖర్ అప్రయత్నంగా తల త్రిప్పి చూశాడు. దూరంగా పాప, తనను గుర్తు పట్టి ఆనందంగా చేతులు ఊపి పిలుస్తోంది.

శేఖర్ ముఖం కత్తి వాటుకు నెత్తురు చుక్క లేకుండా తెల్లగా పాలిపోయింది. క్షణకాలం ఏం చెయ్యాలో తోచనట్లు నిస్తేజంగా నిలబడిపోయాడు.

తండ్రి తనను గుర్తుపట్టలేదనుకున్నపాప మరింత గట్టిగా, "డాడీ. .ఇటు...ఇటు " అంటోంది

అవును....ఈ రోజు పాప సినిమా అంటూ ఏడిస్తే, "అమ్మా, నువ్వు రెడీగా వుండండి.. త్వరగా వచ్చేస్తాను ."అని చెప్పాడు...

తనకా విషయం గుర్తే లేదు. సరిత తల ఎత్తి పాప వంకా, శేఖర్ వంకా మార్చి మార్చి చూసింది

అంతే. ..అప్పటి వరకూ పుచ్చ పువ్వులా వికసించి వున్న సరిత ముఖంలో "ఇదీ" అని చెప్పలేని భావమేదో చోటు చేసుకుంది.

'తృష్ణజ'



పాప ఇంకా తండ్రిని పిలుస్తూ చేతులూపుతూనే వుంది. శేఖర్ వస్తున్నానన్నట్లుగా పాప వంక చూస్తూ చెయ్యి ఊపాడు.

అప్రయత్నంగా అతని చూపులు శారద చూపుల్లో చిక్కుకున్నాయి.

శారద నిర్వికారంగా చూస్తోంది.....

ఆ చూపుల్లో భర్తను చూసినప్పటి ఆనందం లేదు...భర్తను మరో స్త్రీ ప్రక్కన చూసిన ఆశ్చర్యం లేదు...

భర్తను అలా చూడవలసి వచ్చినందుకు దుఃఖం లేదు.. అతని ఆ ప్రవర్తనకు అసహ్యం లేదు...కానీ, జాగ్రత్తగా గమనించి చూస్తే భూమి లోతుల్లో జల సంపద ఉన్నట్లే ఆమె హృదయపు లోపొరల్లో దుఃఖపు వెల్లువ వుంది. ఆ దుఃఖపు వెల్లువ ఉప్పొంగి, గట్లు త్రెంచుకుని ప్రవహించి ఏదో ఒకరోజు తనను ముంచి వేస్తుందని శేఖర్‌కు తెలుసు. శారద ఈమధ్య బాగా చిక్కిపోతోంది...తన మీది కోపంతో ఆరోగ్యం చెడగొట్టుకొంటోంది.

శారదను చూస్తుంటే భయంతో పాటు జాలి కూడా కలుగుతుంటుంది శేఖర్‌కు.

ఎలాంటి శారద ఎలా అయిపోయింది...? ఆమె ముఖం మీది చిరునవ్వు తొంగి చూసి ఎంత కాలమయ్యిందో... ఆమెకు ఏమని చెప్పి తన తప్పును సమర్థించుకోగలడు...? శేఖర్ వంగి సరితకు ఏదో చెప్పాలనుకునీ, ఆమె అతనికా అవకాశం ఇవ్వకుండా తల వంచుకుని కూర్చోడంతో బరువుగా ఒక్కో అడుగే వేస్తూ కుర్చీలు దాటుకుంటూ పాప దగ్గరికి వెళ్ళాడు. పాప ఆనందంగా తండ్రి చేతులు పట్టుకుని ఊపుతోంది.

"డాడీ! వస్తానని రాలేదేం...? నువ్వు రాకపోతే మమ్మి సినిమాకు వద్దంది. నేను బాగా ఏడిస్తే అప్పుడు తీసుకు వచ్చింది...." పాప తండ్రి కనిపించిన సంతోషంతో ఏదో... ఏదో చెప్పుకుపోతోంది. శేఖర్ కళ్ళు ఎత్తి శారద వంక చూడలేక పాప వంక చూస్తూ ఏదో చెప్తున్నాడు అన్యమనస్కంగా.




## "భగవాన్! నాకీ జీవితం వద్దు"

అతని మనస్సు అయోమయంగా అస్థిమితంగా అవస్థపడుతోంది. తండ్రిని చూసిన సంతోషంతో శారద చేతిలోని బాబు బోసి నవ్వులతో కేరింతలు కొడుతూ చేతులందించాడు.

చేతులు సాచి శారద చేతిలో నుండి బాబును అందుకున్నాడు శేఖర్. అది చాలా మామూలు దృశ్యం....

ఒక తండ్రి తన భార్య చేతుల్లో నుండి కొడుకును ప్రేమగా అందుకున్నాడు. అందులో విశేషం లేదు....

కానీ, చూస్తున్న సరిత గుండెల్లో ఎవరో బల్లెం పెట్టి పొడిచినట్లుగా విలవిలలాడిపోయింది. మరి చూడలేనట్లుగా గట్టిగా కళ్ళు మూసుకుని తల వంచుకుని కూర్చుంది.

హృదయపు లోతుల నుండి పొంగి వస్తున్న దుఃఖాన్నిముని పంట నొక్కి అపుకునేందుకు విశ్వప్రయత్నం చేస్తోందామె.

ఏ జంట అనుభవాలు ఆ జంటవే...

ఏ కుటుంబం ఆనందం ఆ కుటుంబానిదే...

ఏ స్నేహితుల ఉత్సాహం ఆ స్నేహితులదే...

సందడి నింపుకున్న సినిమా హాలు మామూలుగానే వుంది.

విరామ సంగీతం హృద్యంగా వినిపిస్తోంది. బయటికి వెళ్ళిన వాళ్ళు తమ సీటు చూచుకుంటూ ఒక్కో కుర్చీ దాటుకుంటూ లోపలికి వస్తున్నారు. పిల్లలు తండ్రులు తెచ్చిన పాప్‌కార్న్, చిప్స్ పొట్లాలు అందుకుని ఆనందంగా తింటున్నారు.

జంటలు తలలు పంచుకుని మరీ గుసగుస లాడుకుంటున్నాయి.

లైట్స్ ఆఫ్ అయ్యాయి....

శేఖర్‌కు అక్కడ కూర్చోవాలో లేక ముందు తను కూర్చున్న చోటుకు వెళ్ళాలో అర్థం కాలేదు. కూర్చోడానికీ, లేచి వెళ్ళడానికీ ఇదీ అని చెప్పలేని భావమేదో అడ్డు వస్తోంది.

ఇంతలో అతన్ని రక్షించడానికా అన్నట్లు ఆ సీటు గల ఆసామీ, సిగరెట్ పిలుస్తూ, కిళ్ళీ నములుతూ వచ్చాడు తన సీటు వెదుక్కుంటూ. శేఖర్ లేచి నించున్నాడు.

తండ్రికి సీటు లేకపోవడం చూసిన పాప తను తల్లికి అటు వైపుగా ఖాళీగా వున్న సీట్లోకి మారుతూ, "ఇక్కడ కూర్చో డాడీ నువ్వు....." అంటూ అంతకు ముందు తను కూర్చున్న సీట్లో తండ్రిని చెయ్యి పట్టి కూర్చో బెట్టింది.

బాబును ఎత్తుకున్న శేఖర్ శారద ప్రక్క సీట్లో కూర్చున్నాడు.

సినిమా ప్రారంభమైంది.

పాప తల్లి మీది నుండి ఒంగి తండ్రిని పదే పదే పలకరిస్తోంది.... శేఖర్‌కు కూడా అలాగే జవాబులివ్వాల్సి వచ్చింది. భార్యాభర్తలు ప్రక్కప్రక్కనే కూర్చుని సినిమా చూస్తున్నా ఎప్పుడూ ఒకరికి ఒకరు తెలియని అపరిచితుల్లా.... వేల వేల మైళ్ళ దూరాన వున్న పరిచితుల్లా.... ఉండిపోయారు.

శేఖర్ కంటికి సినిమాకు బదులుగా, ఒంటరిగా కూర్చుని తమనే చూస్తూ గుండెలు చెరువు చేసుకుంటున్న సరిత రూపం కనిపిస్తోంది.

సరిత మీద జాలితో పాటు తనంటే తనకు ఏసుగూ, అసహ్యం కలిగి తనను తానే తిట్టుకున్నాడు శేఖర్.

శారద గమనించకుండా ఓర కంటితో వెనక్కు చూశాడు....

సరిత సీటు ఖాళీగా వుంది...

బలవంతపు బ్రాహ్మణార్థంలా ఇక్కడ కూర్చోడమెందుకూ...? అలా వెనక్కు దొంగ చూపులు చూడ్డం ఎందుకూ...? అక్కడే కూర్చుంటే హాయిగా వుండి పోనుగా....పాపం పెళ్ళాం పిల్లలు అడ్డమైపోయారు..... కసిగా అనుకుంది శారద. ఇంటర్వెల్ తరువాత సినిమా ఏం జరిగింది అటు శేఖర్‌కు గానీ ఇటు శారదకు గానీ తెలీదు.....

వాళ్ళ గుండెల్లో అగ్నిపర్వతాలు ..... కనిపించని సుడిగుండాలు....

* * * * *

చేతి నిండుగా నిద్ర మాత్రలు పోసుకుని వాటి వంక కన్నార్పకుండా చూస్తోంది సరిత.

మాస్టారు త్రిభుజాల లెక్కలు చెప్తోంటే తనకు సరిగ్గా అర్థం కాక చిక్కు చిక్కుగా అనిపించేవి ఆ లెక్కలన్నీ. కారణం.... తన చూపు లెక్కల మీదే వున్నా మనసంతా లెక్కలు చెప్తున్న అందమైన శేఖర్ మాస్టారి మీదే వుండేది... అందుకే జీవితం ఆ లెక్కల కంటే కూడా చిక్కుగా మారిపోయింది. అవిచ్ఛిన్నంగా సాగే ఈ ముక్కోణపు పోటీలో చివరి వరకూ తను పోరాడ లేదు....

మాస్టారు ఇప్పుడు ఏం చేస్తుంటారు....?

భార్యాబిడ్డలతో కలిసి హాయిగా సినిమా చూసి ఇంటికి వెళ్ళి కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేసి వుంటారు.... ఇక ఆపైన ఊహించేందుకు ఇష్టంలేక

# మొదలెట్టండి యివాళే– 6 వారాల్లో చూడండిక–

## వంటిచాయను మెరుగుపరిచే క్రీమ్

# క్లియర్•టోన్

## మీ రంగురూపాల్ని కొత్తదనంతో రూపొందిస్తుందిక

**1వ వారం**




కోమలమైన చర్మం కేవలం మూడు రోజుల్లో !

**2వ వారం**



మొటిమల గుర్తులు పోతున్నాయి...
అబ్బ ఎంత హాయి !

**3వ వారం**



చూసావా, మో చేతులు నిగనిగలాడుతున్నాయి
అప్పుడే.

**4వ వారం**



"నీ ముఖానికి చాయవచ్చి మెరుస్తోంది."
అంది ఓ మిత్రురాలు.

**5వ వారం**



ఎండలోకెళ్ళినా, వాడదిక చర్మం.

**6వ వారం**



ఇప్పుడు నేనున్నా క్లియర్•టోన్ బృందంలో !

క్లియర్•టోన్‌లోని అద్వితీయ సూత్రీకరణ. మీ చర్మానికి మరింత మెరుపునిస్తూ మరింత మెరుగైన చాయతో రూపొందిస్తుంది. సున్నితంగా. అంతేకాదు. క్లియర్•టోన్‌లో గల ఒక ప్రత్యేకమైన పదార్థం. అసహ్యమైన ఆ మచ్చల్ని పోగొడుతుంది. దీనిలోగల ప్రభావమైన 'మాయిశ్చరైజర్' మీ చాయను యితరులు మెచ్చుకునేటంతగా మెరుపునూ, మృదుత్వాన్నీ యిస్తుంది.
ఇదంతా కేవలం 6 వారాల్లో !

చక్కని ఆ ఫలితాలు ఆలాగే వుండటానికోసం క్లియర్•టోన్‌ని రోజుకు రెండుసార్లు రాసుకుంటూ వుండండి. యింట్లోనూ, ఎండలో బయిటికి వెళ్ళినప్పుడూను.

మెరుగైన ఫార్ములా
తిరుగులేని ఫలితం




# క్లియర్•టోన్ మెరుగైన వంటిచాయలోని రహస్యం– సహజమైన రీతిలో

లండన్ • పారిస్ • న్యూయార్క్

daCunha/NICL/76/85-TL-R

విసురుగా తల విదిలించింది. ఏ ఆలోచన రాకూడదనుకుందో ఆ ఆలోచన రావడమూ, ఆమె బుగ్గల నిండుగా వెచ్చని కన్నీరు పాకడమూ జరిగిపోయాయి. తనెందుకు ఇలా బాధ పడటం...?

మాస్టారికి భార్యాపిల్లలు వున్న విషయం తనకు ముందే తెలుసుగా..? అయినా తను సహించలేక పోతోందేం...?

పెళ్ళికి ముందు మాస్టారు తటపటాయిస్తుంటే, "నా కోసం మీ భార్యాపిల్లల్ని ఒదులుకోనక్కర్లేదు మాస్టారూ... మీ పాదాల దగ్గర నాకింత చోటిస్తే చాలు..." అని తాను మాస్టారి పాదాలు పట్టుకుని ఏడవలేదూ! అయినా ఈ రోజు ఇంత అసూయ పడుతోందేం...? మాస్టారితో కలిసి ఆమెను క్షణం కూడా ఊహించలేకపోతోంది... ఊహించి సహించలేకపోతోంది...

కానీ. సహించక చేయగలిగిందేముంది...? ఇక జీవితమంతా ఇంతే.... మరో మార్పు రాదు...మాస్టారిని జీవితంలో చివరి క్షణం వరకూ ఆమెతో కలిసి పంచుకోవాల్సిందే తనెలాగయినా సెకండే... సంఘంలో కాని, అతనిలో కానీ ఆమెకూ ఆమె పిల్లలకూ వున్న విలువ, ఆదరం తనకు లేవు... రావు.. ఇది నిజం. అసలు ఎందుకు ఇలా జరిగింది...? ఏమైకం తనను కమ్మేసింది..? మాస్టార్ని పిచ్చిగా ఆరాధించింది తను.... అందులో అబద్ధం లేదు. మాస్టారు పెట్టిన తొలి ముద్దుతో

## "భగవాన్! నాకీ జీవితం వద్దు"

తనొక విషయం తెలుసుకుంది – అంతేకాదు... తానొక నిర్ణయానికి వచ్చేసింది కూడా. మాస్టారికి కూడా తనంటే ప్రేమే... తన జీవితం మాస్టారిదే... మాస్టారికి తప్ప తను మరొకర్ని కన్నెత్తి కూడా చూడలేదు... అంతే నాన్న తనకు సంబంధం తెచ్చినప్పుడు మాస్టారు నిరాకరిస్తే తను చచ్చిపోవాలనుకుంది... అదే చెప్పింది మాస్టారితో. జీవితంలో ఇలా అశాంతితో వేగిపోతూ నిముషం చచ్చిపోయే కంటే అప్పుడు చచ్చిపోయినా బాగుండి పోయేది... తను బ్రతికి ఉండటం చేత అన్నీ సమస్యలే....మాస్టారికి కూడా శాంతి లేదు... తను ఎవరికి కావాలి...? తను చచ్చిపోతే మాస్టారు కాసేపు బాధపడ్డా తన భార్యాబిడ్డలతో హాయిగా వుంటారు.....

ఈ ఆలోచనతో సరిత కళ్ళు చెరువులయ్యాయి....

భగవాన్! నాకి జీవితం వద్దు....ఒద్దు... అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

కొంత సేపటికి దుఃఖం ఉపశమించింది. నిర్ణయం బలపడింది.

* * * * *

మృత్యువుతో హోరాహోరి పోరాడుతూ నిస్సహాయంగా హాస్పిటల్ బెడ్ మీద పడి వున్న సరితను చూస్తుంటే కళ్ళు కాల్వలు కట్టాయి శేఖర్‌కు.

ఈ పసి మొగ్గను వికసించకుండా చిదిమి వేసింది ఎవరు.... ? తను కాదూ.... ? ఈ రోజు ఈ అమాయకురాలు ఇలా బలవంతంగా ప్రాణాలు తీసుకునేందుకు ప్రయత్నించింది అంటే కారణం తను కాదూ... ? క్షణికమైన తన సుఖం కోసం లాలసకోసం పసిపాపలాంటి ఆమె నిండు జీవితాన్ని బలిపెట్టాడు. తనలో ఏదయ్యం ప్రవేశించింది... ? తనను పిచ్చిగా ప్రేమించి ఆరాధించిన నేరానికి ఇది ఆమెకు తను ఇచ్చిన కానుక..... ఆనాడు తను ఏమాత్రం విజ్ఞత ప్రదర్శించినా ఆమె తన జీవితంలోకి ప్రవేశించి వుండేది కాదు.....

కాదు.... కాదు... ఆమె తన జీవితంలోకి ప్రవేశించడం కాదు... తనే ఆమె జీవితంలోకి అపశృతిలా ప్రవేశించాడు.

శేఖర్‌కు సరితతో తన పరిచయమూ, ఆమె తన జీవితంలోకి ప్రవేశించిన తీరూ ఒక్కొక్కటే గుర్తుకు వచ్చాయి.

ఆ ఊరు.... రాంపురం... రాంపురానికి ట్రాన్స్‌ఫర్ అయి స్కూల్లో జాయిన్ అయి తొమ్మిదో తరగతి మొదటిగా అటెండ్ అయ్యాడు. చెంపకు చేరిన కళ్ళతో, చేమంతి మొగ్గలా ముగ్ధలా వున్న సరిత మొదటి రోజే అతన్ని ఆకర్షించింది. క్లాసులో

పిల్లలందరిలాగే ఆమె కళ్ళు కూడా అతన్ని ఆసక్తిగా చూస్తున్నాయి.

రోజులు గడిచే కొద్దీ అతనో విషయం గమనించాడు. మిగతా విద్యార్థినీ, విద్యార్థుల్లో లేని ఆరాధనా భావమేదో సరిత చూపుల్లో వుంది..... అంతేకాదు... తను క్లాసులో వున్నా, ప్లేగ్రౌండ్స్‌లో వున్నా, బాట్‌మింటన్ కోర్టులో వున్నా ఆమె చూపులు తనను వెంటాడుతూనే వుంటాయనే విషయాన్ని అతను గ్రహించాడు.

ఈ విషయం అతనిలోని పురుషప్రవృత్తిని సంతృప్తి పరచింది. ఓ రోజు ఏదో పని వుండి కాస్త పెందలాడే స్కూలుకు వెళ్ళాడు శేఖర్. వచ్చిన కొద్ది మంది పిల్లలూ ప్లేగ్రౌండ్‌లో ఆడుకుంటున్నారు. నైంత్ క్లాసులో సరిత ఒక్కతే కూర్చుని, కళ్ళు వాల్చుకుని ఏదో వ్రాసుకుంటోంది. అతనిలో ఏదో చిలిపి కోరిక.... చప్పుడు చేయకుండా వెళ్ళి ఆమె ముందు నిలబడి, "ఏమిటి వ్రాస్తున్నావు.... ?" అంటూ సరిత చేతిలోని పుస్తకాన్ని అందుకుని చూచిన అతను క్షణం నిర్ఘాంత పోయాడు.

"శేఖర్ మాస్టారు.... " ఈ పేరుకు నగిషీలు చెక్కుతోంది సరిత. అనుకోకుండా అతన్ని అక్కడ చూసిన సరిత కంగారు పడిపోయింది. ఆమె కళ్ళు రెప రెపలాడుతూ భయంగా అతని వంక చూశాయి.....

శేఖర్ పుస్తకం టేబుల్ మీద వుంచి రెండు చేతుల్తోనూ ఆమె ముఖాన్ని దగ్గరగా తీసుకుని పెదవుల మీద గాఢంగా చుంబించాడు. మొదట భయంతో పాలిపోయిన సరిత పెదవుల్లో క్షణాల్లో రక్తం ప్రవహించింది. ఆ తరువాత సరితకూ, శేఖర్‌కూ మధ్య చిన్న చిన్న ఉత్తరాలూ, దొంగ చూపులూ, చిలిపి నవ్వులూ నడిచాయి చాలా కాలం. ఇది తప్పనీ, అనుకూల వతియైన భార్య , బిడ్డ వున్న తను పసి పిల్ల వంటి సరిత పట్ల ఈ ప్రవర్తన సరియైనది కాదనే విషయం ప్రతిక్షణం గుర్తు చేస్తున్న అంతరాత్మను థ్రిల్.... వ్యామోహం అణచి వుంచాయి.

నిజానికి శారద వల్ల అతనికి అసంతృప్తి లేదు. ఆమెను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాడు. కానీ..... కన్నె పిల్ల ప్రేమలో నిథ్రిల్.... ఆ థ్రిల్ ఇచ్చే మత్తు నుండి తప్పించుకో లేక పోయాడు.

ఆరోజు ఆగస్టు ఫిఫ్టీన్త్.... స్కూల్లో చాలా రాత్రి వరకూ ప్రోగ్రాంస్ జరిగాయి. శేఖర్‌కు సరితతో కోరుకున్న ఏకాంతం లభించింది. చీకటి మాటున చెయ్యి పట్టుకున్నాడు. కెవ్వున అరవబోయిన సరిత శేఖర్‌ను గుర్తించి మౌనంగా వుండి పోయింది.

శారద పుట్టింటికి వెళ్ళడంతో సరితకు తెలియని పాఠాలు చెప్పించుకునే మిషతో ఇంటికి రప్పించు కోడం ప్రారంభించాడు శేఖర్. ఎక్కువ కాలం దాగకుండానే ఊరూ , వాడా గుప్పుమంది. గుట్టు చప్పుడు కాకుండా సరిత తండ్రి సంబంధం కుదిర్చి ముహూర్తం పెట్టించాడు. ఓ అర్ధరాత్రి, "మాస్టారూ! మీరు లేకుండా నేను బ్రతక లేను. నన్ను పెళ్ళి చేసుకోరూ..... ?" అంటూ కన్నీటితో పాదాలు కడిగే సరితను చూచి చలించి పోయాడు శేఖర్.

తను కాదంటే సరిత దక్కదనే విషయం కూడా గ్రహించాడు. సంఘం.. భార్యాబిడ్డలు గుర్తుకు వచ్చారు. కానీ, వీటన్నింటి కంటే కూడా ఆ అమాయిక బాలిక ప్రాణమే ముఖ్యం అనుకున్న శేఖర్, అదే ముహూర్తానికి రహస్యంగా ఆమెను గుళ్ళో పెళ్ళి చేసుకున్నాడు ఆ వెంటనే అక్కడి నుండి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాడు.

శారద పురిటి నుండి వచ్చే సరికి శేఖర్‌కు" మరో ఇల్లు" తయారయింది. శేఖర్ "చంద్రశేఖరు" డయ్యాడు..... ఇద్దరి భార్యల భర్తగా.

★ ★ ★ ★ ★

బెడ్ మీద సరిత కాస్త కదలడంతో అతని ఆలోచనలకు అంతరాయం కలిగింది. ఆతృతగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

★ ★ ★ ★ ★




ఇంటికి వస్తాడో, రాడో కూడా తెలియని భర్త కోసం వద్దనుకుంటూనే ఎదురు చూస్తోంది శారద.

పాపా, బాబూ హాయిగా నిద్రపోతున్నారు. "పాపా! హాయిగా నిద్రపోమ్మా. ఈ వయస్సులో తప్పితే ఆడపిల్లగా పుట్టిన నేరానికి గాను నీకు కంటినిండుగా నిద్ర వుండదు." ఆదమరచి అమాయకంగా నిద్రపోతున్న కూతురి వంక చూస్తూ ప్రేమగా ఆర్తిగా అనుకుంది శారద.

ఈ ఆలోచనా మాత్రంతోనే ఆమె కళ్ళల్లో నీళ్ళుబికాయి. తనేం పాపం చేసిందనీ తనకీ శిక్ష....? ఆడదై పుట్టడమా తను చేసిన పాపం.... లేకపోతే భర్తను మనసారా ప్రేమించి అతని తోడిదే లోకంగా గడపడమా తను చేసిన పాపం.... ? శేఖర్, తను ప్రేమించి పెళ్ళి చేసుకోలేదు. కానీ, ఒకరి కోసం ఒకరు అన్నట్లుగా బ్రతికారు.... ఇప్పుడు సరితను ప్రేమిస్తున్నాడూ అంటే ఇంతకు పూర్వం తనతో గడిపిన జీవితమంతా నటన.... వ్యర్థం.... మోసం..... దగా.

కన్నీళ్ళు జలజలా రాలిపడ్డాయి.

తనెందుకు బ్రతకడం .... ? ప్రతిక్షణం అశాంతితో వేగిపోతూ కన్నీళ్ళ సుడిగుండంలో మునిగి పోతూ ఎంతకాలం బ్రతుకుతుంది... ? అసలు బ్రతక్క పోతేనేం.... ? ఎవరికోసం ఈ బ్రతుకు.... ? పాపా, బాబూ నిద్రలో కదిలారు. తన ప్రశ్నకు జవాబు దొరికింది శారదకు. హృదయాన్ని కుళ్ళ బొడిచే ఈ బాధతో, వేదనతో తను ఈ పిల్లలకోసం జీవచ్ఛవంలా బ్రతకాలి.

భగవాన్.... వద్దు.... వద్దు .... నాకీ జీవితం వద్దు.... శారద తలుపు కేసి తల బాదుకుని గుండె బరువు తీరే వరకూ వెక్కి వెక్కి ఏడ్చింది. భర్త అనురాగాన్ని పంచుకున్నప్పటి సంఘటనలతో పాటు అతను 'తనను మోసం చేసినప్పటి సంఘటనలు కూడా గుర్తుకు వచ్చాయి.

ఒక రోజు శేఖర్ బట్టలు చాకలికి వేస్తూ అతని జేబులో రంగు దారాలతో చిన్న గులాబీ పువ్వులూ , యస్... యస్.... అన్న అక్షరాలూ కుట్టి వున్న కర్చీఫ్ చూసింది శారద.

"ఇది ఎక్కడదీ.... ?" అంది క్రొత్తగా వున్న కర్చీఫ్ చూస్తూ. శేఖర్ కర్చీఫ్ చూస్తూ ఓ క్షణం కళవళ పడ్డాడు.

"నువ్వే ఇచ్చినట్లున్నావు కదూ...?" అన్నాడు క్షణం తరువాత తేరుకుని. ఆమాట అబద్ధం అనే విషయం అతనికీ తెలుసు.... తనకూ తెలుసు.... తనకు తెలుసు అనే విషయం అతనికి తెలుసు. "యస్... యస్... అంటే?" అంది మెల్లగా.

శేఖర్..... స.... శారద... అన్నట్లు శారదా! పాప.... ఏం చేస్తోంది.... ?" మాట తప్పించేందుకు ప్రయత్నిస్తున్న భర్తను చూస్తూ మరి తర్కించలేదు శారద.

అలాంటి సంఘటనలు ఎన్నో.....

అతను చూపిన ప్రేమ "నటన" అనే విషయం తను ఆలస్యంగా తెలుసుకుంది..... ఆ మాట గుర్తుకు వస్తేనే ఆమె మనస్సంతా అనిర్వచనీయ మైన వేదనతో ముడుచుకు పోతుంది.....

బాబు లేచి తల్లి కోసం తడుముకుని ఏడవడంతో బాబు ప్రక్కన ఒరిగింది శారద అలసిన మనస్సుతో.... ఆమె కళ్ళు ఇంటికి రాని భర్త కొరకు నిరీక్షిస్తూనే వున్నాయి. □

సీరియల్

# కాంచన సౌధం

రాసినూతల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

శవాన్ని పోస్టుమార్టానికి తరలిస్తుండగా భోరు భోరుమంటూ ఓ వృద్ధుడు పరిగెత్తుకొచ్చాడు.

క్షణం ఆగారంతా.

"ఎవరు నువ్వు?" ముఖం చిట్లించాడు ఎస్సై.

"నా పేరు యాదయ్య బాబూ!...."

నోట్లో గుడ్డ కుక్కుకుంటూ అన్నాడతను.

"ఈవిడ మీ కేమౌతుంది?"

"కూతుర్లాంటిది బాబూ! మా ఇంటి పక్కిల్లే ఈ తల్లిది!" ఏడుస్తూనే అన్నాడతను.

"ఈ హత్య గురించి నువ్వేమైనా చెప్పగలవా?" ఆశగా అడిగాడు ఎస్సై.

"హత్య గురించి తెలియదు గాని.... బాబూ! ఒక్క విషయం మాత్రం చెప్పగలను!"

"ఏమిటి?"

"రమమ్మ తల్లిని ఈ డాక్టర్ బాబే చంపేశాడు!" ఆవేశంగా అన్నాడు.

నిర్ఘాంతపోయారంతా.

"ఆయన హత్య చేస్తుండగా నువ్వు చూశావా?" కుతూహలంగా అన్నాడు ఎస్సై.

"చూళ్ళేదు! కానీ.... రాత్రి రమ ఇక్కడి కొచ్చింది.... డాక్టర్‌గారితో మాట్లాడింది!"

మరింత తెల్లబోయారంతా.

"చెప్పు!" గంభీరంగా అన్నాడు ఎస్సై.

"అర్ధరాత్రి దాటాక నాకు కడుపులో బావుండక చేలకేసి వెళ్తున్నాను. దారిలోనే వున్న హాస్పటల్లోంచి ఏవో మాటలు వినిపించాయి. కుతూహలంగా అటు నడిచాను. అక్కడ డాక్టరు, రమ ఏదో ఘర్షణ పడుతున్నారు!"

జరిగిన కథ-12 : విశ్వం దగ్గర కల్పన ఫోటో, కల్పన దగ్గర విశ్వం ఫోటో ఉండటంతో మమత వాళ్ళని ఆ విషయం నిగ్గదీసి అడుగుతుంది. చౌదరి విశ్వాన్ని శత్రువులా చూస్తున్నాడు. విశ్వం రాయుడిగారింట్లో భోజనం చేస్తున్నాడు. ఎలక్షన్లలో రాయుడు నెగ్గాడు చౌదరి ఓడాడు. మమతకు విశ్వంమీద పగరెట్టింపయింది. మమతకి టైఫాయిడ్‌వస్తే పట్నంలో నర్సింగ్‌హోమ్‌లో చేరుస్తాడు చౌదరి. విశ్వం జరిగిన విషయాలన్నీ మనసువిప్పి మాట్లాడాలని మమత దగ్గరకి వెళితే మమత అతనితో మాట్లాడను నిరాకరించింది. కల్పన మంగిని తీసుకుని మమతను చూడటానికి వెళ్ళింది. కల్పన కథవిన్న మమత వెంటనే విశ్వాన్ని క్షమాపణలు చేసుకోవాలనుకుంటుంది. కల్పనచేత, తన తండ్రిచేత కబురు పంపినా విశ్వం రాకపోవడంతో అతనికి తనపై చాలా కోపంవచ్చిందని ఏడ్చింది మమత. విశ్వం ప్రవర్తన వింతగా తోస్తుంది కల్పన, మమతలకి. పదివేలిస్తే సరి ుంటే గుట్టు బయటపెడతానని బ్లాక్‌మెయిల్ చేస్తుంది విశ్వాన్ని ఆయా ంమ. ఆ రోజురాత్రే ఆమె హత్యగావింపబడుతుంది. ఆ హత్యానేరం డాక్టర్ విశ్వంమీద మోపబడుతుంది.

"హాస్పటల్లో మాటలు వినిపిస్తే అంత కుతూహలం ఎందుకు.... రోగాలకి.... టైమంటూ వుండదుగా?"

యాదయ్య మాటల్ని మధ్యలోనే తుంచి అన్నాడు ఎస్సై.

"నిజమే!.... కానీ.... ఈ మధ్య డాక్టర్‌గారు యమర్జన్సీ కేసులేం చూడడం లేదనీ, అర్ధరాత్రి వస్తే అసలు తలుపులే తియ్యడం లేదనీ, తిండీ, పడకా అన్నీ ఇక్కడే అనీ నలుగురూ చెప్పుకుంటుంటే విన్నాను!" అన్నాడు యాదయ్య.

"సరే! చెప్పు!"

"కారణం ఏమిటో తెలియదు గానీ రమ డాక్టర్ని డబ్బిమ్మని అడుగుతోంది. ఆయన ఇవ్వనన్నాడు. ఇద్దరి మధ్యా ఘర్షణ జరిగింది. చివరికి డాక్టర్–

"నేను చచ్చినా నీకు పైసా ఇవ్వను! పిచ్చి పిచ్చి వేషాలేస్తే.... నీ రక్తం కళ్ళ జూస్తాను!.... నిన్ను చంపి జైలు కెళ్తాను!" అంటూ ఆవేశంగా అరిచాడు.

ఆ తరవాత అర్జంట్‌గా చేలో కెళ్ళిపోయాను. వచ్చేటప్పటికి అంతా నిశ్శబ్దంగా ఉంది. అలా ఆలోచిస్తూనే ఇంటి కొచ్చి పడుకున్నాను. ఆరోగ్యం బావుండక.... లేవనే లేదు.... ఇంతకు ముందే ఓ కుర్రాడు వచ్చి జరిగిన ఘోరం చెప్పాడు. అంతే.... పరిగెత్తు కొచ్చాను!" కండువాతో కళ్ళు వత్తుకుంటూ అన్నాడు యాదయ్య.

దాసుకళ్ళు మరింత ఎర్రబడ్డాయి.

"చూశారా ఎస్సైగారూ! నేను చెప్పలేదూ! వీడే! వీడే. నా రమని పొట్టన పెట్టుకున్నాడు." కూలబడి పిచ్చాడిలా జుట్టు పీక్కున్నాడు.

వాతావరణం మరింత భయంకరంగా అయింది. అందరూ తలో రకంగా ఆలోచిస్తున్నారు.

శవం పోస్టుమార్టానికెళ్ళి పోయింది.

* * * * * *

తలో రకంగా మాట్లాడుకుంటూ వెళ్ళిపోయారు చాలామంది. రాయుడి ఫేమిలీ, చౌదరి ఫేమిలీ, మంగి వాళ్ళూ.. మరికొందరు ... అయిన వాళ్ళు మాత్రం ఉన్నారు. ఎస్సై అప్పుడే బైటికెళ్ళాడు.

విశ్వం నిర్లిప్తంగా కూర్చుని ఉన్నాడు. అతన్ని ఓదార్చడానిక్కూడా ధైర్యం చాలడం లేదెవరికీ. అతని మౌనం మాత్రం వాళ్ళని చికాకు పెట్టేస్తోంది. చౌదరి గారి మొహం మరి పాలిపోయింది.దాదాపు ఏడుస్తున్నట్టున్నాడు.

"చౌదరి!" చల్లని పిలుపు!

తృళ్ళిపడి చూశాడు చౌదరి.

ఆయన్నంత ఆప్యాయంగా పిల్చింది రాయుడు!

"రాయుడూ!" ఒక్కసారి దుఃఖం ముంచుకొచ్చింది చౌదరికి.

"చౌదరి! బాధపడకురా!... మన విశ్వం అలాంటి వాడుకాదని మనందరికీ తెలుసు!... నేరం చెయ్యని వాణ్ణి ఏ చట్టం... శిక్షించలేదు!.... " ఓదార్పుగా అన్నాడు రాయుడు. ఆయనకి చౌదరి విరోధిలా కనిపించడం లేదు. మునుపటిలా ఆత్మీయుడిలాగే కనిపిస్తున్నాడు.

చౌదరి మొహం వెలిగి పోయింది.

'ఇంక నాకేం దిగుల్లేదురా!.... నీ అండ కూడా నాకుంది. విశ్వం స్వభావం నాకు తెలిసినా ఇంతమంది ఇన్ని రకాలుగా చెప్తుంటే కాస్త కంగారు పడ్డాను. అయినా.... ఆ అమ్మాయన్నా, దాసన్నా వాడికి చిరాకు . అలాంటిది.... అర్ధరాత్రి ఆ అమ్మాయి ఎందుకొస్తుంది. వస్తే మాత్రం వీడెందుకు మాట్లాడతాడు...

ఇదంతా ఆ వెధవలు కల్పించిన కట్టుకథలు!...” ఆవేశంగా అన్నాడు.

కల్పన, మమతా కూడా వారి కలయికకి ఎంతో ఆనందించారు.

విశ్వం మీద... ఎలాంటి అనుమానం రాదనే... తృప్తి పడ్డారు. విశ్వం చేత విడమర్చి చెప్పించాలనుకున్నారు. ఏదో అడగబోతుండగానే ఎస్సై వచ్చేశాడు.

"డాక్టర్!" గంభీరంగా అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

"ఏమిటి?" అన్నట్టు చూశాడతను.

"నేను కొన్ని ప్రశ్నలడుగుతాను!... నిజం చెప్పండి!"

"అడగండి!"

"యాదయ్య చెప్పింది ఎంత వరకు నిజం?"

విశ్వం మొహం పాలిపోయింది.

మౌనంగా వుండి పోయాడు.

"చెప్పు బావా! ... అతను చెప్పిందంతా అబద్ధం అని చెప్పు!" ఆవేశంగా అంది మమత.

అప్పుడూ మాట్లాడలేదతను.

"డాక్టర్!... మీరు నేరం చెయ్యలేదని చాలా మంది అభిప్రాయం!... నేనూ అలాగే అనుకుంటున్నాను. అందుకే నేనడిగిన వాటికి సరైన జవాబులిస్తే కేసు త్వరగా తేలిపోతుంది! దోషులు దొరుకుతారు! నిర్దోషులైతే మిమ్మల్ని ఎవరూ ఏమీ చెయ్యలేరు" అనునయంగా అన్నాడు ఎస్సై.

"అడగండి!" గంభీరంగా అన్నాడు విశ్వం.

"రాత్రి నిజంగా ఈవిడ మీ దగ్గరికొచ్చిందా?"

"ఆ! వచ్చింది!"

తృళ్ళి పడింది మమత.

కంగారుగా చూశాడు చౌదరి.

"ఆవిడ వచ్చినప్పుడు సుమారు టైమెంతైయ్యుంటుంది?"

"బహుశా ఒంటిగంట కావచ్చు!"

"అంత అర్ధరాత్రి మీ దగ్గరి కెందుకొచ్చింది?"

"........."

"చెప్పండి డాక్టర్! ఆ టైంలో మీ దగ్గరి కెందుకొచ్చింది?... మందుకోసమా?"

"ఉఁ హూఁ!"

"మరి?...."

"డబ్బుకోసం వచ్చింది!" నిర్లిప్తంగా అన్నాడు విశ్వం.

"డబ్బుకోసమా?... ఎంత కావాలంది?"

"పది వేలు!"

"పది వేలు!.... మీ దగ్గర పనిచేసి మానేసిన ఒక ఆయా అర్ధరాత్రి మీ దగ్గరి కొచ్చి పది వేల రూపాయలిమ్మంది!... కదూ?" సూటిగా అడిగాడు ఎస్సై.

"అవును ! .." అన్నట్టు తల వూపాడు విశ్వం.

"ఎందుకు ?"

విశ్వం మాట్లాడ లేదు.

"మీ రామెకి బాకీ వున్నారా?" ఎస్సై రెట్టించాడు.

"ఉఁహూఁ! "

"మీ ఇద్దరిమధ్యా ఏదైనా అక్రమ...."

"ఛీ! ఛీ!" కంగారుగా అన్నాడు విశ్వం.

"మరి?"

"ప్లీజ్! .... నేనింకేం చెప్పలేను!" తపనగా నుదురు రాసుకుంటూ అన్నాడు విశ్వం.

"పోనీ.... ఓ విషయం చెప్పండి!.... ఆవిడకి మీరు పదివేలూ ఇవ్వక పోతే.... మీ గుట్టు బైట పెడతానని బెదిరించిందా?"



"అవును!" అన్నట్టు తలూపాడు విశ్వం.

"ఏవిఁటా గుట్టు?"

విశ్వం మాట్లాడలేదు.

"డాక్టర్! మీరు చదువుకున్న వారు. అన్నీ తెలిసిన వారు!.... ఇలా విషయాన్ని దాస్తే అసలు హంతకుడెలా దొరుకుతాడు?... మీరింకా ఇలా మౌనంగా వుంటే మీరే ఈ హత్య చేశారని మేంకూడా నమ్మాల్సొస్తుంది!.... అందుకే ఉన్నదున్నట్టు చెప్పండి!" కాస్త అనునయంగానూ, కాస్త కఠినంగానూ అన్నాడు ఎస్సై.

"సారి ఇన్స్పెక్టర్! ... నేనేం చెప్పలేను!" మెల్లగా అన్నాడు విశ్వం.

అందరూ ముఖాలు చూసుకున్నారు.

"మీరావిణ్ణి చంపుతానని బెదిరించిన మాట నిజమే కదూ?" సూటిగా చూస్తూ అన్నాడు ఎస్సై.

"అవును!" అన్నట్టు తలూపాడు విశ్వం.

"అయితే ... ఆవిడ బెడద ఒదిలించుకోవడానికి కూల్గా ఆమెని చంపేశారు!.... అవునా?"

"నో! నేనామెని చంపలేదు!" అరిచినట్టు అన్నాడు విశ్వం.

"అయితే మీరు నిజం చెప్పండి!"

"........."

"పోనీ... ఎవరి మీదైనా మీకు అనుమానం వుందా?" సహనాన్ని తెచ్చుకుంటూ అన్నాడు ఎస్సై.

"ఉఁహుఁ!...."

"మీరీ శవాన్నెప్పుడు చూశారు?"

"ఇక్కడ మాటలు వినిపించి ఏమిటో అని వచ్చి చూశాను. ఆయా శవం వుంది!"

"అంత దాకా మీరు నిద్రే లేవలేదా?"

"అవును!.... రాత్రి నిద్రలేనందున తెల్లవారు జామున ఎప్పుడో కునుకు పట్టింది.... అందుకే తొందరగా మెలకువ రాలేదు".

"రాత్రి మీరు ఆయా ఇంటికెళ్ళారా?"

"ఉఁహూఁ!"

ఎస్సై మరికొన్ని తికమక ప్రశ్నలు వేశాడు. అయినా విశ్వం కొన్నింటికి మాత్రమే సమాధానాలు చెప్పాడు.

"సారీ! డాక్టర్! ఈ హత్య కచ్చితంగా మీరే చేశారు"! ఎస్సై కాస్త కఠినంగా అన్నాడు.

"లేదు ఇన్స్పెక్టర్ గారూ! "జాలిగా అన్నాడు విశ్వం. అయినా అతను జాలిపడలేదు.–

"సరే! .... అదేవిఁటో కోర్టులోనే తేల్తుంది!" అంటూ ... విశ్వాన్ని అరెస్ట్ చేశాడు.

ఉసూరు మన్నారు గ్రామ ప్రజలు!

చౌదరి నిశ్చేష్టుడే అయిపోయాడు.

మమత కుళ్ళి కుళ్ళి ఏడ్చింది.

కల్పన ప్రతిమలా బిగుసుకు పోయింది.

★ ★ ★ ★ ★ ★ ★

పోస్ట్ మార్టంలో రమ వూపిరాడక చచ్చిపోయిందని రిపోర్టొచ్చింది!

విశ్వాన్ని బైలు మీద విడిపించి తీసుకొచ్చాడు చౌదరి. విశ్వం ఇప్పుడు ఎవరితోనూ మాట్లాడ్డంలేదు. అతని తల్లి దండ్రులు ఏడుస్తూ వచ్చారు. అయితే వాళ్ళతో కూడా అతను మాట్లాడలేదు.

"బావా!... ప్లీజ్! జరిగింది నాతో చెప్పు! నువ్వీ హత్య చెయ్యలేదు!.... ఎందుకు విషయాల్ని దాచి నీ మెడకి నువ్వే ఉరి తగిలించుకోవడానికి ప్రయత్నిస్తావ్!" అంటూ బతిమాలింది మమత.

"అవును విశ్వం!....నువ్వీ హత్య చెయ్యలేదని మాకేకాదు!.. చాలా మందికి తెలుసు!... అసలీ గొడవంతా ఏమిటో చెప్పు!" అనునయంగా అంది కల్పన. ఆమెకి విశ్వం డాక్టరులా కనిపించడం లేదప్పుడు. చిన్ననాటి స్నేహితుని లాగే కనిపిస్తున్నాడు.

అప్పటికీ నోరు విప్పలేదు విశ్వం.

"పోనీ ఒక్కటి చెప్పు!" అతని చేతులు పట్టుకుని అడిగింది మమత.

"ఏమిటి?" అన్నట్టు చూశాడు విశ్వం.

"నువ్వీ హత్య చేశావా?"

"చెయ్యలేదు!" గభాల్న అన్నాడు విశ్వం.

"సరే!" అంటూ బైటికొచ్చేసింది మమత. కల్పన కూడా ఆమె ననుసరించింది.

విశ్వం మౌనంగా హాస్పటల్ మేడ మీదికెళ్ళి పోయాడు.

భారంగా నిట్టూర్చారు కల్పన, మమత.

"కల్పనా! బావనెలాగైనా కాపాడాలి!" గద్గద స్వరంతో అంది మమత.

"అవును! విశ్వం అమాయకుడు! అతనీ నేరం చెయ్యలేదు...ముందు అతని మౌనానిక్కారణం తెలుసుకోవాలి!" ఏదో ఆలోచిస్తూ అంది కల్పన.

"దాసుకి తెలుసేమో!..." ఆశగా అంది మమత.

"చూద్దాం!" అన్నట్టు తల పంకించింది కల్పన. ఇద్దరూ ఆలోచించారు.

ఎలాగైనా కూపీలాగి విశ్వాన్ని నిర్దోషిగా నిరూపించాలని కంకణం కట్టుకున్నారు.

కేసు కోర్టుకెళ్ళింది.






“ గారాల కూతురుకు పెళ్ళంటే సంతోషపడని తలిదండ్రులెవరుంటారు?
మా అమ్మాయికికూడా మంచి సంబంధం నిశ్చయమైంది. "పెళ్ళిచేసి చూడు ఇల్లుకట్టి చూడు" అన్నారు పెద్దలు. ఆ మాటలు అక్షరాలా నిజం! పెళ్ళంటే మాటలా? ఎన్ని పనులు? ఉరుకులూ పరుగులూ తప్పవు కదా! మంచి కళ్యాణ మండపం ఎన్నుకోవడం దగ్గరనుంచీ, ఆహ్వాన పత్రికలు అందరికీ పంచేవరకూ ఎన్నో పనులు! ప్రత్యేకమైన పట్టు చీరలు, బంగారు నగలు ఇంకా చెప్పలేనన్ని ఎన్నో వస్తువుల జాబితా! పెళ్ళికి అవసరమైన అన్ని వస్తువులూ ఒక్కసారిగా కొనడమంటే ఎంతకష్టం?

అయితే పాత్ర సామానులు కొనడం అన్నిటికంటే తేలికైన పని అనిపించింది, ఎందుకంటే మాకు తెలుసు-అన్నింటిలోకి దళసరైన సేలం స్టెయిన్‌లెస్‌తో చేసిన స్టీలు పాత్రలు మన్నికైనవని. సేలం స్టెయిన్‌లెస్ స్టీలు పాత్రలు అరిగి పోవు, బిల్లులు పడవు, మచ్చలు పడవు. సంవత్సరాల తరబడి రోజూ ఉపయోగించినా మెరుపు అలాగే వుంటుంది.

మా కాలం పాత్రలలాగే, జీవితకాలమంతా మన్నికగా ఉండేంత దృఢంగా ఉంటాయి. మరి పెళ్ళనేదికూడా జీవితకాలం నిలిచేబంధం కదా!. ”

సేలం స్టెయిన్‌లెస్ స్టీల్‌తో
తయారుచేయబడ్డ పాత్రలు
అన్ని ముఖ్యమైన స్టీల్ షాపులలోను
దొరుకుతాయి.

## సేలం స్టెయిన్‌లెస్ తో
## తయారైన పాత్ర సామగ్రి కొనుక్కునేటప్పుడు సందేహానికి తావేలేదు.



స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్,
భారత ప్రభుత్వ వ్యాపారసంస్థ
**సేలం స్టీల్ కర్మాగారం,**
సేలం-636 013 తమిళనాడు

Sista's - SSP.366.85 TE D

చాలా రకాలుగా వాద ప్రతివాదాలు జరిగాయి. విశ్వం మౌనం అందర్ని మరీ నిరాశ పరిచింది. కోర్టు కెళ్ళే ముందు అందరూ అతన్ని బతిమాలి చెప్పారు విషయం చెప్పమని. అలాగే అన్నట్టు తలూపాడు కూడా అతను. కానీ సమయానికి నోరువిప్పలేదు.

మర్నాటికి వాయిదా పడింది.

★ ★ ★ ★ ★ ★

కోర్టు ఆవరణ కిటకిటలాడిపోతోంది. ఆరోజు ఆయా హత్య కేసు తీర్పు చెప్తారు.

విశ్వం పల్లె ప్రజలే కాక చుట్టుపక్కల పల్లె ప్రజలంతా వచ్చారు తీర్పు వినడానికి. అందరి మనసుల్లోనూ విశ్వం నిర్దోషిగా విడుదల కావాలని ఆతృతగా ఉంది. ఎవరికి తోచిన విధంగా వారు భగవంతుణ్ణి ప్రార్థించసాగారు కూడా.

దాసునెన్ని విధాల భయపెట్టినా, బ్రతిమాలినా తనకేం తెలియదన్నాడు. డాక్టరే చంపి వుంటాడని కూడా వాదించాడు. ఉసూరుమన్నారు మమత, కల్పనలు.

వాళ్ళకే కోశానా విశ్వం విడుదలవుతాడన్న ఆశలేదు. అయినా ప్రాణాలు ఉగ్గబట్టుకుని కూర్చున్నారు.

విచారణ ప్రారంభమైంది.

మళ్ళీ సాక్షుల్ని పిల్చారు.

విశ్వాన్ని, దాసుని, యాదయ్యని, మంగిని.... వరసగా బోన్లోకి పిల్చి ప్రశ్నించారు. వారి మాటల్లో మార్పులేదు.

ఏవిధంగా చూసినా, సాక్ష్యాధారాల్ని బట్టి విశ్వమే హంతకుడని తేలుతోంది.

"మీరు చెప్పుకోవాల్సిందేమైనా వుందా?" చివరి సారిగా అడిగారు జడ్జి విశ్వాన్ని.

"లేదు!" అన్నట్టు తల వూపాడు విశ్వం. ఊపిరి బిగబట్టి చూస్తున్నారంతా.

"మీకు... ఈ మంగమ్మ కేరియర్ పంపేదా?" పీడ్లర్ మళ్ళా అడిగాడు.

"ఆ!"

"రాయుడుగారు?"

"వారూ పంపేవారు!"

"ఇంత తిండి ఏం చేసేవారు?"

".............."

"దాసు చెప్పిన కథనం ప్రకారం... మీరు ఏదో నేరం చేశారు. అది కప్పిపుచ్చుకోవడానికి మరో నేరం చేశారు. మీరు కేరియర్ తెప్పించుకున్నది మీ గరల్ ఫ్రెండ్‌కి!... ఆమె మీరూ కలిసి ఆయాని హతమార్చారు మీ గుట్టుమట్టు-లన్నీ తెలుసుకున్నదన్న అభిప్రాయంతో. ఆయా పోగానే మీ లవ్వర్ని పంపేశారు! అవునా?" కఠినంగా అన్నాడు ప్లీడర్!

"కథ బావుంది!" అదోలా అన్నాడు విశ్వం.

"పోనీ...వేరే కథుంటే చెప్పకూడదూ?"

"ఏం లేదు!"

మరి కొంత సేపు వాదప్రతివాదాలు జరిగాయి. ఇరుపక్షాల ప్లీడర్లూ మాటలతో బాణాలు విసురుకున్నారు తమ క్లయింట్స్‌ని రక్షించుకోవడానికి.

అన్నివిధాలా విశ్వమే దోషి అని తేలింది.

జడ్జి కళ్ళజోడు సవరించుకుని–

"ఇందుమూలంగా తేలిందేమిటంటే దోషి తన నేరాన్ని ఒప్పుకుంటున్నాడు... అంటే...మౌనం అంగీకారంగా భావించి... ఇతన్ని ... దోషిగా నిర్ణయించి...." ఆయన మాట పూర్తి కానేలేదు. ఓ మూలగా నిండా దుప్పటి కప్పుకుని నిల్చున్న ఓ వ్యక్తి బాణంలా దూసుకొచ్చి–

"నో!...విశ్వం నిర్దోషి!" కోర్టు దద్దరిల్లేలా అరిచాడు.

అంతే!...కోర్టంతా నిశ్శబ్దంగా అయిపోయింది. ఆ యువకుణ్ణి చూసి నిశ్చేష్టుడైపోయాడు విశ్వం.

"ఎవర్నువ్?" పాతికేళ్ళుండి బలంగా వున్న ఆ యువకుణ్ణి ప్రశ్నించాడు జడ్జి.

"నా పేరు ఆనంద్!" అన్నాడతను.

"అతను నిర్దోషి అని నీకెలా తెలుసు?"

"ఆ హత్య జరిగేటప్పుడు నేను చూశాను కాబట్టి!"

"ఏవిఁటి?" తృళ్ళిపడ్డాడు జడ్జి.

కోర్టులో కలకలం బయల్దేరింది.

"అవును! ఆ హత్య చేసింది... వేరే వ్యక్తి!" అన్నాడతను గంభీరంగా.

"ఆనంద్!... నువ్వెందుకొచ్చావ్?" కంగారుగా అన్నాడు విశ్వం. ఆనంద్ నవ్వాడు.

"చెప్పు!..." తొందర పెట్టాడు జడ్జి. మమత వాళ్ళ మొహాల్లోకి కాంతి వచ్చింది.

"నా పేరు ఆనంద్!...."

"ఇందాక చెప్పావ్!"

"కానీ... ఏ ఆనంద్‌నో చెప్పలేదు!" నవ్వాడతను. అర్థం కానట్టు చూశారంతా

"నక్సలైట్ నాయకుడు ఆనంద్ తెలుసుగా? ఆ ఆనంద్‌ని నేనే!" తాపీగా అన్నాడతను.

"ఆఁ?" కొయ్యబారి పోయాడు జడ్జి.

నిర్ఘాంతపోయారంతా.

పరిశీలనగా చూశారతని కేసి. అతను కప్పుకున్న దుప్పటి, పెట్టుడు గడ్డం తీసేశాడు. తృళ్ళిపడి చూశారంతా.

అవును!... అతను నక్సలైట్ ఆనందే!... ఆమధ్య ప్రతి పేపర్లోనూ అతని ఫోటోలు వేశారు. జైల్లోంచి పారిపోతూంటే పోలీసులు కాల్చారు. కాలికి తుపాకీ గుండ్లు తగిలినా అలా మొండిగా పారిపోయాడతను.

ప్రస్తుతం అతని కోసం గాలింపు జరుగుతోంది.

"ఇతన్ని అరెస్ట్ చెయ్యండి!" కంగారుగా అన్నాడో లాయర్.

ఫక్కున నవ్వాడు ఆనంద్.

"లొంగిపోవడానికి వచ్చిన వాణ్ణి కష్టపడి అరెస్ట్ చేస్తున్నారుగానీ...కాస్సేపు ఆగండి!...నేను నా స్నేహితుడి కోసం ఇలా వచ్చాను!...." అని, జడ్జితో –

"సర్!...నేనీ హత్య గురించి చెప్పగలను! నాకు అనుమతివ్వండి!" అన్నాడు.

"చెప్పు!" అన్నాడాయన.

"హత్య గురించి చెప్పేటప్పుడు నాకూ, విశ్వానికీ మధ్యగల స్నేహం గురించి చెప్పాలి!...

విశ్వం, నేనూ చిన్నతనం నుంచీ స్నేహితులం! ఒకరికొకరం ప్రాణంగా మెలిగే వాళ్ళం. అయితే మా స్వభావాలు మాత్రం పూర్తి వ్యతిరేకం!

విశ్వం సాత్వికంగా ఉండేవాడు. నేను, నేను కాస్త రాలుగాయిలా వుండేవాణ్ణి. "తప్పు చేసినవాణ్ణి క్షమించడంలోనే వుంది గొప్పదనం" అని వాడంటే–

"దెబ్బకి దెబ్బ! రక్తానికి రక్తం!" అంటూండే వాణ్ణి నేను. నా స్వభావానికి బాధపడిపోయేవాడతను. గాంధీగారి కథలు చెప్పేవాడు. పురాణాలు వల్లించే-వాడు. ఎప్పటికైనా అహింసే గెలుస్తుంది!.... సత్యమే జయిస్తుంది!అని నూరి పోసేవాడు. "గౌతమ బుద్ధుడు జన్మించిన దేశంరా మనదీ!" అని గోల పెట్టేవాడు. నీలాంటి వార్ని దేశద్రోహులుగా పరిగణిస్తార్రా!" అని వాపోయే-వాడు!...అన్నింటికీ తేలిగ్గా నవ్వేసేవాణ్ణి.

ఇంత విభిన్న మనస్తత్వాలు మా ఇద్దరివీ!... అయినా మా మధ్య స్నేహానికది ఏనాడూ అడ్డు రాలేదు!

నేను చేసిన పన్లని నేరాలుగా తలచిన ప్రభుత్వం నన్ను నానాయాతనలూ

పడి బంధించింది. కానీ నేను తెలివిగా వాళ్ళ కళ్ళు కప్పి పారిపోయాను. పోలీసులు నా మీద కాల్పులు జరిపారు. అదృష్టవశాత్తూ కాలికి తగిలాయా దెబ్బలు. రెండు గుళ్ళు నా తొడలో నిల్చిపోయాయి. అలాగే పారిపోయాను.

అలా వెళ్ళడం వెళ్ళడం విశ్వం వాళ్ళ పల్లెకెళ్ళి వాడి హాస్పటల్ తలుపు తట్టాను.

దైవికంగా వాడు ఏదో పని చూసుకుంటూ అక్కడే ఉన్నాడు. ఇంకెవరూ లేరు.

నన్నా పరిస్థితిలో చూసి నిర్ఘాంతపోయాడు. ఒళ్ళూ, ఇళ్ళూ అంతా రక్తం! తూలుకుంటూ నడుస్తున్న నన్ను పొదివి పట్టుకుని –

"ఏమిట్రా ఇదంతా?" అంటూ బావురుమన్నాడు. విషయం క్లుప్తంగా చెప్పాను.

వాడు నీతివాక్యాలు బోధిస్తూనే థియేటర్లోకి తీసికెళ్ళి బులెట్స్ తీసి కట్టు కట్టాడు.

నిస్త్రాణగా పడుకున్న నన్ను కన్నతల్లిలా ఆదుకుని సేవలు చేశాడు. తరవాత మెల్లగా బుజ్జగించి వివరాలడిగాడు. ఈసారి నేను వివరంగా అన్నీ చెప్పాను.

వాడు తిట్టి పోశాడు. నీ మూలంగా నీ వాళ్ళంతా బాధ పడాలి!... అంటూ మండి పడ్డాడు. తరవాత ఆడదానిలా ఏడ్చాడు.

"ఎందుకు రా ఏడుస్తావ్?" నవ్వుతూ అన్నాను.

"ఏడవకేం చెయ్యనురా! నీలాంటి స్నేహితుడుంటే?...అయినా ఇన్ని చేసి ఏం సాధించావ్?" అన్నాడు కోపంగా– కాస్త వాతావరణం మారాక –

"విశ్వం!...నాక్కాస్త నయం అయ్యేదాకా నీ ఆశ్రయం కావాలిరా!" అన్నాను.

"అలాగే!...పూర్తిగా నయం అయ్యాకే వెళ్ళు!" శాంతంగా అన్నాడు. నాకు ఆశ్చర్యం వేసింది–

"ఏవిట్రా అంత తేలిగ్గా ఒప్పుకున్నావ్? కొంపదీసి... నన్ను పోలీసులగ్గానీ అప్పజెప్పవు గదా?" అన్నాను నవ్వుతూ.

వాడు బాధగా చూశాడు.

"నీకేం భయం లేదు!... నీకాలు నయం అయ్యే వరకూ నా దగ్గరే వుండు!" అంటూ నన్ను పడుకోమని వరండాలోనూ, గదిలోనూ పడిన రక్తాన్ని తుడిచేసి ఆ గుడ్డల్ని తగలపెట్టేశాడు. ఆ తరవాత అక్కడంతా నీళ్ళు పోసి కడిగాడు.

నేను నిస్త్రాణగా పడుకుని నిద్రలోకి జారిపోయాను. అన్నట్టుగానే నాకు ఏ లోటూ రాకుండా చూసుకున్నాడు. అక్కడికెవరూ రాకుండా కూడా ఏర్పాటు చేశాడు. ఎలాగో టైమ్‌కి తిండి అవీ కూడా క్రమం తప్పకుండా తెప్పించాడు.

అయితే – ఓ రోజు రాత్రి ఓ చిత్రం జరిగింది.

అర్ధరాత్రి కింది నించి మాటలు వినిపించి కుతూహలంగా చూశాను. ఓ స్త్రీ విశ్వాన్ని బెదిరిస్తోంది. మరింత కుతూహలంగా చాటుగావచ్చి నిల్చున్నాను. ఆమె విశ్వాన్ని పదివేల రూపాయలు ఇమ్మనీ, లేకపోతే....దేశద్రోహిని దాచినట్టుగా ప్రభుత్వానికి చెప్పి.... అరెస్టు చేయిస్తాననీ బెదిరించింది.

ఇద్దరి మధ్యా కాస్సేపు ఘర్షణ జరిగింది.

చివరికి చచ్చినా డబ్బు ఇవ్వనని, నీ అంతం చూస్తానని ఆవేశంగా అన్నాడు విశ్వం. ఆమె వ్యంగ్యంగా నవ్వేసి... "కటకటాల వెనకాల కూర్చోవాలని సరదాగా ఉంటే అలాగే చెయ్యి!" అంటూ వెళ్ళిపోయింది.

నేను కొయ్యబారి పోయాను.

"నిజంగా ఆమె ప్రభుత్వానికి చెప్తే... అమాయకుడైన విశ్వం చిక్కుల్లో పడతాడు!... నా మూలంగా నా ప్రాణస్నేహితుడు దోషిగా నిలవడం నాకిష్టం లేదు!

అందుకే అక్కణ్ణించి వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్నాను. విశ్వానికి చెప్తే వెళ్ళనివ్వడని నాకు తెలుసు. అందుకే పెరటి వైపు మెట్ల ద్వారా పారిపోయాను.

ఓ చోట విశ్వాన్ని బెదిరించిన అమ్మాయి కనిపించింది. క్షణం పక్కగా దాగాను. ఆమె ఓ ఇంట్లోకెళ్ళింది. ఆ వెంటనే తలుపులు తోసుకుంటూ మరొకతను వెళ్ళాడు. నేను కుతూహలంగా అటుకేసి నడిచాను.

ఏవో మాటలు వినిపిస్తున్నాయి.

మెల్లగా కిటికీలోంచి తొంగి చూశాను. అంతే! కొయ్యబారి పోయాను.

అతని చేతిలో రివాల్వర్! ఆమె కేసి గురి పెట్టబడి వుంది. ఆమె ఒణికి పోతూ –

.."నన్ను చంపకు! ప్లీజ్! నీకు దణ్ణం పెడతాను!" అంటోంది చేతులు జోడించి.

అతను వికటంగా నవ్వాడు.

ఆ నవ్వుకు ఆమె మరీ ఒణికిపోయింది.

"ఇన్నాళ్ళూ నానా అవస్తలూ పడి నీ ఉనికి తెలుసుకున్నది, నిన్నంత తేలిగ్గా వదలడానికా? ఇంత దూరం నిన్ను వెతుక్కుంటూ వచ్చింది నిన్ను చంపకుండా వదలడానికా?" అన్నాడు కర్కశంగా.

"నా మానాన నేను బతుకుతున్నాను! నా జోలి నీ కెందుకు?" ధైర్యాన్ని కూడదీసుకుంటూ అందామె.

"నీ మానాన నువ్వు బతుకుతున్నావా? ఎంత మంది వుసురు పోసుకున్నావు. "?ఇంకెందరి ఉసురు పోసుకోబోతున్నావ్?... నువ్వో కామ పిశాచానివి! నీకు వావి వరసలక్కర్లేదు!...తండ్రీ కొడుకులతో అక్రమ సంబంధం ఏర్పరచుకున్నావ్!... నీకన్నా చిన్నవాళ్ళని సైతం రెచ్చగొట్టి నీ దాహాన్ని తీర్చుకున్నావ్!

నా కళ్ళ ముందే నాటకాలాడావ్!... నన్నో చవటని చేసి ఆడించావ్! .. చివరికి ఇంట్లోవి నగ, నట్రా తీసుకుని మరో పక్షితో ఎగిరిపోయావ్!... నీ మోజు తీరగానే వాణ్ణి మట్టు పెట్టావ్! ..తెలివిగా ఓ విధవగా ఇక్కడికి చేరావ్!... నాటకాలాడి డాక్టరు దగ్గర ఆశ్రయం సంపాదించావ్!. కాంపౌండర్ని ముగ్గులోకి లాగావ్! చివరికి డాక్టర్ని కూడా నీ వల్లోకి లాగాలని ప్రయత్నించావ్! అతను పడలేదు. చివరికి ... అతన్ని బ్లాక్ మెయిల్ చేసి డబ్బు దోచుకోవాలనుకున్నావ్! సెభాష్! నీలాంటి ఆడది ... ఎక్కడా వుండదు! ఉండకూడదు!" వికటంగా నవ్వుతూ ఆమెకేసి అడుగులు వేశాడతను.

ఆమె బతిమాలింది. ఏడ్చింది. తిట్టింది. అతను చలించలేదు –

"నువ్వు చేసిన పనికి ఊళ్ళో తలెత్తుకోలేక ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాను. కానీ, నిన్ను చంపాకే ఆ పని చెయ్యాలని ... నీ కోసం వేటాడాను. నువ్వు దొరికావ్! నా ఆశయం నెరవేరబోతోంది!" అన్నాడతను.

నేను వెళ్ళి ఆమెని కాపాడాలనుకున్నాను. ఇంతలో ఎవరో వస్తున్నట్టు అలికిడై పక్కకి తప్పుకున్నాను. నా స్థితి గుర్తొచ్చి ఆమె మానాన ఆమె నొదిలి వెళ్ళిపోయాను." ముగించాడు ఆనంద్.

"కానీ...ఆమె రివాల్వర్‌తో చంపబడలేదు!" ఓ లాయరన్నాడు.

"కావచ్చు! – ఎవరో వస్తున్నట్టు అతను కూడా గమనించాడేమో. అందుకే రివాల్వర్‌తో చంపకుండా గొంతు నులిమి చంపేడేమో! అంతేగానీ ఈ హత్య చేసింది విశ్వం మాత్రం కాదు.

ఇప్పుడు నేను చెప్పిందంతా నా సిద్ధాంతాల మీద ఒట్టేసి చెప్తున్నాను. నూటికి నూరు పాళ్ళూ నిజాలు! ఇంక నన్ను మీరేం చేసినా ఫరవాలేదు!" అంటూ చేతులు చాచాడు ఆనంద్.

"అతన్ని నువ్వు గుర్తించగలవా?" జడ్జి అన్నారు.

"ఆ!"

దాసుని చూపించి –

"ఇతనా?" అన్నాడు.

"ఉహూఁ! కాదు!" నమ్మకంగా అన్నాడు ఆనంద్.

(ఇంకా ఉంది)






**యు.పి.ఆర్., ఉరవకొండ**

★ మన ముఖ్య మంత్రిగారు కాషాయ వస్త్రాలు ధరించడం పట్ల మీ అభిప్రాయం?

● ఒకప్పుడా "గురూ కలర్" గొప్ప ఫాషన్. ఆయన కిష్టమైన రంగు ఆయన వేసుకునే హక్కు ఆయన కుంది. కాని పార్టీ రంగులు ప్రజా ప్రతినిధులని ధరించ మనడం- సిల్లీ. ఇక వారి పతాకానికి గౌరవం ఎలా వుంటుంది ఆ రంగులే డ్రస్సులైతే?

**ఎస్. వి., జుక్కల్**

★ జీవితంలో సుఖం అనేది ఎక్కడ లభిస్తుంది?

● అది తెలుస్తే యీ తాపత్రయాలన్నీ దేనికి భాయీ. యీ సుఖాన్వేషణలో సుఖం లేదని తెలుసుకున్న నాడు నిజమైన సుఖం లభిస్తుందంటారు – వేదాంతులు.

**రాజా, నాయుడుపేట**

★ మీ శ్రీవారి షష్టిపూర్తి తెలుగునాడులో గాక తమిళనాడులో ఎందుకు?

● కాకతాళీయం! ఇక్కడ జరగడం- అక్కడా జరిపారు. అయినా కవికి ప్రాంతీయ బేధాలుండవు. కవులు మేధావులు విశ్వమానవులు కదా!

**ఎస్. వి. ఆర్. - సంగంజాగర్లమూడి**

★ స్త్రీ హృదయం తెలుసుకోవడం ఎలా?

● లాభం లేదు. తెలిసింది తెలిసిందనుకున్నప్పుడల్లా ఏమీ తెలియకుండా పోతూ వుంటుంది.

**జి.వి.కె.ఆర్., విజయవాడ**

★ ఉమెన్, వైన్....

● ఎస్, గేమ్ అండ్ డిసీట్ అంతేగా? ఐశ్వర్యం తరగడానికి, ఆశలు పెరగడానికి- ఆడది దారని నమ్మడం ఎవరి తప్పు?

**ఆర్.కె., పెద్దాపురం**

★ వరకట్న నిషేధ చట్టం అమలులోకి తెచ్చారు. చట్టం వున్నంత మాత్రాన కట్నం లేకుండా పోతుందా?

● పోదు. కాని ఒళ్లు మండి కంప్లయింట్ యివ్వాలని ఆశ పడే తల్లి తండ్రులకి ఒక ఛాన్సు దొరుకుతుంది! కొబ్బరికాయలు ఎత్తుకు పోకుండా మడిబట్ట అడ్డుతుందా! అలాగే యిదీ. మనుషులు మారందే- చట్టాలు పని చెయ్యవు.

**ఎన్.బి.వి., ఔరంగాబాదు**

★ ఆడవారంటే మీకంత అభిమానం కదా. మరి ఆ ఆడవారే ప్రేరేపించి, ప్రేమింప జేసి- నాకేం తెలియదన్నట్టు ప్రవర్తిస్తుంటే వారి నేమనాలి? ఆది శక్తులా? దుష్ట శక్తులా?

● మరి కీలుబొమ్మలా ఆడిన మిమ్మల్ని ఏమనాలి? ఆడది ఎదుటి మనిషిని పట్టి- ఆదిశక్తిగానో దుష్టశక్తిగానో మారుతుంది.

**టి.ఎ.వి., భైపల్లి**

★ సమాజంలో మనిషి విలువ ఎంత?

● తనకి తాను యిచ్చుకున్నంత!

★ దేవాలయాలపై బూతు బొమ్మ లెందుకు?

● చాలా చెప్పారు. తాపీవార్ని చదవండి.

**ఎస్.వి.ఆర్., గుడివాడ**

★ వీడిని ఆంధ్ర దేశానికి పంపించి రామలక్ష్మి సమాధానాలు చదివించండి అని యమధర్మరాజు శిక్షలు వేస్తున్నాడట యీ మధ్య.

● అందుకేనా మీలాంటి శాల్తీ లెక్కువగా కన్పిస్తున్నా యీ మధ్య??

**బి.బి.ఆర్., నారాయణపేట**

★ పెళ్లయిన అమ్మాయిని ప్రేమించాను. ఆమెను భర్త వదిలేశాడు. నా కామెను చేసుకోవాలని వుంది. కాని సమాజం?

● ప్రేమించడానికి అడ్డురాని సమాజం పెళ్లికి అడ్డా?!

**బి.ఆర్.కె., కోరుకొండ**

★ కోర్టులో జడ్జిగారు ఆర్డర్ ఆర్డర్ అంటూ సుత్తితో నే ఎందుకు కొడతారు?

● అది కర్ర సుత్తి. అందరి దృష్టినీ ఆకర్షించేటంత చప్పుడూ చేస్తుంది, బల్లకి ప్రమాదమూ లేదు. అందుకే కాలింగ్ బెల్లు, బల్ల చరచడం కంటే- కర్ర సుత్తి నయం అనుకుని వుంటారు. జడ్జిగారు సైలెన్సు అని అరిచినా బాగుండదు కదా!

★ రాముని పాలనలో ప్రభుత్వోద్యోగులు?

● పాదుకలు కొలవడం లేదని రాముడు బాధ పడిపోయేలా చేస్తున్నారు పాపం!

**సి.ఎల్.పి., అనకాపల్లి**

★ ప్రతి మనిషికి సెక్సుపరిజ్ఞానం ఎంత అవసరం?

● వయస్సుతో పాటు సెక్సు జ్ఞానం అదే వస్తుంది. కాని జీవితంలో యీ విషయంలో యిబ్బందులు ఎదురైనప్పుడు మొహమాటం లేకుండా డాక్టర్ల నడిగి తెలుసుకోవాలన్న జ్ఞానం ముఖ్యం.

**బి.ఎల్., రాజమండ్రి**

★ ఏ పేపరు చూసినా ఎక్కడ విన్నా పదవ తరగతి విద్యార్థులు ఆ వయస్సు వారు ప్రేమించుకొనడం, ప్రేమ ఫలించక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. వారి ప్రేమలు భగ్నం కాడానికి కారణం ఏమిటి?

● వయస్సు లేకపోవడం.

**ఎం. వి. కె. ఉరవకొండ**

★ డాక్టర్లు తెల్ల కోటు, లాయర్లు నల్లకోటు ధరిస్తారెందుకు?

● రక్తం చిందిస్తే తెలియడానికి, సాక్ష్యం రంగు తెలియకుండా ఉండడానికి అయివుంటుంది సోదరా, నేనడిగిన వాళ్లంతా - ఇది బ్రిటిష్‌వాళ్లు మిగిల్చి పోయినదంటున్నారే గాని - ఎందుకని చెప్పకుండా వున్నారు. నాకు తెలియగానే తమకి చెప్పేస్తా! □






# ఘోటూల్

రమణశ్రీ



పున్నమి చంద్రుని ఆగమనానికై ఎదురు చూస్తున్న ప్రకృతి కాంత నునుసిగ్గుల చిరు చీకటి మేలి ముసుగులో పులకించిపోతోంది.

ఘంటసాల భక్తిపారవశ్యంలో గానం చేసిన భగవద్గీత అక్కడ అందరి హృదయాలలో అలౌకిక అనుభూతిని నింపుతోంది.

శివ రామ కృష్ణ క్షేత్రం వందలాది భక్తులతో నిండి వుంది.

అందరూ మామూలు భక్తులు కాదు. భక్తాగ్రేసరులు అనేక గుళ్ళు, గోపురాలు కట్టించి, కట్టిస్తూ భగవంతుడికి నీడ ప్రసాదిస్తున్న భక్తులు.

ఆరోజు వారందరూ ఒక మహత్తరమైన కార్యక్రమాన్ని జయప్రదం చేయడం కోసమే వచ్చారు. ఆ కార్యక్రమానికి సంధానకర్త శ్రీశ్రీశ్రీ చిద్విలాసానందస్వామి.

మైక్‌లో విన్పిస్తున్న భగవద్గీత ఆగిపోయింది.

"స్వామీజీ వస్తున్నారు" ఎవరో వచ్చి ప్రకటించారు.

ఆశీనులైన వారంతా తమ దృష్టిని వేదికపైకి సారించారు.

శిష్యగణం వెంట రాగా స్వామి చిద్విలాసానంద వేదికపైకి వచ్చి ఉచితాసనం అలంకరించారు. శిష్యగణం క్రింద ఆశీనులయ్యారు.

సమావేశస్థలమంతా నిశ్శబ్దం ఆవరించింది.

స్వామీజీ పసిమిఛాయలో కాషాయ దుస్తులలో వెలిగిపోతున్నారు. ముఖంలో వర్చస్సు చూపరులను యిట్టే ఆకర్షిస్తోంది.

ఆజానుబాహుడయిన స్వామీజీ వామహస్తం అందరివైపూ అర్థ చంద్రాకారంలో ఆశీఃపూర్వకంగా తిరిగింది.

తదుపరి ఉచ్ఛస్వరంతో అయిదు నిమిషాలసేపు భగవన్నామం పఠించారు.

"మహా భక్తులారా" ఖంగున మ్రోగింది స్వామిజీ కంఠం.

అందరూ ఆసక్తిగా వినసాగారు.

"ఈరోజు చాలా సుదినం. నా ఆశయసిద్ధికి పునాది ఏర్పడే రోజు. నేను ఇరువది సంవత్సరాలు హిమాలయాలలో మహోన్నత గురువులవద్ద గడిపి ఈ సృష్టి ఆద్యంతాలను కాచి వడబోశాను. నలుబది సంవత్సరముల నుండి కాశ్మీరంనుండి కన్యాకుమారి వరకు ఆసేతు హిమాచలం అనేకసార్లు పాదచారినై పర్యటించాను.

మన దేశంలో హిందూ మత ప్రాభవానికి, ప్రాచీన శిల్ప కళ వైభవానికి ఆనవాలుగా నిలచిన అనేక ప్రముఖ దేవాలయాలను పలుసార్లు సందర్శించాను. అప్పుడే నాకు అన్పించింది, ఈ దేశంలో ఎంతమంది సాధారణ ప్రజలు యీ దేవాలయాలన్నింటినీ దర్శించగలుగుతున్నారు? ఆంధ్రదేశంలో వున్న ఓ సగటు మనిషి బదరీ, కేదార్‌లను సందర్శించడం ఎంతో వ్యయ ప్రయాసలతో కూడుకున్నదే గదా!

అందుకే దేశంలోని ప్రముఖ దేవాలయాలన్నింటినీ ఒకేచోట సమీకరించాలని సంకల్పించాను. ఇది నాకుగా జనించింది కాదనుకుంటున్నాను. మహత్తరమైన దైవ ప్రేరణ గాకపోతే నాకు యీ ఆలోచన రావడ మేమిటి?

భారతదేశంలోని ప్రముఖ దేవాలయాల నమూనాలతో ఓ గొప్ప దేవాలయాల సముదాయాన్ని నిర్మించాలన్నది నా ఆలోచన.

ఎక్కడ యీ సముదాయాన్ని నిర్మించాలా అని తీవ్రంగా ఆలోచించిన పిదప ఆ క్షేత్రాన్ని ఎన్నుకొన్నాను. దేశం నలు మూలలనుండి లక్షలాది భక్తులు నిత్యం స్వామివార్ని దర్శిస్తుంటారు. వారందరికీ అందుబాటులో వుండాలనే భావనతో అక్కడ యీ సముదాయాన్ని నిర్మించడానికి పూనుకున్నాను.

దేశంలో పేరు ప్రఖ్యాతులు పొందిన ఇరవై ఒక్క దేవాలయాల నమూనాలను తీసుకొని అదేవిధముగా ఆగమ శాస్త్ర ప్రకారం ఆ దేవాలయాలను ఒకేచోట నిర్మించాలని నా పథకం. ఆ సముదాయంలోకి అడుగిడిన భక్తుడు తాను భారతావని మొత్తం సందర్శించానన్న తృప్తితో బయటకు రావాలి. అంతేగాక మత సామరస్యానికి చిహ్నంగా ఇతర అన్ని మతాలకు సంబంధించిన ఆరాధన మందిరాలను పేరుకొక్కటి చొప్పున యీ సముదాయంలోనే నిర్మించాలని ఆలోచన.

ఇది నిజంగా బృహత్ప్రయత్నం. మాన్యులు తలుచుకుంటేనేగాని సామాన్యులు దర్శించలేని కార్యక్రమ మిది.

సుప్రసిద్ధ ఇంజనీర్లను, వాస్తు శాస్త్రవేత్తలను, ఆగమ శిల్పాచార్యులను సంప్రదించి అంచనాలు వేయగా యీ కార్యక్రమానికి దాదాపు తొంభై లక్షల రూపాయలు వ్యయమవుతుందని తేలింది.

నిరంతర సంచారి, సన్యాసినైన నా దగ్గర అంత ధన మెక్కడిది? అందుకే వదాన్యులైన మిమ్ములను కోరుతున్నాను, యీ మహత్తర యజ్ఞంలో పాలుపంచుకోమని.

తాతానో, బిర్లానో తలుచుకుంటే యీ పని చేయగలరు. కానీ నా కది యిష్టంలేదు. వేలాదిమంది కృషి నిక్షిప్తం కావాలి యిందులో. ఇది లక్షలాది మందికి మార్గ దర్శకం కావాలి, కోట్లాది మందికి తృప్తి కలిగించాలి. అందుకే ఒక చక్కని ప్రణాళిక ఆలోచించాను". ఒక్క నిమిషం ఆగారు స్వామిజీ.

అంతా కుతూహలంగా చూశారు స్వామిజీ వైపు.

"పది వేల రూపాయలు విరాళ మిచ్చిన దాత పేరు శిలా ఫలకంపై చెక్కించి, ఆ ఫలకం ప్రక్కనే దాత నిలువెత్తు ఫోటో కలిపి ఆ దేవాలయాల ప్రాంగణంలో అమర్చబడుతుంది. తద్వార ఆ దాత కీర్తి ప్రతిష్టలు తర తరాలకు చిరస్థాయిగా నిలచిపోవడమే గాక కోట్లాది భక్తుల హృదయాలలో అతని ఫోటో అజరామరంగా నిలచిపోతుంది. అంతేకాదు, అన్ని దేవాలయాలలో నిత్యం మీ గోత్ర నామాదులతో పూజ జరుపబడుతుంది.

కనుక సావధానంగా విన్న మీరంతా నాయీ ప్రయత్నానికి చేయూత నివ్వగలరని ఆశిస్తున్నాను. శుభం" అంటూ ముగించారు స్వామిజీ.

కరతాళ ధ్వనులతో సమావేశస్థలి ప్రతిధ్వనించింది.

నోట్ల కట్టలతో కొంతమంది, చెక్కులతో మరికొంతమంది స్వామి వార్ని అభిషేకించారు.

పత్రికలన్నీ యీ సమాచారాన్ని పతాక శీర్షికలలో ప్రచురించాయి.

పథకానికి అనన్య ప్రచారం లభించింది. వర్తక వాణిజ్య వర్గాలవారు, మేధావి వర్గాలవారు, డాక్టర్లు, లాయర్లు, ఇంజనీర్లు, కొంతమంది మంత్రులు సైతం ఆకర్షితులైనారు.

అనేక ముఖ్య కేంద్రాలలో స్వామిజీ సభలు ఏర్పాటు చేయబడినాయి. ఎక్కడెక్కడినుండో డబ్బులు, డ్రాఫ్టులు, చెక్కులు అందుతున్నాయి.

అతి కొద్ది కాలంలోనే లక్ష్యం పూర్తయింది.

ప్రతి ఒక్కరూ స్వామిజీ నిర్మాణ కార్యక్రమం ఎప్పుడు ప్రారంభిస్తారా అని ఎదురు చూస్తున్నారు. కొందరైతే ఎందుకైనా మంచిదని తమ ఫోటోలకోసం ముందుగానే అర్డరిచ్చుకుంటున్నారు.

సరిగ్గా యిలాంటి సమయంలోనే ఓ సుప్రభాతాన పత్రికలన్నీ గుప్పుమన్నాయి.

'లక్షల ధనంతో స్వామిజీ పలాయనం' కొంచెం కుడి ఎడమగా అన్ని పత్రికల పతాక శీర్షిక అదే!

అంతే, దాతల గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. కొందరు జుట్టు పీక్కుంటే, మరికొందరు బట్టలు చింపుకున్నారు. కొందరు సామిజీ తెలివి తేటలకు ఆశ్చర్యపోయి జోహారు లర్పించేస్తే మరికొందరు ఇంత మంచి ఆలోచన ముందుగా తమ కెందుకు తట్టలేదని వాపోయారు.

ఏ నాలుగు రోడ్ల కూడలిలో చూసినా యిదే చర్చ.

పోలీసులు శరవేగంతో రంగంలోకి దూకారు. కనబడిన సాధువును, సన్యాసిని వదలకుండా శోధించేస్తున్నారు. ఎంత ప్రయత్నించినా ఎక్కడా ఎలాంటి ఆధారమూ చిక్కలేదు వారికి.

పత్రికలకు మాత్రం చక్కని ఆహారం దొరికింది.

జరిగిన సంఘటనకు చిలువలు పలువలు వూహిస్తూ, రక రకాల వ్యాఖ్యానాలు జోడిస్తూ సీరియల్స్ వ్రాస్తున్నారు.

నాయకులు సందుదొరికిందని మైకు పట్టుకొని సానుభూతి కురిపించేస్తున్నారు. ప్రతి పక్ష నాయకులు ప్రభుత్వాన్ని దుమ్మెత్తి పోస్తూ పోలీసులను చేతకాని వాళ్ళుగా చిత్రిస్తున్నారు. హేతువాదులు మాత్రం తగిన శాస్తి జరిగిందంటూ సంతోషం వ్యక్తపరుస్తున్నారు.

ఏతా వాతా యిలా యీ సంఘటన ముగిసిపోతే, యీ కథ కూడా కంచికి వెళ్ళిపోయేదే! కానీ అనుకోకుండా ఓ రోజు దిన పత్రికలలో మొదటి పేజీలలో బాక్సు కట్టిన ఒక ప్రకటన దర్శన మిచ్చింది.

'స్వామి చిద్విలాసానంద ఈ రోజు సాయంత్రం గ్రౌండ్సులో దర్శనమిస్తారు' అన్నది ఆ ప్రకటన సారాంశం.

ప్రజలలో తీవ్రమైన సంచలనం!

ఆశ్చర్యం! ఆనందం!

అందరూ పరుగు పరుగున గ్రౌండ్సుకు తరలి వెళుతున్నారు. పోలీస్ డిపార్ట్‌మెంట్ మొత్తం గ్రౌండ్సులో ట్రైనింగ్ అవుతుందా అన్నట్లుగా మొహరించివుంది. ఎవరికి వారికి అంతా మిస్టరీగా వుంది.

పారిపోయిన వ్యక్తి ఎందుకు కన్పిస్తున్నాడు?

మళ్ళీ ఏదైనా మోసం చేయడానికా?

అయినా ఆ అవసరమేముంది?

తర తరాలకు సరిపడినంత సంపాదించుకున్నాడే!

కాకలు దీరిన సత్తాదారులు సైతం అతని జాడలు తయ లేక పోయారు. అలాంటిది తనంత తాను బయట పడటమా? లేక ఎవరైనా ఆకతాయి తనానికి ఆ ప్రకటన యిచ్చారా?

పోలీసులు మాత్రం జనాన్ని అదుపులో పెట్టే ప్రయత్నంలో మహా ఉత్సాహంగా వున్నారు.

సరిగ్గా సమయం అయిదు గంట లయింది.

ఓ వ్యక్తి సత్వరున వేదికపైకి దూసుకు వచ్చాడు. అతని చేతిలో పోర్టబుల్ మైక్‌వుంది.

"సభా సదులారా, నేనే స్వామి చిద్విలాసానందను" మైకులో అరిచాడు బిగ్గరగా.

అంతా సంచలనం, ఈలలు, వెర్రి కేకలు!

కాదు.... కాదు... సభాస్థలం మారు మ్రోగిపోయింది.

మౌనంగా భుజాన వున్న సంచిలో నుండి కృత్రిమ గడ్డం, మీసం తీసి పెట్టుకున్నాడు. కాషాయ బట్టలు తీసి ధరించాడు.



# తాజాదనం రోజంతా నిలిచేలా ఉంచండి.

కొత్తది







అసలైన తాజాదనం! అదే రోజంతా నిలిచి వుండే తాజాదనం! మీకు సాధారణ సబ్బులు ఇచ్చేలాంటి కొద్ది సేపట్లో మాయమైపోయే తాజాదనం కాదు. శరీర దుర్గంధం పోగొట్టి మిమ్మల్ని రోజంతా హాయిగా వుంచగల తాజాదనం— అదే కొత్త సింథాల్ మాత్రమే ఇవ్వగల వాగ్దానం.

**సింథాల్‌లో ఇప్పుడు మనమోహక కొత్త పరిమళం కలదు. దుర్గంధాన్ని పోగొట్టడానికి సింథాల్‌లో గల ప్రభావవంతమైన శక్తి చర్మ క్రిములను నాశనం చేసి, మిమ్మలను రోజంతా తాజాగా దుర్గంధ రహితంగా వుంచుతుంది.**

CHAITRA-B-G-330 TEL

## కేవలం సింథాల్
మాత్రమే మిమ్మల్ని దినమంతా తాజాగా దుర్గంధరహితంగా ఉంచగలదు.

Godrej ఉత్పాదన

# ఇ·వేమన·పద్యాలు




సతుల జూచి చూచి సౌఖ్యంబు గోరుచు
గతులుగాన లేరు కర్మలెందు
గతులు సతులవలన గానంగ లేరయా
విశ్వదాభిరామ వినురవేమ.

గ్రౌండ్స్‌లో ఒక్కసారిగా కలకలం చెలరేగింది. అందరూ ఒక్కసారిగా వాడే.... వాడే..... అంటూ అరవ సాగారు.

తేరుకున్న పోలీసులు వేదిక దగ్గరకు దూసుకు రాబోయారు.

ఆగండి. దయచేసి దగ్గరకు రాకండి" గంభీరమైన ఆ కంఠ స్వరానికి అదిరిపడి అందరూ ఆగిపోయారు.

తిరిగి తాపీగా కృత్రిమ వేష ధారణ అంతా తీసి వేసి నిజ స్వరూపంతో మైకు అందుకున్నాడు ఆ అగంతకుడు.

"డియర్ పోలీస్, దయచేసి నాకు కొంత వ్యవధి యివ్వండి. నేనే స్వచ్ఛందముగా మీకు లొంగి-పోతాను" అంటూ ప్రజల వైపు తిరిగాడు.

అందరూ వూపిరి బిగపట్టుకొని చూడసాగారు.

## ఫోటో

అంతమంది జనం వున్నా ఆ గ్రౌండ్స్ నిర్మానుష్య ప్రాంతంలా నిశ్శబ్దమై పోయింది.

"ప్రజలారా, ప్రపంచదేశాలన్నీ ఎన్నో విధాలుగా అభివృద్ధి చెందుతోంది. మన దేశం మాత్రం అంధః విశ్వాసాలకు ఊడిగం చేస్తూ బానిసత్వపు బ్రతుకు బ్రతుకుతోంది. ఇది వ్యక్తుల దోషం కాదు. వ్యవస్థ తీరుయిది. ఈ వ్యవస్థ ఇంతకన్నా మంచి మనుషులను, మంచి మనసులను తయారు చేయలేదు. అందుకే పెద్దమనసు చేసుకొని మీరే...... మీరే..... ఆలోచించి యీ వ్యవస్థను మార్చుకోండి. ముఖ్యంగా మన సమాజానికి పట్టిన రుగ్మత, ఆర్థిక అసమానతలు అనుక్షణం పెరిగి మనిషికి మనిషి దూరమవుతున్న యీ సమాజంలో తోటి వారిని ఆదుకోవాలనే మనస్తత్వం లోపించడమే!

కేవలం శిలాఫలకాల కోసం, ఫోటోల కోసం వేలకు వేలు తగలేసే మన సోదరులు ఒక సాటి మనిషిని, తోటి మనిషిని ఆదుకోవడానికి పైసా విదల్చరు.

ఆర్థికంగా సుస్థిరంగా వున్న ప్రతి ఒక్కరు తాము మరొక్కరి సుస్థిరతకు పునాది వేయ గలిగితే యీ దేశంలో నిరుద్యోగ సమస్యనేది మచ్చుకు గూడా కన్పించదు.

తమ ఫోటోలను లక్షలాది మంది చూస్తారనే ఆశతో, తమ కీర్తి తరతరాలు శిలాఫలకంపై వుంటుందనే కోర్కెతో, యీ గ్రౌండ్స్‌లో వున్న చాలా మంది నాకు వేలకు వేలు యిచ్చారు. అయితే మీ ఫోటోలను ఎంతో మంది చూస్తారు. కానీ ఏ ఒక్కరి హృదయంలోనూ మీరు వుండరు.

అదే మీరు, ఒకొక్కరు ఒకొక్కరి జీవిత సోపానానికి పునాదిగా నిల్చిన రోజున మీరు ఆ వ్యక్తి హృదయంలో చిరస్థాయిగా నిలచిపోతారు. ఆ వ్యక్తి మీరూపాన్ని తన గుండెలో పెట్టుకొని గుడి కట్టుకొని ఆరాధిస్తాడు. ఆ కుటుంబము తరతరాలు మీ కీర్తిని చాటుకుంటుంది. మీ పేరే తమ గోత్రంగా భావిస్తారు ఆ అభాగ్యులు.

ఏది ఉత్తమమో మీరు ఆలోచించండి.

మీ ఫోటో శిలాఫలకం ప్రక్కన ఒక శిలలాపడి వుండటమా?

కనీసం ఒక హృదయం లోనైనా మీ రూపం చిరస్థాయిగా నిలచి వుండటమా?

మీ గోత్ర నామాదులు నిత్యం గుళ్ళో పఠించడం వలన మీ జన్మ తరించవచ్చు! కానీ మీరు మరొకరి జీవితం నిలబెడితే యిరు జన్మలు తరిస్తాయి. నిజమైన మానవ సేవయే మాధవసేవ!

ఇది.... ఇది మీకు చెప్పడానికే యీ పని చేశాను.

నా పేరు నిరుద్యోగి. ఈ దేశంలో ఆ పేరు గల వాళ్ళు అనేకమంది వున్నారు. నన్ను రూపు మాపుతారో, నా పేరు రూపు మాపు తారో యిక అది మీ యిష్టం.

మీ డబ్బు మొత్తం మీ మీ పేర్లతో డ్రాఫ్ట్సు తీసి వున్నాయి. అవి భద్రంగా మీకు చేరతాయి, శెలవ్." అంటూ పోలీస్ వైపు తిరిగి "ఇక మీ పని కానివ్వండి" అన్నాడు గంభీరంగా.

గ్రౌండ్స్‌లో కనీవిని ఎరుగని సంచలనం!

"నో.... నో.... అతన్ని అరెస్ట్ చేయడానికి వీల్లేదు".

"అతను మా కళ్ళు తెరిపించాడు".

"నిరుద్యోగి జిందాబాద్".

గ్రౌండ్స్ మొత్తం మారుమ్రోగాయి ఆ మాటలు.

నవ చైతన్యం వెల్లి విరిసిందా ప్రదేశంలో.

మళ్ళీ పత్రికలకు మంచి మేత దొరికింది.

పతాక శీర్షికలు..... చర్చలు.... వ్యాఖ్యానాలు.....

మరి ఇకనైనా ఈ సమాజం మారుతుందా......

ఏమో, కాలం నిర్ణయించ వలసిందే! ☐

# కాలితే ఏం చేయాలో మా అమ్మకు బాగా తెలుసు.

## తనకి అమ్మమ్మ నేర్పిందిట.

అబ్బ, అమ్మంటే మా అమ్మలా ఉండాలి. ఎంత బాగా చూసుకుంటుందని! అమ్మ మొన్న నా బుజ్జి బొమ్మ గౌను ఇస్త్రీ చేస్తుంటే పొరబాట్న నేను చెయ్యి పెట్టాను. వేలు కాలింది. గబగబా అమ్మ బర్నాల్ రాసింది. కాలితే అమ్మమ్మ కూడా అలాగే బర్నాల్ రాసేదిట.

నా బుజ్జి పాపా, నీకెప్పుడైనా కాలిందంటే నేనూ బర్నాల్ రాస్తాలే, బాగయిపోతుంది.
కదమ్మా! కదూ బర్నాల్!




# బర్నాల్

ఇంటింటా విశ్వసింపబడినది.

BL 2078

# సినిమా విశేషాలు

-జి.వి.జి.



"సూర్యనేత్రం"లో జయమాలిని

## వి. మధుసూదనరావు, నాగార్జున కాంబినేషన్‌లో అన్నపూర్ణ స్టూడియోస్ "విక్రమ్"

శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పణలో నాగార్జున ప్రతిభా విశేషాలను ప్రేక్షకులకు పరిచయం చేసే తొలి చిత్రానికి "విక్రమ్" అని నామరణం చేశారు. శోభన నాయిక. సపోర్టింగ్ రోల్స్‌లో చంద్రమోహన్, సత్యనారాయణ, సుధాకర్, కాంతారావు, కన్నడ ప్రభాకర్, రాజ్యలక్ష్మి, రమాప్రభ, అన్నపూర్ణ, మాణిక్‌ఇరానీ మున్నగువారున్నారు. సుభాష్‌గై కథకు సత్యానంద్ సంభాషణల కర్త. చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు. ఎ. ఎన్. సుదరం ఛాయ, భాస్కరరాజు శిల్పం, సలీమ్ నృత్యాలు, రాజు సాహసాలు, సింహం ప్రొడక్షన్. అక్కినేని వెంకటరత్నం నిర్మాణ నిర్వహణ, టి. కృష్ణ కూర్పుతో వెంకట్ అక్కినేని సర్వజనరంజకంగా నిర్మిస్తున్న ఈ చిత్రానికి వి.మధుసూదనరావు దర్శకుడు.

## ఆఖరి షెడ్యూల్‌లో జయభేరి ఆర్ట్ ప్రొడక్షన్స్ 9వ చిత్రం

"విచిత్రమైన పరిస్థితుల్లో ఓ గాయకుడు ఒక నేరంలో ఇరుక్కుంటాడు ... ఇలా సెంటిమెంట్‌తో కూడిన క్రయిమ్ చిత్రం అయినా ఫైట్స్ వుండవు. హిందీ హిట్ చిత్రం 'జవాబ్' ఆధారం. నవంబర్ 1 నుంచి 26 వరకు డైలాగ్ భాగం పూర్తి అయింది. నాలుగు పాటలను డిసెంబర్ 1 నుంచి 6 వరకు చిత్రీకరించడంతో షూటింగ్ పూర్తయినట్లే. అన్నారు మురళీమోహన్. ఈయన ప్రధాన పాత్ర నిర్వహిస్తూ, సమర్పించే జయభేరి ఆర్ట్ ప్రొడక్షన్స్ తొమ్మిదవ చిత్రంలో మాధవి నాయిక. రంగనాథ్, గిరిబాబు, రావికొండలరావు, ప్రతిఘటన శ్రీనివాసరావు, కన్నడ ప్రభాకర్, దుర్గ, కొత్త విలన్ జాస్తి బాబ్జీ పాత్రధారులు. గణేష్‌పాత్రో సంభాషణలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, తార నృత్యాలు, సుబ్బారావు ప్రొడక్షన్, డి. రాజగోపాల్ కూర్పు, కిషోర్ నిర్మాణ సారథ్యంతో మాగంటి వెంకటేశ్వరరావు నిర్మించే ఈ చిత్రానికి రాజాచంద్ర దర్శకుడు.

## నవ నాయకా నాయికలతో "గోదావరి పొంగింది"

"అసలు మా చిత్రంలో కథ, సంగీతం హీరో హీరోయిన్లు. పరువు ప్రతిష్ఠలే ప్రధానమనుకునే తండ్రి. తండ్రికి, ప్రేయసికి మధ్య సతమతమయ్యే కొడుకు. ధనాశతో కన్న కూతురినే యజమానికి అప్పగించాలని ప్రయత్నించే నౌకరు. దాన్ని ప్రతిఘటించలేకపోయిన నౌకరు భార్య. ఇలాంటి విచిత్రమైన పాత్రల మధ్య జరిగే సంఘర్షణ. భద్రాచలం, కొత్తగూడెం, పర్ణశాల, పాపికొండలు, జీడిగుప్ప వగైరా ప్రాంతాలలో డిసెంబర్ రెండవ వారం నుంచి షూటింగ్ ఇరవై రోజులపాటు జరుపుతాం. జనవరి 10 నుంచి నరసాపురం, పెనుగొండ, కోనసీమ పరిసరాలలో షూటింగ్‌ను ముగిస్తాం," అన్నారు సగంపట్ల రాజగోపాల్.



"కొండవీటి రాజా"లో రాధ, చిరంజీవి, విజయశాంతి

ఈయన ఎ. వి. ఎం. వగైరా సంస్థలలో గత ఇరవై ఏళ్ళుగా కథ, దర్శకత్వ శాఖల్లో అనుభవం గడించారు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో గోపాల్‌రాజ్ ఫిలిమ్స్ నిర్మించే"గోదావరి పొంగింది" చిత్రానికి కె. వి. మహదేవన్ స్వరకల్పనలో వేటూరి రాసిన ఆరు గీతాలు కర్ణపేయంగా ఉన్నాయి. వీటి కేసెట్లు ముందుగా విడుదలై రసికులకు తన్మయానందాన్ని కలిగిస్తాయి. భవానీబాబు, కీర్తి, విజయగౌరి వగైరా నట వర్గంతో పాటు జగ్గయ్య, కె. విజయ, కృష్ణారావు ఆదిగాగలవారు పాల్గొంటారు. ఎస్. మారుతీరావు ఛాయ, పి. ఎన్. శివం శిల్పం, ఆర్. రామమూర్తి కూర్పు, జి. ఉదయభాస్కర్ - జక్కా రామచంద్రరావు సహకార దర్శకత్వం, ఎన్. గోపాలకృష్ణ సహ దర్శకత్వం నిర్వహిస్తారు.

## "కిరాయి మొగుడు"గా నరేష్

"మేనమామ చేతుల్లో ఇరుక్కుని సతమతమవుతున్న నాయిక స్వప్నను ఆత్మహత్యా ప్రయత్నం నుంచి నిస్వార్థ జీవి అయిన నరేష్ తప్పించి, ఆమె సమస్యలను పరిష్కారం చేస్తానని మాట ఇస్తాడు. దాన్ని నిలబెట్టుకోడానికి తన ప్రాణాలను సైతం ఖాతరు చేయక, దుండగులతో పోరాడి ఆమెను కాపాడతాడు.చిన్నతనంలో దూరమైన తన చెల్లెల్ని అకస్మాత్తుగా కలుసుకుని, ఆమె జీవితాన్ని సరిదిద్దుతాడు. నరేష్ ప్రేయసి స్వప్నగా మనోచిత్ర, చెల్లెలుగా శ్యామలాగౌరి నటించారు. ఈ చిత్రం మలయాళం మాతృక కేరళలో హిట్ అయింది. దాని దర్శకుడు రాజశేఖర్ చేతనే మా చిత్రాన్నీ డైరెక్టు చేయించాం," అన్నారు వాసిరెడ్డి నాగేశ్వరరావు. ఈయన నిర్వహణలో సందీప్ మూవీస్ సమర్పించే వి. ఎస్. ఆర్. పిక్చర్స్ "కిరాయి మొగుడు"లో బాలాజీ, లక్ష్మీకాంత్, ప్రసాద్‌బాబు, డాక్టరు శివప్రసాద్, గోకిన రామారావు, కాంచన, అనూరాధ, జగ్గులు నటించారు. మాటలు: సి. వి. సూర్యం, పాటలు : ఆరుద్ర, రాజశ్రీ, గోపి.సంగీతం: సత్యం, ఛాయ : బి. రామకృష్ణ. శిల్పం : కొండపనేని రామలింగేశ్వరరావు. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: రాజశేఖర్. నిర్మాత : డి. పృథ్వీధరరావు.





"మాతృభూమి" 3డి చిత్రంలో విజయకాంత్, నళిని

## కృష్ణ, శ్రీదేవి నాయకా నాయికలుగా పి. సి. రెడ్డి చిత్రం "ఏరువాక"

"దేశానికి వెన్నెముక అయినటువంటి గ్రామాలలో ఇప్పటికీ ఎన్నో సమస్యలున్నాయి. వాటికి పరిష్కార మార్గాన్ని కొత్త ధోరణిలో చూపే పకడ్బందీ అయిన స్క్రిప్టును తయారుచేశాను.." అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన దర్శకత్వం వహిస్తూ నిర్మించే "ఏరువాక" చిత్రంలో కృష్ణ, శ్రీదేవి నాయకా నాయికలు.

'సింహాసనం'లో

మందాకిని, కృష్ణ

## తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో సాయికృష్ణ ఆర్ట్స్ "రక్త తర్పణం"

"కథా నాయిక తను ఆరాధించే దుర్గాదేవికి అను నిత్యం రక్తాన్ని అర్పిస్తుంది. అందుకే 'రక్త తర్పణం' అని పేరుపెట్టాం. నేను డైరెక్ట్ చేస్తున్న మొదటి హారర్ చిత్రమిది.రిపీట్ ఆడియన్స్ సబ్జెక్ట్‌ను ఆనంద గజపతిరాజు సమకూర్చారు. కీకారణ్యంలోని ఓ పురాతన భవంతిలోనూ, ఆ పరిసరాలలోనూ చిత్ర కథ నడుస్తుంది. ఊటీలో ఔట్‌డోర్ షూటింగ్ మా సాయికృష్ణ ఆర్ట్స్ యూనిట్‌లోని అందరికీ వింత అనుభూతి. విపరీతమైన చలిని సైతం లెక్క చేయకుండా అర్ధరాత్రి దాటాక రెండు గంటలవరకు కూడా షూటింగ్ జరిపాం," అన్నారు తాతినేని ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ప్రముఖ పారిశ్రామికవేత్త, నవయుగ పంపిణీ సంస్థకు అత్యంత ఆత్మీయులు అయిన వి. సుబ్బరాజు సమర్పించే "రక్త తర్పణం" చిత్రంలో చంద్రమోహన్, నరేష్, మనోచిత్ర, తులసి, వేలు, చక్రవర్తి, మిక్కిలినేని, సాక్షి రంగారావు, మోదుకూరి సత్యం, రామరాజ్, కేశవ్, బెనర్జీ, నళినీకాంత్, పొట్టి సత్యం, గణేశ్, శ్రీలక్ష్మి, జయ, అనూరాధ పాల్గొన్నారు. కాశీ విశ్వనాధ్ మాటలు, రాజశ్రీ పాటలు రాశారు. సత్యం సంగీతం, నవకాంత్ ఛాయ, కె. రామలింగేశ్వరరావు శిల్పం, శివశంకర్ నృత్యాలు, గూనా సహ దర్శకత్వం, తాండవకృష్ణ ప్రొడక్షన్. ఎ. నాగేశ్వరరావు - శ్యామ్ సహకార దర్శకత్వంతో రామచంద్రరాజు, సత్యనారాయణరాజు నిర్మాతలు.

## తెలుగు నిర్మాతల హిందీ చిత్రాలు

"మయూరి చిత్రాన్ని హిందీలో సుధాచంద్రన్‌తో నే "నాచే మయూరి"గా అట్లూరి పూర్ణ చంద్రరావు సమర్పణలో రామోజీరావు నిర్మిస్తున్నారు. లక్ష్మికాంత్ ప్యారేలాల్ సంగీతం, గోపీకృష్ణ నృత్యాలతో తాతినేని రామారావు దర్శకుడు.

జితేంద్ర హీరోగా సత్యనారాయణ, సూర్యనారాయణ నిర్మించే సత్యచిత్ర ఇంటర్నేషనల్ వారి హిందీ చిత్రానికి కె. బాపయ్య దర్శకుడు.

"ముగ్గురుమిత్రులు" చిత్రాన్ని డి. వి. ఎస్. రాజు హిందీలో జితేంద్ర (శోభన్‌బాబు), రుషికపూర్ (చంద్రమోహన్), రాజ్‌బబ్బర్ (మురళీమోహన్)లతో తాతినేని రామారావు దర్శకత్వంలో నిర్మిస్తారు.



బాగా చలిగా వుంది – రగ్గు కప్పుకుని డాన్సు చేస్తానంది!



హల్లో విజయవాడ!

"మన్‌హర్" మనసారా మీకు స్వాగతం పలుకుతుంది!
మహత్తరమైన బహుమతులు మీకోసం అందిస్తోంది!!

బంపర్ బహుమతి

**మారుతి కారు**



2-12-1985 నుండి
27-1-1986 వరకు

వీక్లీ బహుమతి



**కలర్ TV**

2-12-1985 నుండి
13-1-1986 వరకు

డైలీ బహుమతులు 5

**సఫారి సూట్స్**

2-12-1985 నుండి
13-1-1986 వరకు

ప్రతి
రు. 200/- బిల్లుకు
ఒక లక్కీ కూపన్

డైలీడ్రా, వీక్లీడ్రాలోని విజేతలు కూడా బంపర్ డ్రాలో
అర్హులు కనుక మీ కూపన్ భద్రపరచండి!

ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటి
గ్వాలియర్ ప్రెస్టేజియస్ షోరూమ్

GWALIOR SUITING GR

# మన్‌హర్

బీసెంట్ రోడ్,
విజయవాడ-2
ఫోన్: 77810



"ఆలాపన"లో వై. విజయ, మోహన్



"మా వారి గోల"లో నరేష్, సుత్తి వేలు, వాణి

## ఎ. వి. ఎం. చిత్రాలు "నాగదేవత, బంధం"

పోస్టర్‌లలో పాత్రధారుల ఫోటోలు కాక "ఎ. వి. ఎం. ప్రొడక్షన్స్" అనే ఆంగ్ల అక్షరాలు మాత్రం వేసి తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ, హిందీ భాషల్లో ఎన్నో చిత్రాలను విజయవంతం చేసిన ఘనత స్వర్గీయ ఎ. వి. ఎం. చెట్టియార్‌గారిది. వీరి తొలి తెలుగు చిత్రం "జీవితం". వీరి అడుగుజాడల్లోనే వీరి పుత్రుడు ఎ. వి. ఎం. కుమరన్, పౌత్రుడు షణ్ముగం అన్ని తరగతుల ప్రేక్షకులను ఆకర్షించే చిత్రాలను తీస్తున్నారు. వీరి "నాగదేవత" చిత్రం త్వరలో విడుదలవబోతోంది. దీని మాతృక "నంద్రి" అనే తమిళ చిత్రం తమిళనాడులో అఖండ విజయాన్ని సాధించింది. దీని దర్శకుడు రామ్‌నారాయణ్ మినిమమ్ గారంటీ డైరెక్టర్‌గా పేరుకెక్కారు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలోనే తెలుగు చిత్రం కూడా తయారైంది. ఇందులో "నాగబాల"గా రజని, ఆమె సరసన అర్జున్, "నాగదేవత"ను ఆరాధించే యువతిగా విజయశాంతి, ఆమె భర్తగా రంగనాథ్, ఇంకా హరిబాబు, సునీత, బేబీ ప్రియ నటించారు. ఓ కుక్క, ఓ పాము కూడా కథను నడపడం మరో విశేషం. ఆకెళ్ల సంభాషణలు, చక్రవర్తి సంగీతం, ఎన్. కె. విశ్వనాథ్ ఛాయ, గౌతమన్ కూర్పు తెర వెనుక హంగులు.

ఈ సంస్థ తదుపరి చిత్రం "బంధం"లో తండ్రికొడుకులుగా శోభన్‌బాబు ద్విపాత్రాభినయం, బేబీ శాలిని అద్భుతమైన నటన వీక్షకులను విపరీతంగా ఆకట్టుకుంటాయని డైరెక్టరు రాజాచంద్ర తెలిపారు. ఇందులో రాధిక నాయిక. ఇంకా నూతన్ ప్రసాద్, శ్రీధర్, సుదర్శన్, అనూరాధ తక్కిన పాత్రలు నిర్వహించారు. తుది మెరుగులు దిద్దుకుంటూన్న ఉమా ప్రొడక్షన్స్ సమర్పించే ఈ చిత్రానికి ఘాసల మాటలు, చక్రవర్తి సంగీతం, డి. డి. ప్రసాద్ ఛాయ, నాగరాజారావు శిల్పం, తార నృత్యాలు, రాజగోపాల్ కూర్పు నిర్వహించారు

## సినిమా



"కిరాయి మొగుడు" శ్యామలగౌరి



"నాలుగిళ్ళ చావిడి"లో వేలు, చంద్రమోహన్



"తులసి దళం"లో ఒక దృశ్యం

"ఉక్కు మనిషి" కృష్ణంరాజు, రాధిక



# సినిమా

## త్వరలో "నాలుగిళ్ళ చావిడి" విడుదల

"మనదేశంలో సగటు మనిషికి ఓ అద్దె కొంప దొరకడం గగనమైపోయింది. ఈ సమస్యకు కులమతాల మూఢనమ్మకాల సమస్యను జోడించి డైరెక్టర్ వేజెళ్ళ సత్యనారాయణ రసవత్తరమైన చిత్ర కథను తయారుచేశారు. దాదాపు ఇరవై ఏళ్ళుగా'నాలుగిళ్ళ చావిడి' నాటకాన్ని రచయిత రావికొండలరావు ట్రూప్‌తో పాటు మన రాష్ట్రంలోని అన్ని సమాజాల వారు ప్రదర్శించి ప్రశంసలందుకున్నారు. అంచేత, ఈ సినిమా కూడా అన్ని వర్గాల ప్రేక్షకుల ఆదరణను పొంది తీరుతుంది," అన్నారు లక్ష్మిజ్యోతి ప్రొడక్షన్స్ అధినేత ఆర్. ఎస్. రాజు. ఈ చిత్రంలో చంద్రమోహన్, సాయిచంద్, రాజ్యలక్ష్మి, దేవిశ్రీ, మమత, సాక్షి రంగారావు, వేలు, వీరభద్రరావు, రావికొండలరావు, రాధాకుమారి ఆదిగాగలవారు పాల్గొన్నారు. కృష్ణ-చక్ర సంగీతం, ఆర్. కె. రాజు ఛాయతో విజయప్రసాద్ నిర్మాణ సారథి.

## "బేతాబ్" తెలుగు పరివర్తనంలో రమేష్ దర్శకత్వంలో బాలకృష్ణ

"మా బాలయ్యకు ఛాలెంజింగ్ రోల్," అన్నారు నందమూరి రమేష్. ఈయన దర్శకత్వంలో హిందీ హిట్ చిత్రం "బేతాబ్" ఆధారంగా వనితా ఆర్ట్స్ అధినేత ఎన్. భాస్కర్ నిర్మించే చిత్రానికి సత్యానంద్ మాటలు, చక్రవర్తి సంగీతం, నందమూరి మోహనకృష్ణ ఛాయ, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో సి. హెచ్. సత్యనారాయణ సహ నిర్మాత. సమర్పణ : కంటిపూడి.

## ఎస్. ఎ. చంద్రశేఖర్ దర్శకత్వంలో సంతోష్ ఆర్ట్ మూవీస్ చిత్రం

"జనవరిలో సాంగ్స్ రికార్డ్ చేసి, ఫిబ్రవరిలో షూటింగ్ ప్రారంభిస్తాం," అన్నారు పోతరాజు. ఈయన "బలిదానం, దానవుడు" అనంతరం సమర్పించే మూడవ చిత్రంలో రామకృష్ణ హెగ్డే హీరో. ఎ. రాజేంద్రప్రసాద్ నిర్మాణ సారథి. ఎ. శ్రీనివాసరాజు, ఎ. లక్ష్మణరావు నిర్మాతలు, ఎస్. ఎ. చంద్రశేఖర్ దర్శకుడు. □




# కానీ వైశ్యాబ్యాంకులో పొదుపు చెయ్యడం నా అతి ముఖ్య ధ్యేయం

ఎందుకో తెలుసా ? మా నాన్న వైశ్యాబ్యాంకులో పొదుపు చేసే రొఖ్ఖం నా పైచదువులకు ఉపయోగిస్తుంది. అందుకే...

మీ పిల్లల చదువులకి, వారికి ఒక బంగారు భవిష్యత్తును కల్పించడానికి, నేడే మా బాలవికాస్ విద్యానిధి డిపాజిట్ పథకంలో పొదుపు చెయ్యండి.

మీ పొదుపు విద్యానిధి పథకంలో ఎలా అభివృద్ధి చెందుతుందో మీరే చూడండి.

| నెలసరి డిపాజిట్ రూ | డిపాజిట్ కాలం | పొదుపు చేసిన మొత్తం రూ. | 122వ నెలనుండి మేమిచ్చే నెలసరి మొత్తం రూ. | మేము ఇచ్చే కాలం |
|---|---|---|---|---|
| 27.16 | 120 నెలలు | 3,259 20 | 100/- | 84 నెలలు. |

ప్రజా సేవలో 50 సంవత్సరాలకు పైగా అనుభవమున్న వైశ్యాబ్యాంకు, మీ ప్రతీ అవసరానికి తగిన, అనువైన పథకాలను రూపొందించింది.
వివరాలకు మీ దగ్గరలో యున్న మా బ్రాంచిని సంప్రదించండి.


రండి, కలిసి అభివృద్ధి సాధిద్దాం



**ది వైశ్యా బ్యాంక్ లిమిటెడ్**

రిజిష్టర్డ్ ఆఫీసు
అవెన్యూరోడ్, బెంగుళూరు 560 002
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు
72 సెయింట్ మార్క్సరోడ్, బెంగుళూరు 560 001
ఛైర్మన్ రమేశ్‌గెల్లి

సీరియల్

# నీడలు-నిజాలు

విన్నకోట సుశీలాదేవి

(గత సంచిక తరువాయి)

మర్నాడు వుదయం ప్రసాద్ వచ్చి – సాయంత్రం అయిదు గంటలకు అప్సరా హోటల్లో పార్టీ అని చెప్పి వెళ్ళాడు.

రవి సాయంత్రం అయిదు గంటల నుండే శారదని తొందర చేస్తున్నాడు.

"నీ కోసం ఏర్పాటు చేసిన పార్టీ కదా! నువు వచ్చేవరకూ ఆగుతారులే బావా!" అంది నవ్వుతూ.

"అదే నా బాధ. నా పార్టీకి నేను ఆలస్యంగా వెడితే ఏం బాగుంటుంది? వాళ్ళందరూ నా కోసం ఎదురు చూస్తుంటారు! వాళ్ళని ఇబ్బంది పెట్టడం బాగుండదు." అన్నాడు రవి.

స్నేహితులంటే ఎంత ప్రేమ వచ్చింది. బావకి ఏదొచ్చినా విపరీతమే అనుకుంది.

శారదా – రవి సరిగ్గా అయిదు గంటల కల్లా బయలుదేరి పావుగంటలో అప్సరా హోటల్ ముందు కారు దిగారు. గేటు దగ్గరే నిలబడి ఎదురు చూస్తున్న ఫ్రెండ్సు రవిని ఆహ్వానించి లోపలకు తీసుకెళ్ళారు.

రంగురంగుల కాగితాలతో – బల్బులతో –బెలూన్స్‌తో హాలు అలంకరించబడి వుంది.

రవి హాల్లోకి అడుగు పెట్టగానే–

"రవి జిందాబాద్" అని అరుస్తూ – లయబద్ధంగా చప్పట్లు కొట్టసాగారు.

రవి చిరునవ్వుతో అందరినీ పలకరిస్తూ లోపలికొచ్చాడు. శారద రవి వెనకాలే వచ్చింది.

ప్రసాద్ రవి చెయ్యి పట్టుకుని హాలు మధ్యలోకి లాక్కుపోయి అక్కడున్న కుర్చీలో కూర్చోబెట్టాడు. అతని చుట్టూ స్నేహితులందరూ చేరారు.

శారదకి – తనెక్కడ కూర్చోవాలో తెలీక క్షణకాలం చుట్టూ చూసింది.

జరిగిన కథ-4 : రవికి, శారదకి పెళ్ళి చేయాలనుకుంటారు పెద్దలు. రవి దుడుకుతనంవల్ల కాగేకాగే నూనె శారద ముఖంపై, చేతులపై చింది ఆమె శరీరం అంద వికార మయిపోతుంది. అయినా రవికి శారదపై ప్రేమ తగ్గలేదు. రవి యూనివర్సిటీలో ఎం.కామ్.లో చేరుతాడు. అక్కడ జరిగిన ఒక సంఘటన అతని జీవితాన్ని ఒక కొత్త మలుపు తిప్పింది. రవికి సునీత పరిచయం అయ్యింది. అతను శారదను వివాహం చేసుకోనని ఇంట్లో చెప్పేస్తాడు– మేనకోడల్ని చూచిన లక్ష్మీదేవికి ప్రాణం లేచి వచ్చినట్లయింది. రవికి ఈ ఏక్సిడెంట్‌వల్ల కంటిచూపు పోయింది. అతను పూర్తి ఆరోగ్యవంతుడయిన తరువాత ఆపరేషన్ చేస్తే చూపువచ్చే అవకాశం ఉందని డాక్టరు చెపుతాడు. రవికి శారద సేవలు చేయడం మొదలుపెట్టింది. మళ్ళీ వాళ్ళిద్దరు దగ్గరయ్యారు. రవికి ఆపరేషన్ చేస్తే చూపువచ్చింది. అందరికీ చెప్పలేని ఆనందమయింది. రవి యూనివర్సిటీలో మిత్రులువచ్చి అతనిని యూనియన్ ప్రెసిడెంటుగా పోటీ చేయమని బలవంతం చేస్తారు. రవి అంగికరిస్తాడు.

అందరూ టేబుల్స్ చుట్టూ వున్న కుర్చీల్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. తనని పట్టించుకునే వాళ్ళే లేరు. ఇక చేసేది లేక తనే నెమ్మదిగా ఒక మూలగా వున్న ఖాళీ బల్ల దగ్గరికి నడిచి దాని ముందున్న కుర్చీలో కూర్చుంది.

రవి దగ్గరకు ఒక్కొక్కరే వచ్చి – అతడిని పలకరించి వెడుతున్నారు.

అందరూ కూర్చున్నాక – ప్రసాద్ లేచి చిన్న వుపన్యాసం ఇచ్చాడు.

"డియర్ ఫ్రెండ్స్, ఈ పార్టీ ఎందుకు ఏర్పాటు చేశామో మీకందరికీ తెలిసే వుంటుంది. మన స్నేహితుడు రవికి తిరిగి కళ్ళు వచ్చాయి. అదొక విశేషం. అంతేకాదు –రవి ఈసారి యూనియన్ ఎలక్షన్లలో పోటీ చేస్తున్నాడు. మీరందరూ అతడిని గెలిపించాలి. రవి ఆరోగ్యాన్ని, విజయాన్ని కోరుతూ –"

అంటూ తన ప్లేటులోని స్వీటు తీసి రవి నోటికి అందించాడు. అందరూ చప్పట్లు కొట్టారు.

"ఇక మీరందరూ పార్టీ ప్రారంభించండి" అని ప్రసాద్ కూర్చున్నాడు.

అందరూ కబుర్లు చెప్పుకుంటూ ప్లేట్లు ఖాళీ చేస్తున్నారు.

ఇంతలో –

"హల్లో మిస్టర్ రవీ" అన్న మాట విని అందరూ తల తిప్పి చూశారు.

నీలిరంగు దుస్తుల్లో – ముత్యాల నగలతో – అపర రతీదేవిలా మెరిసిపోతున్న సునీత కన్పించింది. అందరి కళ్ళూ ఒక్కసారి తళుక్కుమంటూ మెరిశాయి.

ప్రసాద్ చటుక్కున లేచి–

"రండి! రండి! మీ కోసమే ఎదురు చూస్తున్నాం" అంటూ ఆహ్వానించాడు.

సునీత సరాసరి రవి దగ్గరకొచ్చింది.

"రవీ! ఎలా వున్నావు?" అనడిగింది. రవి తలెత్తకుండానే "బాగానే వున్నాను" అన్నాడు పొడిగా.

సునీత అతడి వేపొకసారి చూసి – అక్కడి నుండి కదిలి లేడీ స్టూడెంట్స్ వున్న టేబిల్ దగ్గరకు వెళ్ళింది.

"ఏరా! సునీతని సరిగ్గా పలకరించలేదే?" ప్రసాద్ రవిని అడిగాడు.

రవి మాట్లాడలేదు.

ప్రసాద్ ఇక తర్కించలేదు. అందరూ తమ ప్రక్కనున్న స్నేహితులతో కబుర్లు చెప్పుకుంటున్నారు. నవ్వుకుంటున్నారు.

శారద ఒక్కతె వెలివేసినట్లు ఒంటరిగా కూర్చుంది. తన పార్టీకి రాకుండా వున్నా బాగుండేది అనుకుంటోంది.

"ఎవరే ఆ అమ్మాయి"

శారద ప్రక్క టేబిల్ దగ్గర కూర్చున్న ఒక అమ్మాయి అడుగుతోంది.

"రవి బంధువేమో"

"ఛ! ఈ అనాకారి – నల్లపిల్ల – రవి బంధువా? బహుశ పనమ్మాయి అయివుంటుంది" తేల్చి చెప్పింది.

"పనిపిల్ల అయినా మనకన్నా బాగా టాయిలెట్ అయిందే."

అదేదో జోక్ అయినట్లు మిగతా వాళ్ళు పగలబడి నవ్వారు!

ఆ మాటలు వింటున్న శారద మనస్సు మండిపోయింది. వాళ్ల చదువూ – సంస్కారం ఇంతేనా! సాటి ఆడపిల్లని హేళన చేసి నవ్వులపాలు చెయ్యడమేనా సభ్యత.... పైపై అందం వుంటే చాలదు. మనస్సు కూడా అందంగా వుండాలి. శారదకి అక్కడి నుండి వెళ్ళిపోవాలన్పించింది. కాని రవి ఏమైనా అనుకుంటాడేమోనని ముళ్ళ మీద కూర్చున్నట్లు కూర్చుంది.

పార్టీ ముగిసింది. ఆ తర్వాత ప్రసాద్ ఆడవాళ్ళ దగ్గరకు వెళ్ళి వాళ్ళని పాడమని అడిగాడు. వాళ్ళు పది నిముషాలు బ్రతిమిలాడించుకుని – కీచుగొంతుతో – అపశ్రుతులతో పాడి – అందరికీ తిన్న టిఫిను వాంతి అయ్యేట్లు చేశారు.

పాట అవగానే మర్యాద కోసం అందరూ –

చాలా బాగుందంటూ చప్పట్లు కొట్టారు. ఆ తర్వాత ఒక స్టూడెంటు రెండు హిందీ పాటలు పాడాడు. రవి తనని పాడమంటాడేమోనని ఎదురు చూసింది శారద. కాని రవి శారదని అడగలేదు. శారదకి కొద్దిగా నిరాశ కలిగినా తను అందరిలో పాడటం అతని కిష్టం లేదేమో. తన పాట అతనొక్కడే వినాలనే

అభిప్రాయమేమో! అనుకుని తృప్తి పడింది.

పార్టీ ముగిసింది.

అందరూ లేచి రవి దగ్గర శెలవు తీసుకుని వెళ్ళిపోతున్నారు. చివరగా సునీత రవి దగ్గరి కొచ్చింది.

"ఎందుకో చిరాగ్గా వున్నట్లున్నారు రవిగారు. రేపు తీరుబడిగా మాట్లాడదాం!" అంటూ సమ్మోహనకరంగా నవ్వింది.

ఆ నవ్వు చూసేసరికి క్షణకాలం గుండె లయతప్పినట్లయింది రవికి.

"ఇక వెళ్ళొస్తాను" అంటూ వెళ్ళిపోయింది సునీత! రవి సునీత వెళ్ళిన వేపే చూస్తూ వుండిపోయాడు.

"ఇక మనం కూడా వెడదామా!" ప్రసాద్ మాటలకు రవి వులిక్కిపడి–

"ఆఁ.... అలాగే! పద" అన్నాడు.

శారద, రవి కారెక్కారు రవి ఇంటికి రాగానే సరాసరి మేడమిదికి వెళ్ళిపోయాడు.

శారద బట్టలు మార్చుకుని రవి దగ్గరకు వచ్చింది! రవి బూట్లు కూడా విప్పకుండా మంచం మీద పడుకున్నాడు.

"బావా! అలా వున్నావే?" అనడిగింది శారద.

"ఏంలేదు! కొద్దిగా తలనొప్పిగా వుంది

ఆ మాటకి శారద కంగారు పడింది.

"ఎందుకని బావా! డాక్టరుకి ఫోను చెయ్యనా?"

"ఏంవద్దు శారదా! కాస్సేపు పడుకుంటే అదే తగ్గుతుంది!"

శారద రవి బూట్లు వూడదీసింది.

"బావా! ముందు ఆ డ్రెస్ మార్చుకో! వేడిగా ఏదైనా తెచ్చి పెట్టనా?"

"ఏం వద్దు శారదా!" అన్నాడు కళ్ళు తెరవకుండానే.

రవి ఇక ఏం మాట్లాడక పోయేసరికి శారద క్రిందకు వచ్చి తన గదిలోకి వెళ్ళింది

ఆ రాత్రి – కళ్ళు మూసుకోబోతుండగా శారదకి అన్పించింది. .. "రవి తనని వాళ్ళ స్నేహితులకు పరిచయం చెయ్యలేదు. ఎందుకనో?"

ఆ ఆలోచన శారదకి నిద్రపట్టనియకుండా చేసింది!

★ ★ ★ ★ ★ ★

మర్నాడు రవి యూనివర్సిటీకి వెళ్ళాడు.

సునీత గేటు దగ్గరే కనబడింది. రవిని చూసి విష్ చేసింది.



# నీడలు - నిజాలు

"గుడ్‌మార్నింగ్ అని రవి లోపలికెళ్ళి స్కూటర్ పార్క్ చేశాడు.

సునీత రవి దగ్గరికొచ్చి, "రవీ! అలా క్యాంటిన్ వేపు వెడదాం రాకూడదూ!" అంది.

"నాకు క్లాసుంది!" అంటూ తప్పించుకో బోయాడు

**కానీ** సునీత వదల్లేదు.

"రవీ! ప్లీజ్! ఒక్క అయిదు నిముషాలు చాలు!" అనేసరికి కొద్దిగా తగ్గాడు.

అందమైన ఆడపిల్ల "ప్లీజ్" అంటే కాదనలేక పోయాడు.

"సరే! పద!"

సునీత సంతోషంతో "థాంక్యూ" అంటూ ముందుకు నడిచింది. రవి అనుసరించాడు.

ఇద్దరూ క్యాంటిన్ వెనక వున్న ఒక చెట్టు క్రింద కూర్చున్నారు.

"రవీ! నాతో అస్సలు మాట్లాడటం లేదే! నేనంటే కోపమా?" చిన్న పిల్లలా బేలగా అడిగింది సునీత!

రవి ముఖం కఠినమైంది.

"నీమీద కోపగించుకునేందుకు నేనెవడిని! నీకూ– నాకూ ఏమిటి సంబంధం?" తీవ్రంగా అన్నాడు.

"రవీ! అలా అనకు ప్లీజ్! నువ్వంటే నాకెంత ఇష్టమో నీకు తెలీదు!" సునీత కంఠం వణికింది. నల్లటి కలువరేకు మీద ముత్యంలా– ఆమె నల్లని కళ్ళల్లో చిన్న నీటి బొట్టు.

రవి చలించాడు.

సునీత వేపు చూశాడు.

ఆమె ముఖం నీరెండలో మెరిసిపోతున్న ఎర్ర గులాబీలా వుంది. ముందుకు జారిపడే జుట్టుని ముని వేళ్ళతో పైకి తోసుకుంటోంది. ఆ భంగిమలో సునీత ఎంతో అందంగా కనిపించింది.

సునీత మీద ఇక కోపగించుకోలేక పోయాడు. అందమైన ఆ ముఖం చూస్తున్న కొద్దీ అతని కోపం వెలుగు రేఖలు సోకిన చీకటిలా కరిగి పోతోంది!

"రవీ! నీకోపం ఎలా పోతుంది! నేనేం చెయ్యాలి?" దీనంగా అడిగింది.

రవి పూర్తిగా కరిగిపోయాడు.

"ఛ! నీమీద నాకేం కోపం లేదు సునీ!"

"నిజంగానా?"

"ఆఁ! నువు నన్ను చూడటానికి రాలేదని కొద్దిగా కోపం వచ్చింది అంతే!"

రవి మాటలకు సునీత నవ్వేస్తూ –

"ఓ! అదా! రవీ! నిన్ను చూడటానికి రావాలని ప్రతిరోజూ, ప్రతిక్షణం అనుకునేదాన్ని– కానీ ఎందుకు రాలేదో తెలుసా! నవ్వుతూ– నవ్విస్తూ తిరిగే నా రవి అలా మంచంలో పడుకుని వుంటే నేను చూసి భరించలేను నా గుండె ఆగిపోతుంది అందుకే రాలేదు! నీ ఆరోగ్యం కోసం రోజూ ఆ దేవుడిని ప్రార్థిస్తుండేదాన్ని!" అంది.




ఆ మాటతో రవికి సునీత మీద ఏమూలనో కొద్దిగా వున్న కోపం పూర్తిగా తుడిచి పెట్టుకు పోయింది. ప్రేమ తిరిగి మొలకెత్తింది. సునీత ప్రేమని శంకించి ఆమెని అవమానించి నందుకు పశ్చాత్తాపం కలిగింది!

"నేను రాలేదని బాధపడ్డావా రవీ!"

"అవును సునీ! నువు వచ్చి నా ప్రక్కన కూర్చుంటే నాకు ఎంత ధైర్యం వస్తుందో తెలుసా! నా బాధలన్నీ మరిచిపోతాను!"

"అలాగా రవీ! నాకు తెలీదు!" అంది సునీత నొచ్చుకుంటూ.

"పోనీ సునీ! ఈ మాటు నీకు ఛాన్సు ఇస్తాలే" అన్నాడు నవ్వుతూ.

"ఏం మాటలవి రవీ!" నొచ్చుకుంది సునీత!

"వూరికే అన్నానులే!"

"రవీ! నిన్న పార్టీలో నువ్వు నాతో మాట్లాడక పోయేసరికి రాత్రి నా కసలు నిద్ర పట్టలేదు."

"నాకూ నిద్ర పట్టలేదు!" అన్నాడు సునీత కళ్ళల్లోకి చూస్తూ.

"ఎందుకని?" అమాయకంగా అడిగింది!

"బ్లూ డ్రెస్‌లో బ్యూటీ క్వీన్‌లా మెరిసిపోతూ నా మతి పోగొట్టావు. కళ్ళు మూసుకున్నా– తెరిచినా నువ్వే– ఇంకెలా నిద్రపడుతుంది?" అన్నాడు నవ్వుతూ!

సునీత సిగ్గుపడింది!

ఎరుపెక్కిన సునీత చెక్కిళ్ళను చూస్తూ మైమరచి పోయాడు రవి.

"రవీ! సాయంత్రం పిక్చర్ కెడదామా? మనిద్దరం కలసి వెళ్ళి ఎంతో కాలమైంది!"

"ఓ. కె." రవి హుషారుగా అన్నాడు

"ఇక పద పోదాం!"

ఇద్దరూ డిపార్ట్‌మెంటు వేపు నడిచారు.

★ ★ ★ ★ ★ ★

"బావ మళ్ళా మారిపోతున్నాడు" అనుకోసాగింది శారద దిగులుగా.

సాయంత్రం ఆరు గంటల వేళ –

శారద సన్నజాజి పందిరి క్రింద కేన్ ఛెయిర్ వేసుకుని కూర్చుంది. ఒళ్ళో పుస్తకం వుందిగానీ శారద చూపులు ఎక్కడో వున్నాయి.

ప్రపంచాన్ని చీకట్లు ఆవరిస్తున్నాయి. శారద మనస్సు కూడా అంధకార బంధురమవుతోంది.

"బావ మారి పోతున్నాడు!"

ఆ మాటలు అనుకుంటుంటే– బాధతో గుండెలు బ్రద్దలవుతున్నట్లనిపించింది దుఃఖం పొంగుకు వస్తోంది.

ఇప్పుడు బావ క్షణం కూడా ఇంట్లో వుండటం లేదు. స్నేహితులు– షికార్లు – పార్టీలు– సినిమాలు ... వీటితో తీరిక లేకుండా తిరుగుతున్నాడు.

తనతో మాట్లాడం లేదు. తనని తప్పించుకు తిరుగుతున్నాడు.

"శారదా! నాకు కళ్ళు వచ్చాక మనిద్దరం వూళ్ళు తిరిగొద్దాం" అన్నాడు ఒకప్పుడు.

కానీ ఇప్పుడు కలిసి సినిమాకు కూడా వెళ్ళడం లేదు. ఒకప్పుడు తన పాటని ఎంతో మెచ్చుకుని–– ఎన్ని పాటలు పాడించుకుని వినేవాడు! కానీ ఈ రోజు తను పాడతానన్నా ఏదో సాకు చెప్పి తప్పించుకుంటున్నాడు.

"ఎందుకిలా మారాడు! ఈ మార్పుకు కారణం ఏమిటి?"

ఇంతలో గేటు దగ్గర కారు ఆగిన చప్పుడు విని– చటుక్కున లేచింది.

కారులో నుండి రవి– మరియొక అమ్మాయి దిగారు.

"రా సునీ" రవి ఆ అమ్మాయి చేతిని పట్టుకున్నాడు. ఇద్దరూ లోపలికి వస్తున్నారు.

# మీరు రిఫ్రిజిరేటర్ కొనాలనుకున్నప్పుడు దేనిగురించో ఆలోచిస్తారెందుకు... ఆల్విన్ కావాలని అడగండి.



మీరు రిఫ్రిజిరేటర్ మీద డబ్బును పెట్టుబడి పెడితే అది నిజంగా ఒక మంచి ఆదాయ మార్గమే. ఏ విధంగానంటే ప్రతిరోజూ మార్కెట్‌కెళ్ళి రావడానికి అయ్యే ఖర్చు ఆదా చెయ్యవచ్చు. ధరలు తగ్గినప్పుడు కొని, నిల్వ చేసుకోవచ్చును. ఇంటిలో తయారు చేసుకొనే ఐస్‌క్రీంలు, పిండివంటలు, మాంసం లేదా కూరగాయలతో చేసుకొనే భక్ష్యాలు ఎంతో చౌక. అంతేకాదు వండిన ఆ పదార్థాలను రిఫ్రిజిరేటర్‌లో పరిశుభ్రంగా నిల్వ చేసుకోవచ్చు.

ఖర్చు తగ్గించే పెట్టుబడి పెట్టేందుకు జాగ్రత్తగా ఈ క్రింది అంశాలను పరిశీలించండి

**కంప్రెసర్**

''ఆల్విన్'' ఒక్కదానికే హిటాచి రూపొందించిన కంప్రెసర్ అందదండలు వున్నాయి. అది 170-250 వోల్టుల మధ్య పనిచేస్తుంది. అందువలనే వోల్టేజి స్టెబిలైజర్ ఖర్చును ఆదా చేస్తుంది.



**ఫ్రీజర్**

మా రోల్‌బాండ్ ఫ్రీజర్‌గల ఆల్విన్ రిఫ్రిజిరేటర్ సాటిలేనిది. అతి తక్కువ సమయంలో ఐస్ తయారవుతుంది.

**ఆటో డిఫ్రాస్టింగ్**

మీట నొక్కితే చాలు పేరుకొన్న మంచును కరిగించి, నీటిని తీసివేస్తుంది.

**గ్యారంటీ.**

ముద్రించిన అంశాలను జాగ్రత్తగా పరిశీలించడం, డీలర్‌ను అడగడం... ఆల్విన్ అయితే ఈ చింతే లేదు. మీకు 7 సంవత్సరాల గ్యారంటీ. అది మీకు అన్ని రీతుల్లో ఆదా కలిగిస్తుంది.

**ఆల్విన్**

2000 ఎస్ ఎల్ రిఫ్రిజిరేటర్లు




**హిటాచి** వారి నుండి లైసెన్సు పొందబడినది

*అన్ని సమయాలకు ఆల్విన్*

MAA(S) ALN 17 85

# నీడలు - నిజాలు

శారద ఆ అమ్మాయిని చూసింది. ఈ అమ్మాయి సునీత- ఆనాడు పార్టీలో ఈ అమ్మాయి వేపు అందరూ వెర్రెత్తినట్లు చూశారు.

ఇద్దరూ ఒకరి మీద ఒకరు వాలిపోతూ- నవ్వుకుంటూ లోపలికెడుతున్నారు. శారద ఆ దృశ్యాన్ని చూడలేక పోయింది. బావకు ఇంత సన్నిహితంగా వున్న ఈ అమ్మాయి ఎవరో ! బావ గర్ల్ ఫ్రెండా! ఈమె స్నేహంలో పడి బావ తనని నిర్లక్ష్యం చేస్తున్నాడు. ఈమె అందగత్తె.... తను నల్లమచ్చలతో అసహ్యంగా వుంటుంది..... కళ్ళు లేనప్పుడు తన అవసరం... కళ్ళొచ్చాక అందగత్తె అవసరం.....

ఆలోచిస్తున్న కొద్దీ శారద మనస్సు భగభగ మండిపోసాగింది.

ఇక నిలబడలేక- ఇంట్లోకి వచ్చింది. హాల్లో- రవి ఆ అమ్మాయిని లక్ష్మీదేవికి పరిచయం చేస్తున్నాడు.

"అమ్మా! ఈ అమ్మాయి సునీత! నా ఫ్రెండ్" లక్ష్మీదేవి సునీత వేపు ఒకసారి చూసి తలతిప్పుకుంది.

"రా! సునీ! నారూమ్ చూపిస్తా"

సునీతని చెయ్యి పుచ్చుకుని మేడమీదికి తీసుకెడుతున్నాడు.

అలా వెడుతున్న రవి వేపు లక్ష్మీదేవి ఆశ్చర్యంగా, శారద కోపంగా చూశారు.

శారద లక్ష్మీదేవి వేపు చూడలేక- తలొంచుకుని తన గదిలోకి గబగబా వెళ్ళిపోయింది.

అరగంట తర్వాత - సునీత రవి గదిలోనుండి బయటకు వచ్చింది. వాళ్ళిద్దరి నవ్వులతో ఇల్లు మారు మ్రోగిపోతోంది.

"రవీ! నేను వెడుతున్నా" అంది హ్యాండ్‌బ్యాగ్ వూపుకుంటూ.

"వెళ్ళు! వెళ్ళు! త్వరలో నే- శాశ్వతంగా నా కౌగిట్లోనే వుండే ఏర్పాట్లు చేస్తాను!" అన్నాడు

రవి మాటలు శారదకి స్పష్టంగా వినబడుతున్నాయి. "వుండు సునీ! నిన్ను డ్రాప్ చేస్తాను", అన్నాడు రవి.

"వద్దులే! నేను వెళ్ళిపోగలను"!

"ఇంకా నయంలే! పోనీ మా డ్రైవర్‌ని పంపుతానుండు" రవి డ్రైవర్‌ని పిలిచి సునీతని జాగ్రత్తగా ఇంటి దగ్గర దిగబెట్టి రమ్మని పంపాడు.

తిరిగి- లోపలికొచ్చాడు రవి.

మేడపైకి వెళ్ళబోతుండగా - లక్ష్మీదేవి-

"రవీ" అంటూ పిలిచింది.

రవి వెనక్కి తిరిగి "ఏమిటమ్మా" అన్నాడు.

"ఇలారా! ఒకసారి".

రవి వచ్చి నిలబడ్డాడు.

"రవీ! ఆ అమ్మాయి ఎవర్రా" అనడిగింది.

రవి తల్లి ప్రక్కన కూర్చున్నాడు.

"ఆ అమ్మాయి సునీత! నా క్లాస్‌మేట్, వాళ్ళ ఫాదర్ ఈ వూళ్ళోని ఒక పెద్ద బిజినెస్ మాగ్నెట్!"

"అయితే కావచ్చు. నువ్వా అమ్మాయితో అంత చనువుగా వుండటం నాకేం బాగాలేదు."

"అమ్మా! ఆ అమ్మాయిని నేను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను!" అన్నాడు ఎంతో మామూలుగా.

"రవీ" లక్ష్మీదేవి బిగ్గరగా అరిచింది.

అవునమ్మా! వీలైనంత త్వరలో మా పెళ్ళి జరగాలి! ఆ అమ్మాయిని విడిచి ఒక్కక్షణం కూడా వుండలేను! నాన్న గారితోనూ, నీతోనూ ఈ విషయం గూర్చి మాట్లాడాలనుకుంటున్నాను."

లక్ష్మీదేవిలో కోపం కట్టలు తెంచుకుంది. రవి కనుక చిన్న పిల్లాడైతే ఈ చెంపా- ఆ చెంపా వాయించేది.

"రవీ! నువ్వేం మాట్లాడుతున్నావో తెలుస్తోందా?"

"నేను పెళ్ళి చేసుకోవాలనుకోడం తప్పా అమ్మా!" అమాయకంగా అన్నాడు.

"పెళ్ళి చేసుకోనడం తప్పు కాదురా! కానీ శారదని కాదని సునీతని చేసుకోవాలనుకోవడమే ఘోరమైన తప్పు!"

క్షణకాలం రవి మాట్లాడ లేదు.

ఆ తర్వాత మెల్లగా అన్నాడు-

"అమ్మా! నేను శారదని చేసుకోలేను! శారద నా భార్య అని చెప్పుకోవడం నా కవమానం! నాకు అందమైన భార్య కావాలి! నేను సునీతనే చేసుకుంటాను. వచ్చే నెలలో మా పెళ్ళి జరగాలమ్మా! మీరు చెయ్యకపోతే మేమే చేసుకుంటాం!"

అని రవి మరో మాటకు ఆస్కారం లేకుండా మేడ మీదికి వెళ్ళి పోయాడు

లక్ష్మీదేవి స్థాణువులా వుండి పోయింది! ఆ రాత్రి రవి మాటలు భర్తతో చెప్పి భోరుమంది!

"సునీత ఎవరు లక్ష్మి?" అనడిగాడు లక్ష్మీదేవిని.

"ఎవత్తో ఒక సీతాకోక చిలుక వుంది లెండి! కాస్త ఎర్రగా, బుర్రగా వుంది! దాన్ని చేసుకుంటానని కూర్చున్నాడు!" అని కళ్ళు తుడుచుకుంది.

కొద్దిసేపు ఆయన ఏదో ఆలోచిస్తూ వుండి పోయాడు. ఆ తర్వాత మెల్లగా అన్నాడు.

"లక్ష్మి! వాడంత గట్టిగా పట్టుబడుతున్నప్పుడు, మనం ఒప్పుకోక తప్పదు!"

"అంతేనంటారా?" అంది బేలగా.

"లక్ష్మి! నీ బాధ నాకు తెలుసు. శారదకి అన్యాయం చెయ్యడం క్షమించరాని నేరం. కానీ వాడేమి చిన్న పిల్లాడు కాదు. వాడి కిష్టమైన పని చెయ్యడమే మన విధి. అంతకన్నా మనం చేసేదేముంది. మనం కాదంటే వాడు ఇల్లు వదిలి పోతాడు! అంత పట్టుదల వాడిది! వాడు చెప్పినట్లు చేసి మన పెద్దరికాన్ని నిలుపుకుంటే మనకు మర్యాద!"

అవసరమైనప్పుడు ఇవ్వడం, తనకు కావలసినప్పుడు స్వతంత్రించి తీసుకొనడం, రహస్య విషయాలను అడిగి తెలుసుకోవడం, తన రహస్యాలను అరమరికలేక చెప్పడం, మన యింట్లో భుజించడం, ఆప్యాయంతో తన యింటికి భోజనానికి పిలవడం మిత్ర లక్షణాలని యిదివరలో చెప్పుకొన్నాము. ఇవి మిత్రునికే కాక తనపై అభిమానం వున్నవారికిన్నీ సహజ లక్షణాలే! ఇకపోతే మిత్రునియందు మరికొన్ని గొప్ప గుణాలు కానవస్తాయి.




స్నేహం అనేది పరస్పరం దూరం చెయ్యలేని సంబంధం. శరీరాలు దూరదూరంగా ఉన్నా, మనస్సులు మాత్రం దూరం కానేకావు. స్నేహం అంటే జిడ్డు కదా! అది సులభంగా వదిలేది కానే కాదు. కష్టసుఖాలలో అండగా ఉండేవాడు స్నేహితుడు మాత్రమే! శుభకార్యాలు జరిగేటప్పుడు బంధువులు వచ్చి తిని పోతారేగాని, వారిలో సహాయపడేవారు చాలా తక్కువ. మర్యాదలు చాలలేదంటూ విమర్శలే తరచు వినవస్తాయి. ఆ సమయంలో మిత్రులే నడుము కట్టుకుని అన్ని పనులలోనూ భాగస్వాములవుతారు. ఇక కష్టకాలం వచ్చినపుడు బంధువులు చల్లచల్లగా తప్పుకుంటారు. తాము సహాయపడనందుకు ఏవేవో సాకులు చెప్తారు. మిత్రులు మాత్రం తప్పనిసరిగా వచ్చి సహాయపడతారు. బంధువులకూ, మిత్రులకూ గల వ్యత్యాసం యిది. ఒక్క బంధువులే అన్న మాట యేమిటి? తమ బిడ్డలు-కూడా మిత్రులకంటే తక్కువే అని చెప్పాలి. అవసరమైనప్పుడూ, వృద్ధాప్యంలోనూ తలిదండ్రులకు అండగా ఉండేవారు చాలా తక్కువ. చిన్ననాడు వారు తమకు చేసిన సేవ విస్మరించబడుతుంది. వివాహానంతరం వారు భార్యల చేతి కీలుబొమ్మలై కేవలం స్వార్థాన్నే చూసుకుంటారు.

మానవత్వం ఉన్నవాడు ఇట్టి మిత్రులకు ఎప్పుడూ కృతజ్ఞత చూపాలి. కాని అతనిని మోసగించుటకు తలపెట్టకూడదు. అది ద్రోహమే అవుతుంది. సేతువును చూచినా, గంగా సాగర సంగమాన్ని దర్శించినా, బ్రహ్మ హత్య వంటి మహా పాతకాలు నశిస్తాయి కాని, మిత్రద్రోహ మహా పాతకం నశించదని పెద్దలు చెప్పుచున్నారు. కృతఘ్నుడు, విశ్వాస ఘాతకుడు శాశ్వతంగా నరకాన్ని అనుభవించినట్లే మిత్రద్రోహి కూడా శాశ్వతంగా నరకాన్ని అనుభవిస్తాడని కూడా వారు చెప్తున్నారు.

మిత్రుని వైశిష్ట్యాన్ని గ్రహించి, అతని యెడల కృతజ్ఞత కలిగియుండడం ఉత్తమ ధర్మం.

-బులుసు వేంకటరమణయ్య

---

"అంతేనంటారా?" అంది విచారంగా.

"అంతకన్నా ఏం చెయ్యగలం లక్ష్మీ!"

"కానీ! శారదని తలుచుకుంటే చాలా బాధగా వుందండీ! వాడికి ఎంత సేవ చేసింది? అది సేవ చెయ్యకపోతే వాడి కసలు కళ్ళు వచ్చేవేనా? అన్నిటికంటె ఆశ్చర్యం ఏమిటంటే. మొన్నటి వరకూ వాళ్ళిద్దరూ ఎంతో అన్యోన్యంగా వుండేవారు. వాడు కూడా శారదని వదిలి క్షణం కూడా వుండేవాడు కాదు! ఇంతలోనే ఎలా మారిపోయాడో?" అంది ఆవిడ

రాఘవయ్య కూడా ఆశ్చర్యపడ సాగాడు

"నువ్వు చెప్పింది నిజమే లక్ష్మీ! రవి స్వభావం నాకూ అంతు పట్టకుండా వుంది! మంచంలో వున్నప్పుడు "శారదా! శారదా!" అంటూ ప్రతి పనికి ఆ పిల్లనే పిలిచేవాడు. కళ్ళు రాగానే ఆమె నీడని కూడా అసహ్యించుకుంటున్నాడు!"

"కళ్ళు లేనప్పుడు దాని రూపం కనబడలేదండీ! అందుకే అభిమానించాడు. కళ్ళు రాగానే దాని వికార రూపం చూసి అసహ్యించుకుంటున్నాడు ఈ విషయం తెలిస్తే అదేమనుకుంటుంది? మన స్వార్థం కోసం దాన్ని వుపయోగించుకున్నామనుకుంటుంది. శారదకి రవి అంటే ప్రాణం! ఈ విషయం తెలిస్తే అదసలు ప్రాణాలతో వుంటుందా? రేప్రొద్దున దాని ముఖం ఎలా చూడాలో తెలీకుండా వుందండీ! అసలు వీడికి కళ్ళు రాకపోయినా బాగుండేది!" లక్ష్మీదేవి బాధగా అంది

"లక్ష్మీ ఏమిటా మాటలు" వారించాడాయన.

"అవునండీ! వాడిని చూస్తుంటే ఒళ్ళు మండి పోతోంది!"

"లక్ష్మీ! అనవసరంగా ఆలోచించి ఆరోగ్యం చెడగొట్టుకోకు! ఎలా జరగాలని వుంటే అలా జరుగుతుంది! రేపు వుదయం నేను బొంబే వెళ్ళాలి! ఇక నేను పడుకుంటాను!" అంటూ ఆయన మంచం మిద వాలి కళ్ళు మూసుకున్నాడు.

లక్ష్మీదేవికి నిద్ర పట్టలేదు! ఆవిడ కళ్ళ ముందు శారద మెదులో‌ంది! శారదకి ఈ విషయం ఎలా చెప్పాలి? ఎలా తట్టుకుంటు

ఆలోచిస్తూ ఎప్పటికో నిద్రలోకి జారుకుంది. (ఇంకా ఉంది)

# సప్త సంతానం

ఆళ్ళ కృష్ణవేణి

పుట్టిన ప్రతి మనిషికి వయసు రానురాను ఆలోచనాశక్తి పెరుగుతుంది. అది పెరిగే కొలది వూహల్లో ఎన్నో వూహించు కుంటాడు. రాజకీయంలో దిగాలను కునే వాడు, దిగిన వాడు తను అమెరికా ప్రెసిడెంటు అయినట్లు కూడా కలలు కనగలడు. అది సాధ్యమా, అసాధ్యమా అని కూడా ఆలోచించ కుండ స్నానాల గదిలో కూనిరాగాలు తీసే వారు తాము యమ్. ఎస్. సుబ్బలక్ష్మి కన్నా గొప్పవాళ్లైనట్లు వూహించుకో వచ్చును. వూహ ఌ రకరకాలుగా వుంటుంది

పెండ్లి కావలసిన ఆడపిల్ల అమితాబచ్చనో కమల్‌హాసన్ వంటి వాడు వచ్చి ఎగరేసు కొని పోతాడని కలలు కని వూహల్లో మురిసిపోవచ్చు. ఇంకా ఎన్నెన్నో వూహలు..... ఎన్ని రకాలుగా సంతోషంగానో భయంగానో ఆందోళనగానో వూహించుకో వచ్చుగాని.... తనకి పిల్లలు పుట్టరేమో నని మాత్రం ఏ పిల్లగాని ఏ యువకుడుగానీ సర్వాకైనా అనుకోరు. సరికదా!పైగా అసలు "మాకు పిల్లలే వద్దు- పెళ్ళంటూ చేసుకుంటే యిద్దరం ఝామంటూ తిరుగుతూ సంతోషంగా వుంటాడు, పిల్లల జంజాటనం మా కొద్దు అని మురిపెంగా అంటూ వుంటారు.

అలానే పిల్లని చూడడానికి వచ్చేవాళ్ళు ఆ పిల్ల వంశం గొప్పదా కాదా, పిచ్చి గిచ్చి వంటివి వున్నాయా, కోడలు నలుపు అయితే కులం నలుపవుతుంది, తెలుపా, బాగా పొడరు అద్దిందా? మాటలు తొస్సిపోకుండా వస్తాయా రావా? కాలు వంకరా? సూదిలో దారం ఎక్కించగలదా? సుడి ఏమైనా వుందా? యీ విడ కాలు పెట్టగానే ప్రాణగండం కలగదు కదా! ఇలా ఆలోచిస్తారు గానీ.... యీ పిల్లకి పిల్లలు పుడతారో లేదో అనే అనుమానం మాత్రం నామమాత్రంగా కూడా ఎవ్వరికి రాదు.

నన్ను తన కొడుక్కి చేసుకునేటప్పుడు మా అత్తగారికి రాలేదు.

"నీ పేరేమిటమ్మా" అని నన్ను అడిగినప్పుడు.

"హరిద్రా" అని నేనంటే.

"అదేం పేరు సోద్యంగా వుంది. నే పుట్టి బ్రాహ్మణుల యింట్లో యీ పేరు వినలేదే" అని బుగ్గన వేలుంచుకొంది.

"ఆవిడ పేరు అలిమేలు మంగ తాయారమ్మ"

దానికి మా నాన్నగారు 'అది మన పేరేనమ్మా!'

'హరిద్రా' అంటే పసుపు అని అర్థం . అది పచ్చగా వుందని ఆ పేరు పెట్టాను" అని అన్నారు.

ఆయన ఆయుర్వేద వైద్య శిఖామణి మరి. ఆయన చేతుల్లో 'బసవరాజీయం' ఎప్పుడూ వుంటుంది.

"ఓహో అలానా అన్నగారూ! అలానే పచ్చగా పదికాలాలపాటు బిడ్డ పాపలతో సంతోషంగా వుండాలి" అని ఆశీర్వదించారు.

అది ఫలించలేదు.

నేను బయట చేరినప్పుడు నొసలు చిట్లించి-నావిడ విసుక్కుని చివరకి బాహాటంగానే సణగడం ప్రారంభించారు.

"బయట అయితే చాలు మా అత్తగారు నా మొహానికి యింత పిండాకూడు కూడా వేసేది కాదు. ముట్టుగాలి తగిలి నేను మైల పడనా అని. ఎవ్వరైనా ఆ వేళకి వస్తే కబళం దక్కినట్లు, అందరూ తినగా మిగలేవి, అది మూడు పెచ్చులు, యింకా నేను నయం" అంటూ రాత్రి మిగిలిన చద్ది అన్నం నీళ్ళు కారిపోయింది మడి కట్టుకోక ముందు నా ముందు విసిరి తరువాత ఆవిడ మడి కట్టుకునేది. తిరిగి ముద్ద మరునాడు వుదయమే.

మేము బ్రాహ్మలమే. శుచి శుభ్రం ఆచారం మా యింట వున్నది. అయినా యింత భయంకరంగా మాత్రం లేదు.

పిల్లలు లేరు.

"వేదకాలం నుండి వున్నది, జరిగింది, జరుగు-తున్నదేగా, పిల్లలు పుట్టక పోతే వంశాన్ని అలా నాశనం చేసుకుంటామా, మా వంశం దుంపనాశనం చేయడానికే వచ్చింది మహాతల్లి, మళ్ళి పెళ్ళి చేసుకోరా వెధవాయి అంటే వాడు పెళ్ళాం బెల్లం అంటున్నాడు. మా తాతగారు సంతానం లేదని నాలుగు పెళ్ళిళ్ళు చేసుకుంటే చివరకి నలుగురికి పన్నెండేసి మంది పిల్లలు కలిగారట." అంటూ ఆవిడ నేను వినేలా ఎవ్వరెవ్వరు పిల్లలు కోసం మళ్ళి పెళ్ళిళ్ళు చేసుకున్నారో ఆ వుదంతం అంతా ఏకరువు పెడ్తూ వుండేవారు వత్తులు చేసుకుంటూ ఇరుగమ్మతో పొరుగమ్మతో.

నాతో వ్రతాలు నోములు ముడుపులు చెయించారు.

సుబ్రమణ్య షష్ఠి వ్రతం, రాత్రి కాలంలో అమ్మవారి గుడిలో నిమ్మకాయలో నేతి దీపం, పౌర్ణమలు, చవితులు, విఘ్నేశ్వర పూజలు, బొమ్మల నోములు, ఆ నోములు, యీ నోములు, మాసంలో సగం రోజులు వుపవాసాలతోనే గడిచేది. నిత్యం వుపవాసాల వలన విపరీతమైన వేడిచేసి ఇరవై ఒక్క రోజుకంతా బయట చేరేదాన్ని

"వూరికే అన్నారా! దరిద్రుడికి ఆకలెక్కువా, పిసినారికి ఖర్చు ఎక్కువా అని. అందరూ నెలకి ఒకసారి ముట్టువుంటే మా తద్దినం నెలకి రెండు-సార్లు. అందరిళ్ళల్లో తద్దినాల పండుగైతే మా యింట్లో ముట్లు పండుగ. చేసుకున్న వారికి చేసుకున్నంత. ఈ పాపిష్ఠికి సంతానయోగం వుంటే యిలా ఎందుకు జరుగుతుంది" అని తిట్టేవారు.

చివరికి ఒకనాడు "మావారే ఆచారాల సంగతి దేవు డెరుగు గానీ అమ్మగోలని, మాటలని నేనే విని సహించలేక పోతున్నాను. నీవు నెలకి ఒకసారి మాత్రమే బయట కూర్చో, యింకోసారి అమ్మతో చెప్పకు" అని అన్నారు.

అలవాటైన ఆచారం

మౌనంగా నాశనం చేయడం యిష్టంలేక ఆవిడ తిట్లని భరించి నెలకి రెండుసార్లు బయట చేరేదాన్ని

మా నాన్నగారు వైద్యశిఖామణి నా దురదృష్టానికి తగ్గట్లు అన్నట్లు గుండె పోటుతో మరణించారు. ఆయన వుండి వుంటే నాకు తప్పక వైద్యం చేసి మా అత్తగారి వాగ్బాటి నుండి నన్ను రక్షించి వుండేవారు. ఆయన ఎంతో మందికి పిల్లలు లేనివారికి వైద్యం చేసి సంతాన యోగులని చేశారు. ఆయన పుణ్యం నన్ను కాపాడ లేదా? నేను ఏం పాపం చేశానని సంతాన హీనురాలినిగా వుండవలసి వచ్చింది. ఎందరికో వుచిత వైద్యం చేసి ప్రాణాలని నిలిపారే, వారి పుణ్యమైనా నన్ను కాపాడ లేదా? పైగా ఆయన "హరిద్రా" అని పేరు వేరే పెట్టారు.

నేను పచ్చగా లేనే. ఆయన పెట్టిన పేరు వమ్ము అయినట్లే కదా!

మా నాన్న పోయినప్పుడు నేను ఆయన లైబ్రరిని గోనె సంచులలో కట్టి వెంట తెచ్చుకున్నాను. నాలుగు గోనె మూటలతో రిక్షాలో నుంచి దిగగానే మా అత్త మొహం చాటంత అయింది. మా పుట్టింటివారిని తెగపొగిడింది. నేను కక్కలేక మింగలేక గుడ్లు మిటకరిస్తూ వుండిపోయాను. మా వారు గబగబా చెప్పు లేసుకొని బయటికి వెళ్ళిపోయారు.

కత్తిపీట తీసుకొని పురికొస తెగ్గొట్టి తెరిచి చూస్తే ఏముంది అందులో....

ఆవిడ ఆశించినట్లు వెండి సామాను, ఇత్తడి సామాను, స్టీల్ సామాను కాకుండా.... పుస్తకాలు వున్నాయి.

మా యింట్లో మా తాతల కాలం నాటివి రాచిప్పలు వున్నాయి. "రోటి పచ్చడి రాచిప్పలో చేస్తేనే దాని రుచి మా యింట్లో అవి పోయాయి-

గాని మి నాన్న ఏలానూ పోయాడు, మి అన్నలని అడిగి ఆ రాచిప్పలు తెచ్చుకో!" అని ఆవిడ చావు యింటి నుండి వెళ్ళేటప్పుడు చెప్పింది. కనీసం ఆ రాచిప్పలు కూడా లేవు

ఆవిడకి చిర్రెత్తు కొచ్చింది. అంకాలమ్మ శివాలు వేసినట్లు, పూనకం వచ్చినప్పుడు రొప్పుతూ నానాతిట్లు తిట్టి - "నీవు అష్టదరిద్రురాలివే, అందుకే నీకు యీ బుద్ధులు మనిషికి ఏదో ఒక సిరి వుంటుంది నీకు ఏ సిరి లేదు. అన్ని లేములతో బాటు నీకు సంతానలేమి. పైగా యీ వెధవ దరిద్రం వేరే తెచ్చావా? యిప్పుడే కిరసనాయిలు పోసి నిప్పు అంటిస్తా" అని నిజంగా అన్నంత పని ఆవిడ చేయబోయింది గానీ మా మామగారు ఆపారు.

ఆవిడ మంచావిడే. నాకు పిల్లలు లేకపోవడం-వలన ఆవిడలో ఎక్కడో అణగివున్న క్రూరత్వం ఇలా బయటకి వస్తోంది. కొడుక్కి పిల్లలు లేరే అనే బాధ ఆవిడని హిస్టీరియా పేషంటు మాదిరి తయారు చేస్తోంది

నేను నుంచున్నా తప్పే, కూర్చున్నా తప్పే ఏపని చేసినా అది చివరికి పిల్లలు లేని లేమి దగ్గరికి వచ్చి ఆగుతోంది

"తురక వేప తిను . పిల్లలు పుడతారు" అవి బత్తాయి కాయంత ముద్దని నూరి తీసుకొచ్చి యిచ్చింది.

తురకవేప కడుపులో పురుగుచేరి ముట్టప్పుడు కడుపు నొప్పితో బాధపడే వారికి బాగా పనిచేస్తుంది. స్త్రీ శరీరంలో పుత్పత్తి అయ్యే అండాన్ని యీ పురుగులు తినేస్తాయి కాబట్టి గర్భం నిలవదు. అటువంటివారు తురకవేప చిన్న వుసిరికాయంత ముద్ద అరటిపండులో పెట్టుకొని తింటే ఆ పురుగులు చనిపోయి గర్భం నిలుస్తుంది.

నాకా కడుపు నొప్పి లేదుగా అయినా తిననంటే ఆవిడ వూరుకోదు, అంత ముద్ద తినకపోయినా కొంతైనా తిని నానా అవస్థపడ్డాను.

ఆవిడ నోచమన్న నోములన్నీ నోచాను. ఆవిడ తినమన్నదంతా తిన్నాను.

నా కొడుక్కి పిల్లలు లేరే అనే దిగులుతోనే ఆవిడ తనువుని చాలించింది



ఆమె వున్నంతకాలం నా కాలం వుపవాసాలు పూజలతో నే సరిపోయింది.

నేను తెచ్చుకున్న పుస్తకాల మూటలు తెరవనన్నా తెరవనీయకుండా ఆవిడ అటక ఎక్కించేయడం వలన యిన్ని సంవత్సరాలలో అవి ఏమయ్యాయో కూడా నేను చూడలేదు.

క్రిందకి దింపించి చూస్తే ఎలకలు కొరికి, పుస్తకాల పురుగులు తిని, అవ శాన దశలో వున్నాయి.

మా అత్తగారు అన్నట్లు నేను నిజంగా అష్ట దరిద్రురాలనే అనుకుంటా, లేకపోతే యీ పుస్తకాలైనా నాకు ఎందుకు దక్కలేదు.

ఈ ఒంటరి జీవితానికి తోడు అవేకదా!

ఆయుర్వేద పుస్తకం బసవరాజీయం, వస్తు గుణదీపిక, శబ్దార్థచంద్రిక, అమరకోశం, నీతిశాస్త్రం మాత్రం. ఎలకల పాలబడలేదు. అంతవరకూ నేను అదృష్టవంతురాలనే.

డబ్బాలు ఖాళీవి పారేయడానికి మనసు వొప్పక వుంచుమన్నవి సీసాలు, మూతలు, దారపువుండలు అవీ ఇవితో అలమారా అంతా నిండి వుంది. అంతా ఎత్తి పారవేసి శుభ్రంచేసి యీ పుస్తకాలంతా వాటిలో సర్ది, కలరావుండలని పొడిచేసి జల్లి, వాటికి యిన్ని సంవత్సరాల తరువాత రక్షణ కల్పించాను.

మా నాన్న పదకొండేసి పుతాలు పెట్టిన ఆయుర్వేదమందులన్నీ సీసాలో వున్నాయి. అభ్రక భస్మం, ముత్యం భస్మం, కాసీస భస్మం సువర్ణ భస్మం, రజిత భస్మం....

(రజిత భస్మానికో కథ వుంది. మా అమ్మకి మా తాతగారు మా పెద్ద మామయ్య పెండ్లికి ఒక పట్టుచీర కొనియిచ్చారు. అది పూర్తిగా వెండి బంగారలతో నేసిన పూలచీర (జరి) (ఈ కాలంలో అటువంటి చీర లేదు) మా నాన్న కళ్లంతా ఆ చీరమీదే. అందులో వున్న వెండిని కరిగించి భస్మంచేస్తే వొంటికి మంచిదని ఆయన, యివ్వమని మా అమ్మ యివ్వనని. చివరకి దొంగలపేరు చెప్పి భయపెట్టి ఆ చీరని తీసుకొని కాలిస్తే 200 తులాల వెండి, ఒకతులం బంగారం వచ్చింది. వాటితో సువర్ణ భస్మం, రజిత భస్మం చేశారు.)

తామ్ర భస్మం కృష్ణాభ్రక భస్మం, ఖడ్గలోహ భస్మం అయస్కాంత భస్మం, లోహాభ్రకసిందూరం, కాంతాభ్రక సింధూరం నాగభస్మం, వంగభస్మం, హేమ మాక్షికభస్మం, వైక్రాంత.... ఇలా ఎన్నో వున్నాయి.

ఇరవైనాలుగు గంటలు పుతాలు, కల్వం పత్రంలో నూరుకోవడం, రక్తపోటుకి మందు, తోకమల్లి పూల రసంతో నూరేవారు. ఆ తోకమల్లి పూలు తెల్లవారు ఝామున లేచి నేను వెళ్లి ఏరుకొచ్చి యిచ్చేదాన్ని (నా చిన్నప్పుడు).

ఇన్ని వున్నా లాభం ఏమిటి? వాటి వాడకం నాకు తెలియదు. వసుగుణ దీపికని రాత్రింపవళ్లు తిరగవేసి అందులో చెప్పిన వైద్య విధానాలని అనుసరించి చూశాను.

## సప్త సంతానం

నిజమైన పెన్నేరు దొరుకుతుందా?

నిజమైన మొమ్మోయి మనకి లభ్యమా?"

అవి నిజమైనవో కావో మనకి తెలియదుగా. కావు కాబట్టే ఫలితం శూన్యం.

ఇది కాకుండా మద్రాసు వెళ్లి పేరున్న డాక్టర్లు అందరికీ చూపించుకున్నాను. ఎవ్వరి దగ్గరకి వెళ్లినా కన్సల్టేషన్ ఫీజు యాభై రూపాయలు, అదిగాక అన్ని టెస్టులు చేయాలంటారు. అన్నీ చేసి ఓ నాలుగైదు వేలు బిల్లు అయిన తరువాత లోపం లేదమ్మా! యీ మందులు వాడండి.... అవి వాడి ఫలితం లేక యింకో డాక్టరు.... యింకో డాక్టరు. డాక్టర్ల ఫీజులు ఎంత అవుతున్నాయో ప్రయాణపు ఛార్జిలు అంతే.

చివరకి విసుగెత్తి మానివేశాం

డబ్బుకి డబ్బుపోయింది. శని పట్టింది అన్నట్లు వాళ్లు యిచ్చిన హార్మోన్ల ఇంజెక్షన్స్, టాబ్‌లెట్లు మింగి శరీరం నా మాట వినక నాకు వొంగలేనంత వూబగా తయారైయింది. ఇంత శరీరం వచ్చిందేమిటి అని అడిగితే ఆ మాత్రలు మింగితే అలా వస్తుంది అని నోరు చప్పరించేశారు.

తిరిగి నా శరీరం యథాస్థితికి రావాలంటే అదేదో గొప్ప అద్భుతం జరిగితే తప్ప... నేను టుమ్ టుమ్‌నే.

నా సన్నని నడుం చూస మా పక్కింటావె (నా పెండ్లికి ముందు) "నా గాజులు నీకు వడ్డానం లా సరిపోతుంది నిన్ను చూస్తూ వుంటే నాకు సిగ్గుగా వుంది" అని అనేది. ఇప్పుడు నేను ఆవిడ కంటే లావు.

లావు తగ్గడానికి చిట్కాలు ప్రారంభించాను. ఇన్నాళ్లు పిల్లలకోసం పాటుపడ్డాను. ఇప్పుడు లావు తగ్గించుకోవడంకోసం పాట్లు మొదలైయింది

నాలుగు రకాల కూరలు వండక తప్పదు. వండినవి తినే ప్రాప్తి లేదు. అంగట్లో అన్నీ వున్నాయి. అల్లుడినోట్లో శని అనే మాదిరిగా.

అక్కడతో ఆగిందా? ఇంటకొచ్చేవాళ్లు నన్ను చూసి వూరికే వెళ్లలేక ఓ మాట విసిరి వెళ్లేవారు. వారా మాట అనకపోయినందు వలన వారికి వచ్చే నష్టం ఏమి లేదుగానీ. అనినందువలన ఎదుట మనిషి ఎంతగా బాధపడతుందో వారిక తెలిసినా అదో పైశాచిక ప్రవృత్తి

గౌతమ బుద్ధుడు ఎన్నో శతాబ్దాల క్రితం అననే అన్నాడు. జీవహింస అంటే నోరులేని జంతువులని వధించడమే కాదు మాటలతో తోటి మనుష్యులని హింసించడం వలన వారి ఆత్మలు వ్యధ చెందడం కూడా జీవహింసే అన్నారు.

"పిల్లలు లేరుకదా! వారి వాటా కూడా హరిద్రే తింటూ వున్నది" అని ఒకరు

ఇల్లు శుభ్రంగా నీటుగా అందంగా వుండటం చూసి "వుండకేం చేస్తుంది. ఎక్కడ పెట్టిన వస్తువులు అక్కడే వుంటాయి, పిల్లలు వుంటే ఇల్లు పీకి పందిరి వేసేవారు, ఎంత సర్దినా తిరిగి కిష్కింధలానే వుంటుంది" అని.

"పిల్లలుంటే పని ఎక్కువ. గుంజీళ్ళు తియ్యాలి, ఎంత తిన్నా వంటికి పట్టదు. ఇప్పుడు పనేం వుంటుంది. వొళ్ళు పెరక్కేం చేస్తుంది" అని యింకొకరు.

"ఓ వెయ్యి అప్పు యివ్వండి, పిల్లలకి ఫీజు కట్టాలి" అని అడిగితే, "లేదంటే!"

"పిల్లా లేదు, జల్లా లేదు. మూట కట్టుకొని ఏం చేస్తారు? అప్పగానేగా అడిగింది. పిల్లలున్న వాళ్ళయితే సాధక బాధలు తెలిసేవి" అని నిష్ఠూరాలు.

"పాపం! మీకు కాళ్ళు, చెయ్యి పడితే చూసేవాళ్ళు ఎవ్వరు? మా పిల్లాడిని పెంచుకోండి...."

## శారద శోభ

–సోమసుందర్

శరత్కాల మొచ్చిందని
రెల్లుకెలా తెలిసిందో?
తలపైన తురాయి దాల్చి
మెరుస్తోంది రాజులాగ!

చేట చెవుల ఏనుగువలె
ఆకుల నాడించు టేకు
ఒళ్ళంతా పెద్ద పెద్ద
పూగుత్తులు ధరించింది!

ఛెళ్ళుమనే ఎండ పగలు
చిరు చలి కెరటాలు రాత్రి ...
శుక్ల పక్షమైతేనా -
వెండి రేకు లురలు నింగి!

తురకపెండ్లికొడుకు లాగ
పూదండలు దిగజార్చుక
పరిమళాల నెగజిమ్మును
గిరి మల్లెలు, పున్నాగలు!

కొత్త నీటి ఎరుపు విరిగి
తళతళ మను కోనేరులు -
నింగిని వెదికే మబ్బుల
కలువ కనుల విచ్చి చూచు!

శారద జ్యోత్స్నా శోభలు
జీవన తో షోత్సవాలు!
నీరద గగన విహారము
లానందోత్సాహ రుచులు!

అంటే మేము ముసలి వాళ్ళమయ్యామనా? ఈ కాలంలో మా వయస్సువారికి యింకా పెళ్ళిళ్ళు కావడం లేదు. అప్పుడే మాకు తద్దినాలకి రడి అవుతున్నారు జనం.

సాంఘిక మర్యాదలు వద్దు, సంబంధ బాంధవ్యాలు వద్దు, మేము నలుగురిలో తిరగడం మానివేశాం.

పెండ్లిళ్లకి పేరంటాలకి వెళ్ళడం మానివేశాం. వెళ్ళాం అనుకోండి అందరూ మా చుట్టూ చేరి యివే ప్రశ్నలు.

నెలనెలా సరిగ్గా ముట్లు అవుతున్నాయా?

మంచి లేడీ డాక్టరు వద్ద చూపించుకోలేక పోయావా? వయస్సెంతా! కొంత మందికి ముప్పై రెండుకే ముట్లు ఆగిపోతుంది.

"మీరు తలుచుకుంటే ఎక్కడికైనా పోగలరు, మా కలా కాదే, పిల్లా, జల్లా, వీళ్ళని యీడ్చుకొని వెళ్ళేసరికి తలప్రాణం తోకకి వస్తోంది, మీ పనే రైట్, హాయిగా యీ కాలంలో పిల్లలు లేనివారే ధన్యులు" అని.

నా చుట్టు ఒక ప్రపంచాన్ని నిర్మించు కున్నాను. నాకుగా నేను అందులో బంధించు కున్నాను.

ఇంటిపని అంతా నేనే చేసుకుంటాను. పని మనిషిని పెట్టుకో లేదు.

అది అయిన తరువాత హాయిగా పుస్తకాలని చదువుకోవడం. వాటికన్నా మంచి స్నేహితులు ఎవ్వరున్నారు.

## సీసాల సేకరణ!

సీసాలు సేకరించడం పాశ్చాత్య దేశాలలో చాలా మందికి ఒక సరదా. పశ్చిమ జర్మనీలో సీసాలు సేకరించే వారు 85 మంది కలసి ఒక సంఘాన్ని ఏర్పాటు చేసుకున్నారు. ఈ సంఘంలో సభ్యుడైన ఒక సైనిక అధికారి 1500 మినీ లిక్కర్ సీసాలను సేకరించాడు. వాటిలో మద్యం ఉంటుంది. అయితే ఆ సీసాలన్ను ఎప్పుడూ తెరవరు. ఈ కృషిలో ఆయనకు ఒక స్నేహితురాలు సహాయ పడిందంట. అమెరికాలో సీసాలు సేకరించే వారి సంఘాలు 14 ఉన్నాయి. మినీ లిక్కర్ సీసాలను చాలా అధిక ధరలకి అమ్ముతారు. మామూలు లిక్కరు సీసాల కంటే కూడా వీటి ధరలు ఎక్కువగానే ఉంటాయి. ఈ సీసాల సేకరణ అమ్మకాలను వార్తాపత్రిక ప్రకటనల్లో కూడా ప్రకటిస్తుంటారు.

(గ్లోబల్)

అసలు తెలుగు డిక్షనరినో ఇంగ్లీషుదో సంస్కృతానిదో, అమరకోశమో పట్టుకుంటే కాలం ఎలా గడిచేది తెలిసేది కాదు.

ప్రభంద కావ్యాలు తాత్పర్యంతో వున్నది చదువుతూ వుంటే మెదడు పొరలు విప్పుకుంటూ వున్నట్లు అనిపిస్తుంది.

ఒక్కరు పద్యం కవి ఎందుకు వ్రాశాడో దానికి సంబంధించి యింకొక అర్థం వచ్చే పద్యం చెప్పడం, అవి చదువుతూ వుంటే నేటి సాహిత్యం ఒక సాహిత్యమా అనే భావనే కలగక పోదు.

ప్రపంచాన్ని జౌపోశన పట్టారా ప్రభంధాలతో.

చదువుతూ వుంటే యింకా చదవాలనే కాంక్ష.

మా మామగారికి బాగా వయస్సు అయింది.

ఆయన వరండాలో పడక కుర్చీలో పడుకొని పేపరు చదవడం, రామాయణం చదువు కోవడం, గీతలోని పద్యాలని తిరిగి తిరిగి చదువు కోవడం నిద్రపోవడం ఆయన దినచర్య.

రోజు మొత్తం మీద ఏ రెండు మూడు మాటలో ఆయన మాట్లాడేది.

ప్రొద్దుట లేచి స్నానం, జపం, అంటే గాయత్రి జపం, సూర్య నమస్కారాలు, వగైరా పూర్తి చేసుకునే సరికి పదకొండు అవుతుంది.

భోజనం చేసి పేపరు చదివి కుర్చీలోనే కళ్ళు మూసుకొని సేదతీరి, కాఫీతాగి. అలా షికారు వెళ్ళి వచ్చి తిరిగి స్నానం జపం, పళ్ళు, పాలు, పారాయణం నిద్ర.

ఎవ్వరైనా ఆయన దగ్గర పాపం మీ కొడుక్కి సంతతి లేదు అని అంటే– "ఋణానుబంధ రూపేణా పసు పత్ని సుతః అని అననే అన్నారు కదండి. వాళ్ళకి ఎవ్వరైనా ఋణపడి వుంటే సంతానంగా జన్మించి ఋణం తీర్చుకుంటారు. లేకపోతే లేదు. మనం ఎంతటి వారం, మన చేతుల్లో

ఏముంది? క్రితం జన్మలో వాడు నాకు ఋణం వున్నాడు కాబట్టి. నాకు పుత్రుడుగా జన్మించాడు" అని అనేవారు.

అడిగిన వారు మళ్ళా నోరు ఎత్తేవారు కాదు.

ఆ కాలంలో నే పెద్దలు అన్నింటికి వివరంగా వ్రాసి పెట్టి పోయినప్పుడు మధ్య యీ మనుష్యులకి యీ చిన్న బుద్ధులు ఎందుకు?

ఒకరోజు

సాయం సంధ్యాకాలం.

మామగారు షికారుకి వెళ్ళ లేదు.

స్నానం చేయలేదు.

సంధ్య వార్చ లేదు.

నిర్వేదంగా మంచం మీద బాసింపట్టం వేసుకొని కూర్చొని వున్నారు.

తెల్లవారు ఝామున మంచం దిగితే తిరిగి మంచం మీద చేరేది రాత్రి ఏ పదకొండు గంటలకో!

అంతవరకూ ఆ పడక కుర్చీనే ఆశ్రయం

అటువంటిది మంచం మీద ధ్యానముద్రలో కూర్చున్నటు కూర్చున్నారు.

నేను కాఫీచేసి తీసుకెళ్ళి యిచ్చాను.

"వద్దమ్మ ! గొంతుక ఒక మాదిరిగా వున్నది పంచపాత్రలో తీర్థం పోసి, నాలుగు తులసీదళం వేసి యివ్వమ్మా" అని అన్నారు.

నేను అలానే చేసి యిచ్చాను.

అది ప్రక్కన పెట్టుకొని–

"అమ్మా హరిద్రా! అలా కూర్చో!" అని అన్నారు.

ఆయనకి ఎదురుగా నేల మీద బాసింపట్టం వేసుకొని కూర్చున్నాను.

"పిల్లలు లేక పోవడం వలన మనం ఏదో పెద్ద పాపం చేశాం అందుకే మనకి పిల్లలు లేరు అనే తేలిక భావం మనలో ఎప్పుడూ పొరబాటున కూడా రాకూడదమ్మా. కొంత మందికి పుట్టిన పిల్లలని చూస్తే వారి కర్మ పరిహారార్థమే ఆ పిల్లలు కలిగారేమో ననే ఆలోచన కలగక పోదు.

మంచి సంతతిని పొందడం ఒక వరం. అది లేకపోతే అసలు వద్దు.

అందరికి ఇందిరాగాంధీ వంటి సంతతి ప్రాప్తమా!

# బానిసత్వం అమ్మబడును

ఐదేళ్ళ కొకసారి వచ్చే
ఎన్నికల్లో
నువ్వు
ఐదు రూపాయలకు
ఓటు అమ్ముకుంటే
ఐదు సంవత్సరాల
బానిసత్వం కొనుక్కొన్నట్లే
కొత్త రంగుల పల్లకీ
మొయ్యడానికి ఒప్పుకొన్నట్లే!

-అడిగోపుల వెంకటరత్నమ్

# సప్త సంతానం

హరిద్రా!

పెద్దలు సంతానాలని సప్తసంతానం అని అన్నారమ్మ. ఏనాడో అశోకుడు బావులు తవ్వించి చెట్లు నాటించాడు. ఆయన పేరు చిరస్థాయిగా నిలిచిపోయింది.

మనదేశానికి మొదటి ప్రసిడెంటు అయిన బాబూ–రాజేంద్ర ప్రసాదుకి పిల్లలు లేరమ్మ.

జనతా లీడరు జయప్రకాశ్ నారాయణ్‌కి పిల్లలు లేరు. అందు వలన వారు భూమిలో కలసి పోలేదు. చరిత్రలో చిరస్థాయిగా నిలబడిపోయారు.

బెంగాలీ సాహిత్య కారుడు శరత్ బాబుకి పిల్లలు లేరమ్మా ! కాని ఆయన కీర్తి ఆయన సంతానం అమ్మ.

కడుపున ఒక బిడ్డని కనడం.... అదే సంతానం అనుకో కూడదు.

గుడులు, చెఱువులు కూడా సంతానమే అన్నారు. గుడి కట్టించే చెరువు త్రవ్వించే స్తోమత మనకు లేదు.

కీర్తి సంతానమే.

ఆ కీర్తి సంతానాన్ని పొంది సంతానవతివి కామ్మా" అని ఆశీర్వదిస్తున్నట్లు చెయ్యి ఎత్తారు.

నేను అక్కడే నేల మీద వంగి వారికి నమస్కరించాను.

ఆయన వుపదేశంలో నాకు గురుసాక్షాత్కారం లభించినట్లు అని పించింది.

నాకు ఆయన మామగారులా కనిపించలేదు.

దివ్య తేజస్సు.

గురువు.

గురూపదేశం పొందాను.

నాలో అదొక రకమైన భావన కలిగి మైకం క్రమ్మినట్లు అయింది.

నేను సాష్టాంగ నమస్కార భంగిమలో నే వున్నాను.

"హరిద్రా! అదేమిటి అలా పడుకున్నావ్ " నన్ను తట్టారు ఆయన.

ఆఫీసు నుండి వచ్చి వుండి వుంటారు.

నేను లేచి కొన్ని క్షణాలు అయోమయంగా ఆయన వేపు చూసి..... ఏం జరిగిందా అని సింహావలోకనం చేసుకొని మా మామగారి వేపు చూశాను.

ఆయన ప్రశాంతిగా పడుకొని వున్నారు.

దగ్గరకి వెళ్ళాను.

పంచపాత్రలోని తీర్థాన్ని ఆయన సేవించి పంచమహభూతాలలో కలసి పోయారు.

నేను కెవ్వున అరవ లేదు.

ఏడవ లేదు.

ఆయనకి తన మరణ క్షణం తెలిసి నన్ను ఆశీర్వదించి తనువు చాలించారు.

గురు సాక్షాత్కారం నాకు లభ్యం అయింది కాబట్టి దానికి ఫలితం నాకు తప్పక లభిస్తుంది.

మామగారి వుపదేశం, ఆశీర్వాదం వున్నప్పుడు నేను సాధించగలను కదా!

సంతానం కోసం ఎన్నో బాధలు పడ్డాను.

సాహిత్య సంతానం పొందడానికి నేను కలం పేపరు అందుకున్నాను.

ఇధైనా నాకు లభిస్తుందో లేదో వేచి చూడాలి □








# ఉత్సాహంతో ఎంత పనయినా చేసే మిమ్మల్ని నిరుత్సాహ పర్చాలా ఈ పాడు జలుబు?



జలుబు మహా చిరాకు కలిగిస్తుంది.

మీ ఉత్సాహాన్ని చప్పగా చల్లార్చి వేస్తుంది.

ముక్కు కారడం. తలనొప్పి. జ్వరం వచ్చినట్లు వుండడం. ఒళ్ళు నొప్పులు. ఇవన్నీ చాలవన్నట్లు మధ్య మధ్యలో తుమ్ముల పరంపర.

అన్నిటికంటే చిరాకు కలిగించేదేమిటంటే మీతోపాటు మీ పనికీ ఇబ్బందే.

కాని, ఈ బాధల నుండి తప్పించుకోడానికి మార్గం వుంది ఒకటి. అదే కోల్డరిన్‌లో పూర్తి నమ్మకం.

జలుబు బాధలను తొలగించడానికి ప్రత్యేక ఫార్ములా కలిగినది కోల్డరిన్. ఇది మూడు విధాలుగా పని చేస్తుంది:

కారే ముక్కును శుభ్రం చేస్తుంది

తలనొప్పిని తగ్గిస్తుంది. జలుబుతోపాటు వచ్చే జ్వరాన్ని తగ్గించడానికి సహాయం చేస్తుంది.

ఈ పాడు జలుబు మీపై దెబ్బ తీసినపుడు కోల్డరిన్‌తో మీరూ దానిపై ఎదురుదెబ్బ తీయండి.

మీలాంటి ఉత్సాహవంతులు వెధవ జలుబుతో నీరసపడి పోకూడదు మరి.




## కోల్డరిన్

జలుబు-నివారక టాబ్లెట్

ప్యాకెట్‌పైన సూచించినట్లు వాడండి.

CLARION/B/B/13/154 TEL








# సీరియల్ ప్రతిభ

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

(గత సంచిక తరువాయి)

ప్రతిభ సాధించిన విజయాలలో ప్రముఖమైనది ఆశాలత చేత రవీంద్రభారతిలో డ్యాన్స్ ప్రోగ్రాం ఇప్పించడం. నగరంలోని రసమాధురి అనే కళాసంస్థ వారు నాట్యరంగానికి ప్రతిభ చేసిన సేవకు ప్రతిఫలంగా ఆమెకు "భరత కళా విశారద" అనే బిరుదును ప్రదానం చేశారు. ఆ సభకు నగరంలోని ప్రముఖులందరూ విచ్చేశారు. అరంగేట్రాల ఆండాళ్ కూడ వచ్చింది. ఆమె జీవితంలో ఒకేసారి ఈనాడు రెండు ఓటములు చవిచూసింది. తను గూడ నాట్యకళకు అంతో ఇంతో సేవ చేశాననుకుంటున్నది. కాని తన కెవరు ఇలాంటి బిరుదు ప్రదానం చేయలేదు తానే డబ్బిచ్చి చాలసార్లు రవీంద్ర భారతిలోను, త్యాగరాయ గానసభలోను సన్మానాలు చేయించుకుంది. అలాంటిది ప్రతిభకు ఇలా సన్మానం జరగడం ఆమెకు ఒళ్ళంతా అప రాచుకున్నట్లు అనిపించింది దానికి తోడు ఆశాలత ప్రదర్శన ప్రతిభకు అంతర్జాతీయ ఖ్యాతి వచ్చేటట్లు చేసింది. సన్మాన సభలో వాత్స్యాయనశర్మ ప్రసంగిస్తూ మూకం కరోతి వాచాలం, పంగుం లంఘయతే గిరిమ్ అని భగవంతుని గూర్చి చెప్పారు. ప్రతిభ ఈనాడు నిజంగా వికలాంగులకు కాళ్ళు వచ్చేటట్లు చేసింది. నగరంలో చాలమంది కళాకారులున్నారు. కాని అందరూ శిష్యురాండ్ర ఎప్పుడు అరంగేట్రాలు చెయిద్దామా. ఎప్పుడు పట్టుచీరలు, పావెత్తు బంగారు సంపాయించుకుందామా అనే దృష్టి గలవారే కానీ కళను ఇలా ప్రయోజనాత్మకంగా తీర్చిదిద్దిన వారరుదు. ఈ శాస్త్రానికి నాట్యవేదం పేరు ఉంది. ప్రతిభ నాట్యం ఏవిధంగా వేదమో ఆశాలత నృత్యంతో నిరూపించింది. ఇది మొత్తం భారతీయులకే వికాపర్వకారణము. ఈ విధంగా సాగింది ప్రసంగం. ఇది వినేసరికల్లా ఆండాళ్‌కు పిచ్చెక్కినట్లయింది. తన మీదే తన కన్ను పొడుస్తున్నట్లు ఆమె బాధపడింది. ఈ ప్రతిభ ఇక ఎలా నృత్య ప్రదర్శన లిస్తుందో నేనూ చూస్తాను అనుకుంది ఆండాళ్. ప్రతిభ మాత్రం సభా ముఖంగా మనవి చేసుకొంది. సుధారాణి విదేశాల నుండి తనకు వ్రాసిన జాబును సభాముఖంగా వినిపించింది. భారతీయ కళల వలెనే విదేశాలలో కూడ అనేక నాట్యప్రక్రియలున్నాయి. వీటికి ప్రాదుర్భావం , మతమే అయినప్పటికీ ఈనాడవి కేవలం వినోద ఉల్లాసాలు కలిగించేందుకు మాత్రమే ఉపయోగపడుతున్నాయి. మెక్సికోలో "హుహిట్ల్"లో పొచిలీ అనే ఒక దేవత విందులో ఊరులోని పెద్దలు చిన్నలందరు ఒకరినొకరు కౌగిలించి కట్టివేసిన చేతులు పట్టుకొని నాట్యం చేస్తుంటారు. ఉత్తరాసియాలోని "ఓస్టియాక్" జాతుల నృత్యాలు తోడేళ్ళు, ఎలుగుబంట్లు మొదలైన జంతువులను అనుకరిస్తుంటాయి. ఇలాంటివే కంచడేలు, కెనోపిట్లు చేసే నృత్యాలు ఇవన్నీ కోతులను కొండముచ్చులను అనుకరిస్తూ చేసే నృత్యాలు. భారతీయ నృత్యాలు కూడ అనుకరణ ప్రవృత్తి గలవే అయినా వానితో ఆధ్యాత్మిక ప్రవృత్తి వెల్లివిరుస్తుంది. ఈ దేశంలో కళలన్నింటికి ఒకటే పరమార్థం. అది జీవుని అంతర్ముఖత్వం చేయడం. ఆత్మ సాక్షాత్కారానికి దోహదం కలిగించడం. ఈ విషయాన్ని చాటి విదేశీయుల ముందు భారతీయులు భరతనాట్యాన్ని ప్రదర్శించేసరికల్లా వారు ఆశ్చర్య చకితులైపోయారు. భారతీయ కళా కేంద్రాలు వివిధ ప్రాంతాల్లో ప్రారంభించవలసిందిగా వారు ప్రార్థిస్తున్నారు. ఈ విధంగా సుధారాణి వ్రాసిన ఉత్తరం సభా ముఖంగా ప్రతిభ చదివి వినిపించింది. ప్రతిభకు ఇది మరొక కలికితురాయి.

అయితే ప్రతిభ సభాముఖంగా తానీ విజయానికి పూర్తిగా కారకురాలిని కానని మహాకవి భవభూతియే కారణమని ఆమె సభాముఖంగా మనవి చేసుకొన్నది.

నాట్యామృతం ఇవాళ మనకు క్రొత్తయితే కావచ్చు. కాని నృత్యాలు వేదకాలం నుండి మనకు అనూచానంగా వస్తూనే వున్నాయి. కన్యలు పూర్ణకుంభాలతో అగ్ని చుట్టు ప్రదక్షిణలు చేస్తూ వేదమంత్రాల కనుగుణంగా నర్తిస్తుండేవారు. దీనివల్ల వారికి సకాలంలో పంటలు పండి దేశం సస్యశ్యామలంగా వుండడం జరిగేది. పశుగ్రాసం నీరు పుష్కలంగా దొరకాలనే కోరికతో కన్యలు జలకుంభాలు నెత్తి మీద పెట్టుకొని పాదాలతో భూమి మీద

**జరిగిన కథ-19 :** భవభూతి, ప్రతిభ వివాహం చేసుకుంటారనే పుకారు బయలుదేరుతుంది. ఆరంగేట్రం ఆండాళ్ భవభూతికి, ప్రతిభకి అక్రమ సంబంధం ఉందని ప్రచారం చేస్తుంది. భవభూతి గిరిజ తన కూతురని గిరిజ ఉంటే స్కూలువాళ్లతో చెప్పి ఆ అమ్మాయిని తనతో పంపించమని అడుగుతాడు. ప్రిన్సిపాల్ అంగికరిస్తాడు. గిరిజకు గురుపాదస్వామివద్ద నాట్యం చెప్పించాలనుకుంటాడు భవభూతి. గిరిజకు నాట్యం చెప్పడానికి గురుపాదస్వామి అంగీకరించాడు. గురుపాదస్వామివలన ప్రతిభకి ఒకసోదరి ఉందని తెలుసుకున్న భవభూతి ఈ విషయం పూర్తిగా తెలుసుకోవాలనే ఉత్సాహంతో హైదరాబాదు బండి ఎక్కాడు. గురుపాదస్వామి గిరిజపేరు నీరజగా మార్చాడు. నాట్యామృతం అనే 'డాన్స్ థెరపీ' పుస్తకం వాత్స్యాయనశర్మ ద్వారా భవభూతి ప్రతిభకి పంపిస్తాడు. తనకు నీరజ అనే పుత్రిక ఉన్నట్లు భవభూతి చెప్పలేదని ప్రతిభ నిష్ఠూరం ఆడుతుంది. **పోలియోవల్ల అవిటిదైన ఆశాలతమీద నాట్యామృతాన్ని ప్రయోగించింది ప్రతిభ. ఆశాలత సంపూర్ణ ఆరోగ్యవంతురాలయింది. ఈ వార్త భవభూతికి చెప్పాలని కబురు చేస్తే అతను నగరంలో లేడని సమాచారం అందింది:**

తాళం వేస్తూ 'ఇదం అమృతం' అని పాడుతూ నృత్యం చేసేవారు రుగ్వేదంలో సృష్ట్యాత్మకమైన ప్రార్థనా మంత్రం ఉంది. ఈ మంత్రోచ్చారణ చేస్తూ తొలి జలాలతో లయబద్ధమైన ప్రవాహ సంచలనాన్ని కలిగించి సృష్టికి అంకురార్పణ చేయడానికి దేవతలే ఈ నృత్యం చేసినట్లు ఈ మంత్రార్థం వల్ల తెలుస్తుంది. ఓ దేవతలార! మిరు ఆదిమ సముద్రంలో ఒకరి చేతుల నొకరు పట్టుకొని నృత్యం చేస్తున్నట్లుగా కనబడినపుడు మి నృత్యం వల్ల తుషార బిందువులు ధూళిలా మేఘాలలా పైకి లేచాయి– అని మంత్రార్థం. ఇలా వేదకాలం నుండి నాట్యవేదం వినోదాన్నే కాక విజ్ఞానాన్ని, ప్రయోజనాత్మకతను సంతరించుకొన్నది అని చెప్పింది ప్రతిభ. ప్రతిభ ప్రసంగానికి, వినయానికి ఆమె కళావైభవానికి ప్రేక్షకులు జోహార్లు అర్పించారు కళాశిఖరాలను అందుకున్న మహానటిగా ఆమెను కీర్తించారు

"మనదేశంలో ఎంతమంది నర్తకిమణులు లేరు కాని వారు చేస్తున్న పనేమిటి? రాజకియ నాయకులకు, సిన్మా నిర్మాతలకు ప్రక్కలు వేయడం తాగి తందనాలాడడం. కళను ఇలా ప్రయోజనాత్మకంగా తీర్చిదిద్దారా అని ప్రేక్షకులు బాహాటంగానే తమలో తాము అనుకోవడం మొదలుపెట్టారు. ఇవన్నీ ఆండాళ్ చెవినపడ్డాయి. ఆమెలో నటరాజస్వామి బదులు దక్షయజ్ఞం నాటి వీరభద్రుడు తాండవమాడాడు. త్వరలో తాను "డాన్స్ తెరఫీ" పై ప్రత్యేకంగా పరిశోధన చేసి దీనినొక ప్రత్యేకమైన నాట్య శాఖగా తీర్చిదిద్దగలనని ప్రతిభ సభాముఖంగా ప్రకటించింది. ఇది సభలోని ఎందరో తల్లిదండ్రులకు ఉపశమనాన్ని కలిగించింది సభానంతరం ఆండాళ్ స్వయంగా ప్రతిభ వద్దకెళ్ళి ప్రతిభను అభినందించింది

"ప్రతిభా! ఈ విజయం వ్యక్తిగతంగా మికు కాదు. మొత్తం మన నృత్య కళాకారిణులకే ఈనాడు మహాగౌరవం లభించింది. ఇంత చక్కని సభలో పాపం భవభూతి గారు కూడ ఉంటే ఎంతో బావుండేది" అంది ఆండాళ్.

"అవును! నేనూ అదే బాధ పడుతున్నాను. ఆయన ఎక్కడికి వెళ్ళారో తెలియదు. వాత్స్యాయనశర్మను గూఢ విచారించాను" అంది ప్రతిభ.

"ఆయన మిమ్మల్ని అభిమానించాడు, ప్రేమించాడు. వివాహం చేసుకోవాలనుకున్నాడు. కాని నీవు చివరకు నట్టువాంగం నారాయణను చేసుకొంటాననేసరికి ఆయన నిరాశతో ఎక్కడికో వెళ్ళిపోయాడు" అన్నది ఆండాళ్. గ్రిన్‌రూంలో అంతా ఈ మాటలు వింటున్నారు.

"ఏమిటి నువ్వంటున్నది? నేను నట్టువాంగం నారాయణను చేసుకోవాలనుకుంటున్నానా."

"అవును! ప్రదర్శనానంతరం మిరిద్దరు ఒక గదిలో ఉండగా భవభూతి స్వయంగా చూశాడటండి! అందుకే అసహ్యం వచ్చి జీవితంలో నిస్పృహ పాలయి ఎక్కడికో వెళ్ళిపోయాడట."

ఆండాళ్ ఇంత నిర్మొహమాటంగా నోటికొచ్చినట్లు మాట్లాడుతుంటే గ్రిన్ రూంలో మిగిలిన వారు గుడ్లప్పగించి చూస్తున్నారు. ఎవరికి ఏమనాలో తోచలేదు. ప్రతిభ కళ్ళలో క్రోధమూ బాధ విషాదం చోటు చేసుకొన్నాయి. ఇంత బతుకు బతికి చివరికి తన బతుకు తాళం వాయించే నట్టువాంగం నారాయణను చేసుకోవడమా! ప్రతిభ ఏమి సమాధానం ఇవ్వకుండా గ్రిన్ రూంలోంచి



బయటికి నడిచింది. బయట ఆమె కోసం నిలబెట్టి ఉంచిన కారు వద్దకు పోయి వేగంగా డోరు తీసి ఎక్కి కూర్చుంది. కారు చీకట్లో కలిసిపోయింది. రవీంద్ర భారతిలోని గ్రీన్ రూంలోంచి గుసగుసలాడుతూ ఒక్కొక్కరే నిష్క్రమించారు. విజయ గర్వంతో ఆండాళ్ తన ఇంటికి పయనమైంది. ఆనాటి సభలో ప్రతిభ సాధించిన విజయాలన్నింటిని తాను ఒకటి రెండు మాటలతో చిత్తు చేసింది. ఇక ప్రతిభకు మనశ్శాంతి ఉండదు. విభూతి గజ్జెల గుర్రం నట్టువాంగం నారాయణ ప్రతిభ పెళ్ళి పెళ్ళి ప్రతిభ ఇలా చెలరేగిన కందిరీగలతుట్టె లాగా ఆమె అస్తమానం ఆలోచిస్తుంటుంది. ఇది ఆమెను క్రుంగదీస్తుంది. ప్రస్తుతానికి ఆమెకు కావలసిందదే.

ఆండాళ్ ఇంటికి వెళ్ళి బాగా తాగి ఆ రాత్రి హాయిగా నిద్రపోయింది. ఆండాళ్ ఊహించినట్లే ప్రతిభకు ఆ రాత్రి మరో శివరాత్రి అయింది. తాను ఏం తప్పు చేశానని భగవంతుడు తన కింత శిక్ష విధిస్తున్నాడు. "అరయగ కర్ణుడు చచ్చె నార్గురి చేతన్" అన్నట్లు తానొక దైవోపహతురాలు. మొదట్లోనే తన తల్లి జీవితంలో తను వివాహం చేసుకోరాదని బతుకంతా కళకే అంకితం చేయమని ఆంక్ష విధించి చేతిలో చేయి వేసుకొని ప్రమాణం చేయించుకొని ఆ తర్వాత తృప్తిగా మరణించింది. ఈవిధంగా తల్లి ఆజ్ఞ తన లౌకిక జీవితానికి శాశ్వతంగా శృంఖలాలను విధించింది. గురువు తండ్రి లాంటి వాడు. నమ్మి దగ్గరికి చేరింది. కాని అతడే వంచించితే ఇక ఏం కావాలి? తాడే పామై కరిచినట్లు, తల్లే పెరుగన్నంలో విషం కలిపి పెట్టినట్లు తాను గురువు చేత జీవితంలో మోసపోయింది. ఆ బాధ నుండి తప్పుకోవడం కోసం మనశ్శాంతి పొందాలన్న ఉద్దేశంతో బెంగుళూరు నుండి హైదరాబాదు వచ్చింది. తానెవరికీ పోటీ కాదు. తనకెవరూ సాటి కారు. ఎవరి కళ వారిది. ఎవరి అభిమానులు ఎవరి శ్రేయోభిలాషులు వారి కున్నారు. అలాంటిది నిష్కారణంగా అరంగేత్రాల ఆండాళ్ తనపైన పగబట్టింది. విభూతి గజ్జెల గుర్రమని తమ పేర్లు బజారు కెక్కించింది. ఇప్పుడు తనకు! నట్టువాంగం నారాయణకు సంబంధం అంటగడుతుంది. ఈ ఆండాళ్‌ను ఏం చేసినా పాపం లేదు. ఈవిడను హత్య చేసి చిన్న చిన్న ముక్కలుగా నరికి కాకులకు గద్దలకు పారేయాలి. ఇంతటి నీచురాలు, అసూయాపరురాలు, వ్యర్థజీవి కళా శాస్త్రానికి అధ్యాపకురాలేమిటి? నటరాజస్వామి ఈమెనెలా కరుణిస్తాడు? ప్రతిభ మనస్సు సంక్షుభితమైంది. ఆమె కన్నులు అశ్రుపూరితములై బిందువు బిందువులుగా నీరు చెక్కిలి నుండి స్రవించి నేలను అభిషేకిస్తున్నాయి. మర్నాడే ఆమె తాను కొన్ని దేవాలయాలలోని నృత్య శిల్ప భంగిమలను అధ్యయనం చేయడం కోసం వెళుతున్నానని తన కళాకేంద్రంలో చెప్పింది. కొన్ని రోజుల్లోనే తిరిగి రాగలనని అప్పటివరకు సీనియర్ విద్యార్థులు క్లాసులు నిర్వహిస్తుండాలని చెప్పింది. ఒక్క ఆయాను మాత్రం వెంట తీసుకొని రైలెక్కింది. ఆయా పేరు యాదమ్మ. ఆమె స్థానికురాలు వయస్సులో పెద్దది. "చూడు యాదమ్మ ఎక్కడికి వెళ్ళిన నేను ప్రతిభనని, నర్తకి నను విషయం నీ వెవరితోను చెప్పవద్దు. నేను ఎక్కడైన హోటల్లో దిగవలసి వచ్చిన నీ పేరు మీదనే రూం తీసుకొందాం." యాదమ్మ సరే అంది. ప్రతిభ జీవితంలో దాగివున్న కథలను గూర్చి, రవీంద్ర భారతిలో జరిగిన సంఘటనను గూర్చి యాదమ్మకు తెలియదు. అయితే ప్రతిభ ఏదో అశాంతితో అల్లాడిపోతున్నదనే సంగతి ఆమె గ్రహించ గల్గింది. అదేమిటని ప్రశ్నించే సాహసం ఆమెకు లేకపోయింది. ఇరువురు నాంపల్లి స్టేషనులో మధ్యాహ్నం వేళ మదరాసు రైలెక్కారు. తెల్లవారు జామున నాలుగు గంటలకు అది గూడూరు చేరింది. అక్కడి నుండి వారొక బస్ ఎక్కారు. అది కాళహస్తి పోతుంది. సూర్యోదయానికి ముందే వారు కాళహస్తి చేరారు. యాదమ్మ దృష్టిలో ఇది కళాయాత్ర. కాని ప్రతిభది తీర్థయాత్ర. భారత దేశంలో కళలు తీర్థాలు అన్నీ ఒకే చోట సంగమించాయి. ఇదే ఈ దేశంలోని కళా రహస్యం. ఉదయమే వారు కాళహస్తిలో ఒక గది తీసుకున్నారు. ప్రతిభ ఆలయంలోకి వెళ్ళి స్వామి వారికి అభిషేకాలు చేసింది. ఈనాడు ఆమె ఎవరో ఎవరికీ తెలియదు. ఒకప్పుడు ఈమె నాట్య ప్రదర్శనను ఏర్పాటు చేసి వాల్‌పోస్టర్స్ వేసి కరపత్రాలు పంచి పెడితే ప్రజలు తండోపతండాలుగా ఇసుక వేసినా రాలనంతగా విరగబడేవారు. వారికి తన దర్శనం దొరకడమే అసంభవ మయ్యేది. అలాంటిది ఈనాడు తాను అనామకురాలు, గుడికి వచ్చిన అనేక మంది భక్తుల్లో తాను ఒకతి.

నిజానికి భగవంతుని సన్నిధానానికి ఇలాగే నిరహంకారంగా పేరు ప్రతిష్ఠలను, పటాటోపాలను ఆలయానికి బయటనే వుంచి లోనికి ప్రవేశించాలి. అప్పుడే ఈశ్వర కటాక్షం కలుగుతుంది. యాదమ్మ, ప్రతిభ స్వామి వారిని ఆరాధించుకున్నారు. దక్షిణ భారతదేశంలోని సుప్రసిద్ధ దేవాలయాలలో కాళహస్తి ఒకటి. అక్కడి శిల్ప కళావైభవానికి దేశ దేశాలలోని ప్రేక్షకులంతా ముగ్ధులవుతుంటారు. ఎన్నెన్నో నాట్య శాస్త్ర సంబంధమైన రస బంధురమైన భంగిమలను శిల్పవిద్యా కోవిదులు ఈ శిలల్లో నిక్షిప్తం చేశారు. నిజానికి అవి రాళ్ళుకావు. అనూచానంగా భారతదేశంలో వస్తూవున్న శిల్పశాస్త్ర గ్రంథాలకిది ప్రత్యక్ష లక్ష్యాలు. ఒకొక్క భంగిమలో ఒక్కొక్క హొయలు, ఒక్కొక్క నొబగు, అవన్నీ చూస్తూ ఆమె పరవశించి పోయింది. నిజానికి కీర్తి వల్ల లాభాలతో పాటు నష్టాలు కూడా వున్నాయి. అట్టహాసాలు ఆర్భాటాలు పటాటోపాలు, జన సమ్మర్దం ఇంత విశ్రాంతి లేకుండ ఒక సామాన్యురాలిగ ఆలయ శిల్పాలను కళలను చూచి ఆరాధించేందుకు, ఆనందించేందుకు అవకాశం దొరకదు. ఆనాడామె అక్కడే వుండిపోయింది. సంధ్యా సమయానికి ఆలయంలో గర్భగుడిలో సంప్రదాయికమైన ఆముదపు దీపాలు వెలిగాయి. ఆనాడు జన సమ్మర్దం చాల తక్కువగా వుంది. మామూలుగా తిరుపతిలో ఉన్న దానిలో శతాంశం జన సమ్మర్దం కూడ కాళహస్తిలో ఉండదు. ఇందుకు కారణ మేమంటారు? యాదమ్మ ప్రశ్నించింది.

"విష్ణువు భోగప్రధానమైన దైవమయితే శివుడు యోగ ప్రధానమైన దేవత. అక్కడ లడ్డూలు, పులిహోరలు, చక్కెర పొంగలులు దధ్యోదనాలు లభిస్తే ఇక్కడ కొబ్బరి ముక్కలు, మారేడు దళాలు, తుమ్మపూలు, ఇస్తూ వుంటారు. అక్కడ లభించేది కస్తూరి. ఇక్కడ లభించేది విభూది. అక్కడికి పోతే లక్ష్మి లభిస్తుంది. ఇక్కడ ముక్తి కాంత దర్శన మిస్తుంది. ఈ నాటి ప్రజలందరూ నాతో సహ ధనాశాపరులే గదా! ముక్తి సంగతి రేపు చూసుకోవచ్చు ఇవాళ ధనం కావాలి. అందుకే భక్తుల వాంఛల ననుసరించి ఆయా కాలాల్లో ప్రత్యేకంగా ఆయా దేవతలకు పేరు ప్రఖ్యాతులు ప్రాధాన్యము లభిస్తుంటాయని ఒక సారి నాతో భవభూతి చెప్పాడు".



# నీటి బొట్టు లేక సముద్రముప్పొంగేనా,
# పొదుపు లేక సంసార నౌక ముందుకు సాగేనా?




జీవితం ఓ అనంతమైన ప్రయాణం, అందులో ఎన్నెన్నో మజిలీలు, మలుపులు. ఒడుదుడుకుల నధిగమించి జీవనం సాఫీగా సాగాలంటే పొదుపు ఎంతో ముఖ్యం.

## జాతీయ పొదుపు సంస్థ 15 సంవత్సరాల భవిష్యనిధి పథకాన్నొకమారు పరికించండి!

- వైద్యులు, న్యాయవాదులు, చిత్రకారులు, వ్యాపారస్తుల లాగా స్వయం ఉపాధి కలవారికి ఇది ఉత్తమమైన పథకం.
- మీరు ఒక ఆర్థిక సంవత్సరంలో రూ. 40,000 (అత్యధికం) దాకా అదా చేసి, పన్ను రాయితీలను, పన్ను వర్తించని వడ్డీని పొందవచ్చును అంతేకాదు, ఇది పూర్తిగా ఆస్తి పన్ను నుంచి మినహాయించబడింది.
- సాలుకు 9.5% చక్రవడ్డీ
- విత్ డ్రాయల్ మరియు ఋణసదుపాయాలు
- ఈ పథకాన్ని బ్యాంకు ద్వారా కూడా "ఆపరేట్" చేయవచ్చు.

## భవిష్యనిధి అకౌంట్‌లో ఉండే మిగులుకు
## "కోర్టు జప్తి" (ATTACHMENT) నుండి పూర్తి రక్షణ.



Breeze/NSO/8533






ది కమిషనర్ ఆఫ్ స్మాల్ సేవింగ్స్
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హిమాయత్‌నగర్, హైదరాబాదు 500 029.


జాతీయ పొదుపు సంస్థ.

# ప్రతిభ

ఈ మాట ఆమె అనే సరిక ఆ సమిపంలో నె కూర్చున్న ఒక వ్యక్తి ఆమె వైపు వింతపడి చూశాడు. అప్పటికి ప్రదోష సమయం దాటింది అరవై ముగ్గురు నాయనారుల మూర్తులు వరుసగా నున్న ప్రదేశానికి అవతల జ్ఞాన ప్రసూనాంబిక దేవాలయానికి ప్రక్కన ఒక ఆలయపు కుడ్యానికి అనుకొని వారిద్దరూ కూర్చున్నారు. అక్కడ వెలుగు తక్కువగా పడుతున్నది. వీరి మాటలు విని ఆమె వైపు వింతగా చూచిన వ్యక్తి భవభూతి ఆయన ఒంటరిగా వివిధ క్షేత్రాలు దర్శిస్తు కొద్ది రోజుల క్రితం కాళహస్తికి వచ్చాడు. ఆయనయె భవభూతి అన్న విషయం ఆయనకు తప్ప మరొక ప్రాణికి తెలియదు అర్చనా సమయంలో కూడ భవభూతి అన్న తన బిరుదనామంతో కాకుండా తల్లిదండ్రులు పెట్టిన పేరుతో గోత్ర నామాలతో అభిషేకం చేయించేవాడు. అందువల్ల ఈయన భవభూతి అనీ, రచయిత అని ఎవరికి తెలిసే అవకాశం లేక పోయింది. అయినా ఈ దేశంలో రచయితల కున్న పేరు ఏపాటిది? వైజయింతి మాల అంటే అందరికీ తెలుసు. కాని విశ్వనాధ సత్యనారాయణ అంటే పల్లె టూర్లలోనే కాదు. బస్తీలలో మాత్రం ఎంత మందికి తెలుసు? వహీదా రెహమానా అంటే విశ్వవిఖ్యాత నర్తకి కాని మహదేవివర్మ అంటే ఎందరెరుగుదురు. జయబాదురి పేరుకు స్టార్ గ్లామర్ ఉంది కాని జయశంకర్ ప్రసాద్ పేరును తెలిసిన వారెంతమంది ఆంధ్రులలో చాల మందికి ప్రతిభ తెలుసు. కాని భవభూతి పేరు తెలియదు.

ప్రతిభ యాదమ్మతో ఇలా చెప్పింది. పూర్వం ఈ వేళయ్యేసరికల్లా దేవదాసలు నృత్యం చేస్తుండేవారు. నర్తకిమణుల్లో దేవదాసిలు, రాజదాసిలు. అని రెండు వర్గాలుండేవారు. దేవదాసలు నారాయణాంశ కలవారు. వీరు ఊర్వశి సంతాన రాజదాసిలు రంభా మేనక సంప్రదాయాలకు చెందిన వారు రాజదాసిలు రాజుల ముందు పండిత ప్రకాండుల ముందు నాట్యం చేసేవారు వారికి దేవాలయాలలో ఈశ్వర సాన్నిధ్యంలో నృత్యం చేసే అధికారం లేదు కాళహస్తి దేవాలయంలో పూర్వం దేవ నర్తకిమణులు అభినయ సంప్రదాయాన్ని ప్రదర్శిస్తుండే వారు నవరసభరితమై, కోమలమై, లలితమై స్థాయి సంచారుల వికాసం కలిగి లాస్య పద్ధతిలో ఉండే సాత్వికాభినయం ఊర్వశి బాణి. దీన్నే తెలుగు నర్తకిమణులు ఒక తరానికి ముందు ఆలయాలలో నర్తించే వారు రంభా సంప్రదాయంలో జతులు చిత్ర విచిత్ర తాళగతులు గలిగి హస్తపాద విన్యాసము కలిగి, కరణాంగహార ప్రదర్శనలు జరుగుతుండేవి. మేనకా సంప్రదాయంలో ఎక్కువగా సాముదితులు, మొగ్గలు ప్లవనములు ఉంటాయి. ఇది తాండవరీతి. మనం ఏ దేవాలయంలోని శిల్పాన్ని చూచినప్పటికి అక్కడ శిల్పాలు ఈ రంభా ఊర్వశి మేనక సంప్రదాయాలలో ఏదో ఒక పద్ధతికి చెందిన శిల్పాలని కాని భిన్న భిన్న రీతుల శిల్ప విన్యాసాలను కాని శిలలపై గండరించే వారు. కాలగతిలో ఈ కళ మొత్తం కరిగి పోయింది. ఇప్పుడు ఆ శిల్పులు లేరు. ఆ సంప్రదాయాలు లేవు. ఆ నర్తకిమణులు లేరు ఈనాడు నగరాల్లో అరంగేట్రాల ఆండాళ్ వంటివారు ప్రదర్శించే చౌ చౌ నృత్యాలే సంప్రదాయకం పేర శాస్త్రీయ విజ్ఞానంగా చలామణీ అవుతున్నది. వీరు శాస్త్రాన్ని బాగా దిగజార్చారు. కళను ఆధునికం చేస్తున్నామన్న పేరుతో ఎన్నో విదేశీ ధోరణుల్ని యాంత్రిక జీవనం యొక్క వికృతులు ప్రవేశపెట్టారు "

ప్రతిభ చెప్తున్న శాస్త్ర విషయం యాదమ్మ కెంతవరకు అర్థమైందో చెప్పడం కష్టం. కాని ఆమె ప్రతిభ మీది గౌరవంతో, భక్తితో వింటున్నది.

అప్పుడు చీకట్లోంచి ఈ మాటలు వినబడ్డాయి.

"ఇది కాల ప్రవాహం. ఈ యంత్ర యుగంలో మనుషులే యంత్రాలైనప్పుడు వారి మనోభావాలు, కళలు గూడ యాంత్రికంగా స్పందించడంలో ఆశ్చర్యం లేదు. కాని కాలం ఎప్పుడూ ఇలాగే వుండదు. ఇది ఒక చక్ర క్రమంలో సాగుతుంది. బండి చక్రాలు కింది ఆకు పైకి పోయినపుడు పై ఆకు క్రిందికి వస్తుంది. కాని అది అలాగే ఉండదు మళ్ళీ కింది ఆకు పైకి పోతుంది అలాగే ఈనాటి వికృతి శాశ్వతం కాదు. ఈ పతనం నుండి కళను ఉద్ధరించడానికి ఒక ప్రతిభయో ఒక ఆశాలతయో ఈ సమాజంలో నే జన్మిస్తారు."

ప్రతిభా, యాదమ్మా నివ్వెర పోయారు. ప్రతిభ భవభూతి కంఠస్వరాన్ని గుర్తుపట్టింది. వారు చీకట్లో ఉన్న భవభూతిని పోల్చుకున్నారు

"మీరు.... మీరు. ఇక్కడ" అని మాత్రం అన్నారు.

"అవును! నేను కొంతకాలంగా దక్షిణదేశ యాత్ర చేస్తున్నాను ప్రతి దేవాలయంలోను ప్రాచీనులు దాచి పెట్టిన లలిత కళలను అధ్యయనం చేస్తున్నాను. హళెబీడు, బేలూరు శ్రీరంగం బృహదీశ్వరాలయం, లేపాక్షి, కాళహస్తి ఎన్నో దేవాలయాలు, ఎన్నెన్నో రాతి సవ్వడులు ప్రతి శిల్పంలోను నేను ఈశ్వరాంశను దర్శిస్తున్నాను. ప్రతి నర్తకి భంగిమ నాకు ప్రతిభగానే దర్శన మిస్తుంది ఉషలో నిశిలో సంధ్యా సుందరిగా శ్యామల కోమలిగా, కార్తీక పూర్ణిమలు వెన్నెల వలువల కన్నియగా సర్వవిధ నాయికా స్వరూపంగా భిన్న భిన్న రీతుల్లో నాకు దర్శన మిస్తుంది. మీరిక్కడికి వచ్చిన అంశం నాకు తెలియదు. ఇప్పటి వరకు నేను ఈ ఆలయ శిల్పాలలో మిమ్మల్నే దర్శిస్తున్నాను. అభినయ మధురోసోదయం అరుణోదయ శుభోదయం కల హంసల యానముతో మలయ పవన గానముతో వినవచ్చినదొక ప్రభాత వేళా ప్రతిభాగీతం ఏవో లోకాల నుండి ఇట దిగెనొక హిమకిరణం అభినయ కళ కాదర్శం, అమృత ప్రతిభా వర్షం "

"కవిగారూ! మీరు ఎందుకిలా ఊళ్ళు బట్టి తిరుగు తున్నారు? అకస్మాత్తుగా ఎవరికీ చెప్పకుండా హైదరాబాదు నుండి ఎందుకు వెళ్ళి పోయారు? ఆశాలత పేరు మీ కెలా తెలుసు?"

"పత్రికల్లో చూచాను. "డ్యాన్స్ తెరపీ"లో మీరు సాధించిన విజయం విని నేను మళ్ళీ పాలంపేట వెళ్ళాను. మల్లేశారాధ్యుల వారిని కలుసు కుందామను కున్నాను. కాని ఆయన అప్పటికే చనిపోయారు. తాటాకు పుస్తకాల గురించి విచారించాను. తామి హడావుడిలో వుండగా ఎవరో కాజేసినట్లు ఇంట్లో వారు చెప్పారు. విలువైన నాట్యామృతం ప్రతి మానవాళికి అందకుండా పోయింది" భవభూతి నిట్టూర్చాడు.

వీరిరువురు మాట్లాడుకోవడం చూచి యాదమ్మ తాను అమ్మవారి దర్శనానికి వెళుతున్నానన్న మిషతో అక్కడి నుండి లేచి వెళ్ళి పోయింది. భవభూతి, ప్రతిభ మాత్రం ఉండి పోయారు. కొన్ని క్షణాలు నిశ్శబ్దం. దూరంగా దేవాలయంలో గంటలు.

**(ఇంకావుంది)**



# తెలుగు సాహిత్య ప్రియులకు

# అపూర్వావకాశం!

తెలుగులో వచ్చిన చారిత్రక నవలల్లో ఉత్తమమైనదనీ తెలుగుల సంస్కృతి స్వరూపంగా ఉన్నదనీ, మహాకావ్యంగా ఉన్నదనీ— శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ పింగళి లక్ష్మీకాంతం, డాక్టర్ దివాకర్ల ప్రభృతులు ప్రశంసించిన — "తిక్కన సోమయాజి" చారిత్రక నవలను మళ్ళీ తెలుగువారికి అందివ్వాలని మేము పునర్ముద్రించాము.

ఆంధ్ర సాహిత్యానికే కాక, విశ్వసాహిత్యానికే అలంకారమైన రచన అని డా. సర్వేపల్లి రాధాకృష్ణ, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ పింగళి, డా. దివాకర్ల వంటి పెద్దలు కొనియాడిన "ధర్మనిర్ణయం" [నవల]ను కూడా మేము మళ్ళీ అందరికీ అందుబాటులోకి తెచ్చాము.

ఈ రెండు నవలల పైనా — (దేని కది ప్రత్యేకంగా) — అధ్యయన వ్యాసాలను ఆహ్వానిస్తున్నాము. అధ్యయన వ్యాసాలు- ఎంత పరిమితిలో ఉండాలో, నియమావళి ఏమిటో - ఆ నవలలో ఉన్న కూపనులలో వివరించాము. ఆ కూపనులను అధ్యయన వ్యాసాలతో జతపరచి పంపాలి. (ఈ రెండు నవలలు శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు రచనలు)

ఉత్తమమైన యీ రెండు నవలలకూ - దేని కది రు. 25/-లు మాత్రమే వెల ఉంచాము. ఎవ్వరైనా యీ పోటీలో పాల్గొనవచ్చును. రెండు నవలలపైనా వేరువేరుగా ఎవ్వరైనాగాని - పోటీకి వ్యాసాలు పంపవచ్చు. ఒక్కోదానిపైనా పంపవచ్చు. నిర్ణేతలు నిర్ణయించిన ఉత్తమ వ్యాసానికి (ఒక్కొక్క నవలపైనా) రు. 1116/-లు పారితోషికం ఇస్తాము. "ధర్మనిర్ణయం" నవలపై ఉత్తమ వ్యాసాన్ని నిర్ణయించడానికి డాక్టర్ కేశవరపు రామకోటిశాస్త్రి (కాకతీయ యూనివర్శిటీ ఆంధ్ర శాఖాచార్యులు) డా. శలాక రఘునాథశర్మ (శ్రీ కృష్ణదేవరాయ యూనివర్శిటీ ఆంధ్ర శాఖాచార్యులు) డా. బొడ్డుపల్లి పురుషోత్తము (నాగార్జున యూనివర్శిటీ ఆంధ్ర శాఖాచార్యులు) నిర్ణేతలుగా ఉండటానికి అంగీకరించారు. తిక్కన సోమయాజి నవలపై ఉత్తమ వ్యాసాన్ని నిర్ణయించడానికి డా. అమరేశం రాజేశ్వరశర్మ (ఉస్మానియా విద్యాలయ ఆంధ్ర శాఖాచార్యులు) డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు (తెలుగు అకాడమీ) డా. కోవెల సుప్రసన్నాచార్య (కాకతీయ యూనివర్శిటీ ఆంధ్ర శాఖాచార్యులు) నిర్ణేతలుగా ఉండటానికి అంగీకరించారు.

వ్యాసాలు మాకు చేరవలసిన ఆఖరుతేదీ 31 జనవరి 1986. (అనివార్య కారణములవలన యీ తేదీ మార్చవలసివస్తే మార్చబడును.)

ఈ రెండు నవలల్లో ఏది కావలసినా రు. 15/-లు మనియార్డరు పంపితే మిగిలిన సొమ్ముకు వి.పి.పి.గా పంపబడుతుంది.

పుస్తక వ్యాపారులకు ప్రత్యేక సదుపాయములున్నవి.

**శ్రీ రాఘవ పబ్లికేషన్స్**
30, కస్తూరి రంగన్ రోడ్
ఆళ్వారుపేట, మద్రాసు-600 018.

# మంచుతెర

## గుమ్మా నిత్యకళ్యాణమ్మ

"శారదా! కాఫీ!" అన్నాడు ఆనందరావు.

స్టౌవ్ శబ్దంలో అతని మాటలు శారద చెవిని పడలేదు. ఉదయం అయిదు గంటలకు అలారం పెట్టుకుంది అలారం మ్రోగగానే తెలివి వచ్చింది కాని రాత్రి బాగా అలసిపోయిన కారణంగా లేవ బుద్ధి కాలేదు. పెద్దమ్మాయి సుధ మాత్రం లేచి పళ్ళు తోముకుని పుస్తకం తీసుకుంటూ "అమ్మా అయిదు దాటిపోయింది. లే" అంది.

"అయ్యో! అప్పుడే అయిదుంపావు అయిపోతున్నాది." అనుకొని గాబరాగా లేచింది. అది మొదలు మగ్గంలో కండిలా పని. ఎడతెగని పని. ఒత్తుల స్టౌవ్‌మీద సిల్వరు గిన్నెతో నీళ్ళు పెట్టింది. నాలుగు మార్లు కాగపెడితేనే కాని నలుగురికి అందవు. కాన్వెంటులో చదువుతున్న చిన్నవాడు శేఖర్ ఆరున్నరకల్లా వెళ్ళిపోతాడు. రెండు నిముషాలు ఆలశ్యమైనా బస్సు వెళ్ళి పోతుంది. వాడికి టిఫిన్ బాక్సు సర్దాలి. కొంతలో కొంత నయం. సుధ వాడ్ని తయారు చేస్తుంది. ఎనిమిదిన్నరకు సుధా రమణి భోజనాలు చేసి వెళ్తారు. సాయంత్రం నాలుగు దాటితే కాని రారు. వాళ్ళకు టిఫిన్ బాక్సులు సర్దాలి. ఈలోగానే అంట్లు పని, పాచిపని, ఇల్లు వూడవడాలు, పక్కలు ఎత్తిపెట్టడాలు.

అంతేనా? మధ్య మధ్య అతని పనులు పళ్ళు తోముకుందికి బ్రష్, పేస్టు అందించాలి. అడిగినప్పుడు కాఫీ పెట్టి ఇవ్వాలి. స్నానం చేసివస్తే బనియను డ్రాయరు అందివ్వాలి.

మధ్యలో పిల్లలూ ఏవో పురమాయిస్తూ వుంటారు.... "అమ్మా! ఈ స్కర్టు గుండీ తెగిపోయింది. కాస్త కుట్టిపెట్టవూ? అమ్మా! ఈ డ్రెస్ ఇస్త్రీ చెయ్యడం నావల్ల కాదు. ప్లీజ్ చేస్తావా? అమ్మా! నా పెన్ను కనుపించడం లేదు. నేను వద్దంటున్నా వినకుండా నిన్న రాత్రి శేఖర్ తీసాడు. ఎక్కడుందో నీకు తెలుసా?"

శారదకు ఒక వంక దుఃఖం వస్తుంది. వేరొక వంక కోపం వస్తుంది. పిల్లల్ని అయితే కసురుకుంటుంది. అతనికేం చెప్పడం? ఏమిటో పనిలో సహాయం చేయాలనుకోరు. ఏం తానొక్కర్తేనా ఈ ఇంటి బాధ్యత. అతనికేం అవసరం లేదా? ఆ మాటంటే విరుచుకు పడతారు.

"అమ్మా! నాన్నగారు కాఫీ అడుగు తున్నారు!" అంది సుధ జడ వేసుకుంటూ.

అంతలోనే ఆనందరావు పేపరుతో సహా వంటింటిలోనికి వచ్చి, "శారదా! కాఫీ కావాలంటు ఇప్పటికి పదిమార్లు అన్నా అన్నాను. వినిపించుకోవేం?" అన్నాడు కోపంగా.

"ఆఁ! పెడుతున్నాను. ఇక్కడ నా చెయ్యి ఖాళీ లేదు. ఒక స్టౌవ్ మీద మి స్నానానికి నీళ్ళు కాగుతున్నాయి. రెండో దాని మీద కుక్కరెక్కించాను.

ఆనందరావు స్వభావసిద్ధంగా రుస రుస లాడేడు. భార్యను కోపంగా చూసాడు.

"ఆ కుక్కరేదో ఎక్కించే ముందు కాఫీ నీళ్ళు పడేస్తేనేం? ఎంత సేపు? రెండు నిముషాలేగా!" అన్నాడు.

శారద కుక్కరు దింపి కాఫీకి నీళ్ళు పడేస్తూ.... "ఇలా మాటి మాటికి కాఫీకని వండుతున్నవి దించుతూవుంటే పిల్లలకు సమయానికి వంట అవాలా? అందుకే అన్నాను. ఫ్లాస్కులో పోసి వుంచుతాను. కావలసినప్పుడు తాగుతూ వుండండని" అంది.

"అమ్మా! ఎనిమిదింపావు అయింది." అంది రమణి. సుధ ఆ మాట తల్లితో అనాలనుకున్నా తల్లి పడుతున్న అవస్తను చూసి అనలేక పోయింది.

కుక్కరంటే దింపింది కాని అది చల్లారడానికి ఎలా లేదన్నా పది పదిహేను నిముషాలు పడుతుంది. ఆ తరువాత ఆదరాబాదరా తిన్నా బస్సు వెళ్ళి పోతుంది.

"కనీసం స్కూలు పది గంటల నుంచి వున్నా ఎంత బాగుండును. అమ్మకు కొంత రిలీఫ్ దొరుకుతుంది. స్కూలు మేనేజ్‌మెంటువారు గృహిణుల బాధలనెందుకు అర్థం చేసుకోరు? కనీసం ఈ పేరెంట్సు అయినా వేళలు మార్చమని ఎందుకు అర్థించరు?" అనుకుంది సుధ.

"చూస్తున్నావా రమణీ! నేను గూడా పిండి అవుతున్నాను. ఇదిగో కుక్కరు చల్లారి పోవచ్చింది. ఈలోగా మి టిఫన్ బాక్సు లివ్వండి. సర్దేస్తాను" అంది.

"లాభం లేదమ్మా! తింటూ కూర్చొడానికి వేళలేదు. ఆ టిఫిన్ బాక్సు ఇచ్చేయి!" అంది సుధ.

"ఏమిటే! భోజనం చెయ్యకుండా వెళ్ళిపోతావా? మరి ఈ వంట ఎవరికోసం వండినట్టు. హైరానా పడడమే మిగిలింది" శారదకు దుఃఖం వచ్చింది.

"అమ్మా! రమణి అంతసేపు ఆకలితో వుండలేదు. అది ఈ రోజు స్కూలి కెళ్ళదు" అంది సుధ. సుధ టిఫిన్ బాక్సు తీసుకొని వెళ్ళిపోతూ వుంటే తనమిద తనకే కోపం వచ్చింది. ఛీ! పిల్లలకు వేళ కింత తిండైనా పెట్టలేక పోయింది. తెల్లవారకుండా లేచి ఏం ప్రయోజనం? మధ్యలో ఆ కాఫీల అంతరాయం లేకపోతే ఇలా జరిగేదా?

"మినుంచే ఈ రోజు సుధ భోజనం చెయ్యకుండా స్కూలికి వెళ్ళి పోయింది. రమణి అసలు వెళ్ళనే లేదు.

"ఏం దాన్ని నేను భోజనం చెయ్యవద్దన్నానా? రమణిని స్కూలుకి వెళ్ళ వద్దన్నానా?" భార్యను ప్రశ్నించాడు ఆనందరావు పేపరు చూస్తూనే.

"సమయానికి వంట కాకపోతే వాళ్ళేం చేస్తారు?"

"బాగుంది. వంట వండింది నువ్వా, నేనా? ఎవరైనా వింటే నవ్వి పోతారు. నేనే వండుతున్నాననుకుంటారు. నీ వంట కాకపోతే మధ్యను నాదా తప్పు?"

"అయ్యో! రాత! ఈ మనిషికి అర్థం కాదా? లేక అర్థం చేసుకోవాలని ప్రయత్నించరా? తనెన్నిమార్లు చెప్పింది. పిల్లలను స్కూళ్ళకు పంపించే వరకు తన పనుల కంతరాయం కలిపించ వద్దని. అయినా వింటున్నారా? వండుతూ వండుతూ మధ్యలో రెండు మార్లు కాఫీలు పెట్టడం వలననే కదా పదిహేను నిముషా లాలశ్యం అయింది. వాళ్ళ పుస్తకాలు, పెన్నులు వెతికి పెట్టడమో బట్టలు ఇస్త్రీ చెయ్యడమో చేస్తే తాను స్థిమితంగా వండేది కాదా? కనీసం అది ఇయ్యి ఇది ఇయ్యి అని తాను పురమాయించక పోయినా సరిపోతుందిగా? ఆ మాత్రం బాధ్యత ఆయనకు లేదా?"

"ఔను లెండి! మితో వాదించి నెగ్గుకు రాలేను. కాలికి వేస్తే మెడకు, మెడకు వేస్తే కాలికి. కనీసం మి కాఫీ ఫ్లాస్కులో పోసి వుంచుతాను. కావలసినప్పుడు ఆరా ఆరా త్రాగుతూ వుండండి అన్నా మీరు అంగికరించరు. ఇలా అయితే ఆ పిల్లల్ని వేళకు స్కూలుకి పంపించడం నా చాతకాదు."

"చాల్లే శారదా! నీ అశ్రద్ధకు నేను కారణమా? కనీసం నన్ను ఉదయం పూట తీరిగ్గా పేపరైనా చదువు కోనివ్వవా? నీకైతే పది గంటల నుంచి తీరికే. నీకేం కష్టం కలిగించే పనులు చెప్తున్నానని నన్ను సాధిస్తున్నావు. ఇంత సంపాదిస్తున్నాను, రెండు మార్లు కాఫీ త్రాగడం నీకు కష్టంగా వుందా?"

"అదిగో, ఏమైనా అంటే నేను పగలల్లా తీరిగ్గా కూర్చుంటాను అంటారు. రెండు రోజులు ఇంటిలో వుండి చూడండి. నేనెంత తీరిగ్గా వున్నానో తెలుస్తుంది. ఏమైనా అంటే ఇంత గడిస్తున్నాను అంటారు. అయితే నేనూ ఏదైనా వుద్యోగం చేస్తాను – మరి నాకు పగలు తీరికేగా?" అంది పౌరుషంగా.

"శారదా! చదువుకున్నానన్న గర్వం నీకుంది. అందుకే మాటి మాటికి నేనూ వుద్యోగం చేస్తాను అంటావు."

శారదకు దుఃఖం వచ్చింది.

ఇదా ఈ పెద్ద మనిషి తనను అర్థం చేసుకున్నది? ఎంత విపరీతంగా ఆలోచిస్తారు?

"శారదా! మరో గంట ముందు లేవాలని తెలియదా?"

"ఔను! రేపటినుంచి నాలుగు గంటలకే లేవాలి. ఛీ! ఆడపుట్టుకే ఇంత. తను బానిసలా పని చేయాలి. ఆయన కోసం పిల్లల్ని కనాలి. వాళ్ళను సాకాలి. వాళ్ళకు వేళకింత వండి పెట్టాలి. వాళ్ళ చదువుల విషయం చూడాలి. ఈ ఇంటిలో ఒక పనిమనిషి కున్న గౌరవం తనకు లేదు. తను సంపాదిస్తున్నా-రనేగా అతని గర్వం. అందుకే కాలు మీద కాలు వేసుకు కూర్చుంటారు. తానూ అతనంతా చదివింది. పైగా బి.ఎడ్. పాసైంది. తను ప్రయత్నిస్తే ఎక్కడైనా జాబ్ దొరక్కపోదు. అంతే చెయ్యాలి."

శారదలో అంతర్యుద్ధం మొదలైంది.

* * * *

ఆనందరావుకి ఆఫీసులో పనిమీద మనస్సు లగ్నం కాలేదు.

శారద తానూ ఉద్యోగంలో చేరాలని బెదిరిస్తు-న్నాది. దీని పర్యవసానం ఎలా గుంటుంది? రోజూ ఇంటిలో తగువులే. శారదకు తన పట్ల నిర్లక్ష్యం ఎక్కువౌతున్నది.

తనామెను ఏం బాధలు పెడుతున్నాడు?

ఆమె ఆలోచనాసరళిలో మార్పు రావడానికి కారణం అతని ఊహకు అందనిది కాదు. ఈ మధ్య అపర్ణ చేసే బోధలు ఆమె చెవి నెక్కుతున్నాయి. తనూ ఉద్యోగం చేసి సంపాదించగలననే దర్పం. అందుకే తనంటే చిన్న చూపు.

ఆనందరావు తను పొరపాటు చేసా ననుకున్నాడు. తల్లి మాటలు పెడ చెవిని పెట్టాడు. "బాబూ! శారద బాగా చదువుకున్న దంటున్నావు. అలాంటి పిల్ల కుదురుగా ఒర్మిగా నీ చెప్పు చేతల్లో వుంటుందను-కోను. నా మాట విని ఇంకో అమ్మాయిని చేసుకో. ఉత్తరం ముక్క రాయగలిగిన అక్షరజ్ఞానం వుంటే చాలు" అంది.... తను శారద విషయం చేప్తే. అయినా శారద అందం చందం చూసి తను మోసపోయాడు. విద్యాగంధం వున్న స్త్రీలకు అహంకారం వుంటుందని శారద నిరూపించింది.

లంచ్ టైమ్‌లో శెలవు తీసుకొని ఇంటికి వచ్చాడు.

* * * *

"పూర్ శారదా! ఇంత చదువూ చదివి నీవు వంటింటి కుందేలు వయ్యావు. నిన్ను చూస్తూ వుంటే నాకు జాలి వేస్తున్నది" అంది అపర్ణ.

"అపర్ణా! ఈ మాట నీవనడం ఇది నూటయాభై ఆరో మారు" అంది.

"నేను ఇన్నిమార్లు నీ బాగుకోరి చెప్పినా నీవు నా మాటలు పెడచెవిని పెడుతున్నావు. మహిళల హక్కులను పరిరక్షించడమే ధ్యేయంగా పెట్టుకున్న నేను నీవిలా కుమిలి పోవడం సహించ లేను."

"నేను కుమిలి పోతున్నానా?" శారద నవ్వింది.

"ఆ నవ్వు వెనక నీ బాధను దాచుకోవాలని ప్రయత్నించకు. నాకంతా తెలుసు. రమణి చెప్పింది."

"ఏమిటి? రమణి చెప్పిందా? ఏమని?"

"కంగారు పడకు. పతియే ప్రత్యక్ష దైవం అని భావించే భారతీయ నారివైన నీ కూతురు తన తల్లి గురించి చెడుగా చెప్తుందా? పాపం క్షమించుగాక. రమణి తన నోటితో ఏమి చెప్ప లేదు. నేనే అర్థం చేసుకున్నాను. సమయానికి వంట కానందున ఆ పిల్ల స్కూలికి వెళ్ళ లేదు."

"ఔను! అంత మాత్రాన ఒరిగి పోయింది ఏమిటి? ఆ విషయం ఆధారంగా నేను కుమిలి పోతున్నానని భావిస్తున్నావా? బేషుగ్గా వుంది. నేను భారతీయ నారినే. నీవు కావా?"

"శారదా! నిన్ను నీవు మభ్యపెట్టుకోకు. నాకంతా తెలుసు. పిల్లల్ని కనడం, వారిని పోషించడం, భర్త అడుగులకు మడుగు లొత్తడం, అతనిచేత చివాట్లు తినడం, ఇవేనా స్త్రీల అధికారం?

గృహ నిర్వహణములో స్త్రీ పురుషుల బాధ్యతలు సరి సమానం. ఒకరు అధికులు వేరొకరు అధములు కారు. శారదా రోజులు మారాయి. అంటే కాల చక్రం గిర్రున తిరిగింది. మనం ఒక రాజ్యాంగాన్ని ఏర్పాటు చేసుకున్నాం అందులో కూడా స్త్రీలకు పురుషులతో సమానంగా హక్కులు, ఓటింగు



హక్కులూ వున్నాయి. అంటే స్త్రీ పరిపూర్ణమైన స్వాతంత్ర్యం ఉంది. ఆపైన విద్యలో, వినోదాలలో, ప్రెస్సులలో, ప్లాట్‌ఫారాల మీద, నాటకాలలో, సినీమాలలో, రాజకీయాల్లో, విప్లవాలలో, విమానాలలో అన్ని రంగాలలోనూ స్త్రీ లున్నారు. స్టీలూ, సిమ్మెంటు, పంచదార వంటి ప్రాణంలేని వస్తువులనే నియంత్రణలో పెట్టలేని పురుషులూ, రాజకీయ నాయకులూ ఆదిశక్తి స్వరూపిణి వంటి స్త్రీని కంట్రోల్ చెయ్యాలను కోవడం ఆమె స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ఉక్కు చట్టాలలో బిగించాలను కోవడం కేవలం అవివేకం. తమ ఆధిక్యతను నిలుపుకోవడానికి పురుషులు విశ్వ ప్రయత్నాలు చేస్తున్నారు. కట్టుబాట్లని ఏర్పాటు చేసారు. "స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః, నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అన్నారు. అయినా స్త్రీలు ముందడుగు వేస్తున్నారు.

శారదా నా మాట విను. స్త్రీ తన స్వాతంత్ర్యం నిలుపుకోవడానికి భర్తతో తెగతెంపులు చేసుకోవలసిన అవసరం లేదు. తన హక్కు లేమిటో తెలుసుకోవాలి. వాటి కోసం పోరాడాలి. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం లభించే వరకు ఆమె పురుషుడి కాలి కింద చెప్పులా పడి వుండాలి. నా మాట విని నీవు ఆర్థికంగా స్వతంత్రురాలివికా." అంది.

"అపర్ణా! శబాష్! ఈ రోజు సాయంత్రం మహిళా మండలిలో స్త్రీల హక్కుల విషయం మీద నీ ప్రసంగం వుందా? ఇవి రిహార్సులా? అపర్ణా! రమణి తాను ఏ కారణంగా స్కూలు కెళ్ళలేదో నీతో చెప్తే నీవు ఇంత ముందుకి ఆలోచించావా? అసలు నన్నడుగుతే ఎటిండెన్సు కోసం కాక స్కూలికి వెళ్ళవలసిన అవసరం వుందంటావా? పుస్తకం చదివి ఇంటి దగ్గర జవాబులు రాసి తీసుకురమ్మంటారు. కనీసం చిన్నతరగతులలోనైనా నోట్సులు రాయిస్తున్నారా? తల్లిదండ్రులు చదువుకోని వారైతే ఇక స్కూలు పిల్లలేం నెగ్గుకు వస్తారు?"

"గైడ్సు వున్నాయి. లేకపోతే ట్యూషను చెప్పించు-కోమంటారు శారదా! ఇప్పుడంతా మోడరన్ విద్యావిధానం. అయినా మనం రామాయణం వదిలి పిడకల వేటలో పడ్డాం."

"ఈ భాగవతం రోజూ వున్నదే. కూర్చో కాఫీ తెస్తాను. రాగానే పెద్ద వుపన్యాసం ఇచ్చావు"

"శారదా!" ఇప్పుడు కాఫీ వద్దు. నీవిలా వంటింటికి దాసోహం కావడం నాకు నచ్చలేదు. ఇంగ్లీష్ మీడియంలో బి. ఎడ్ పాసయ్యావు. ఏ కాన్వెంటులో-నైనా ఉద్యోగం చేస్తే ఏడెనిమిది వందలు దొరుకుతాయి. ఇటు ఆర్థిక స్వాతంత్ర్యం వుంటుంది. అటు నీ చదువుకి సార్థక్యం వుంటుంది. దేశానికి ముఖ్యంగా స్త్రీ లోకానికి మేలు చేసినదానివౌతావు." అంది.

అపర్ణ ఇలా సలహాలిస్తూనే వుంటుంది. దినపత్రిక ఆఫీసులో పని చేస్తున్నాది. మహిళల సమస్యల మీద వ్యాసాలు రాస్తుంది. స్త్రీకి ఎక్కడ అనాదరణ కలిగినా ఆమె గర్జిస్తుంది. వారిలో

# మంచుతెర

జాగృతి తేవాలని నిరంతరం కృషి చేస్తుంది.

శారద ఆలోచించసాగింది. ఆమె అన్నదానిలో అసత్యం అవాస్తవికత ఏమీలేదు. తను చదువుకునే రోజుల్లో ఇలాంటి భావాలనే కడుపులో నింపుకుంది. మొదటి నుంచి టీచరు ప్రొఫెషనంటే విపరీతమైన అభిమానం వుండేది. మిషనరి స్కూల్లో చదివింది. ఆ టీచర్సు పెళ్ళిళ్ళు మాని వారి జీవితాలను విద్యాదానానికే అర్పితం చేసారు. పిల్లలను ఎంత ప్రేమగా చూసేవారు. వారిలోనే దైవం వున్నాడని వారిని తీర్చిదిద్దవలసినందుకే తమను పుట్టించేడని అనేవారు.

అందుకే తల్లిదండ్రులను ప్రతిఘటించి బి. ఎడ్. లో చేరింది. పెళ్ళి మానితనూ ఆ టీచర్సు అడుగుజాడల్లో నడవాలనుకుంది. అయితే పరిస్థితులు మరో విధంగా పరిభ్రమించాయి. తల్లిదండ్రులు ఆమెతో ఏకీభవించలేదు. ఇతిహాసాలు, పురాణాలు, స్మృతుల నుంచి గాథలు ఏరి ఆమెకు చెప్పి, ఆధునిక యుగంలోని మహత్తర మహిళల సాహసగాథలు వర్ణించి, పెళ్ళి చేసుకోవడం సంసారం చేయడం లోకధర్మమంటూ వివరించి ఆమెను వివసురాలిని చేసారు.

ఇప్పుడేం చెయ్యడం??

???

"శారదా! నీ బాధను నేనర్థం చేసుకోగలను ఒక వంక ఈ సంసారం వేరొక వుద్యోగం ఈ రెండు నావల్లో ప్రయాణం సాధ్యమా అని అనుకుంటు-న్నావు కదూ? డోంట్ వర్రీ. ఈ వుద్యోగం ఆర్థిక స్వాతంత్ర్యం కోసం. సంసార బంధాన్ని తెంపుకోమనను. అంత నీచురాలిని కాను ఇకపోతే నీ పిల్లలు పసివాళ్ళు కారు. వారి పనులు వారు చేసుకొనే జ్ఞానం వుంది. నీవు వుద్యోగంలో చేరితే వారు ఆత్మనిర్భరులౌతారు. ప్రతీ పనికి నీ మీద ఆధారపడరు. ఇక నీ భర్త సరేసరి. మొదట్లో విసుగుకున్నా నీవు తనతో సమానంగా సంపా-దిస్తున్న కారణంగా నీ మీద తన అథారిటీ చలాయించలేడు. అతని మనస్తత్వంలో త్వరలోనే మార్పు వస్తుంది. ఈ మార్పు సుఖజీవితానికి నాంది. ఒక వంట మనిషిని, అంట్ల మనిషిని కుదుర్చుకో. అప్పుడు నువ్వు వంటింటికే పరిమితం కానక్కరలేదు" అంది అపర్ణ.

'.........."

"నీ భర్తకు బాధ్యతలు అప్పచెప్పాలంటే ఇదే మంచి మార్గం."

శారద మౌనం వహించింది.

"శారదా! స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం లేకుంటే పురుషులామెను కాలి కింద చెప్పులా చూస్తారు. నీవు చదువుకున్న కాన్వెంటు స్కూల్లో టీచరు పోస్టు ఖాళీగా వుంది. ఆ ప్రిన్సిపాల్‌కి నీవంటే ఎనలేని అభిమానం. నీవు అడగాలే కాని ఆమె నీ మాట త్రోసి పుచ్చదు ట్రై చెయ్యి" అంది.

*  *  *

బయట నిలుచున్న ఆనందరావు వారి సంభాషణ వింటున్నాడు. లంచ్ టైమ్‌లో ఇంటికి వచ్చిన అతను అపర్ణ మాటలు విని బయటే వుండిపోయాడు.

శారధ ఆర్థిక స్వాతంత్ర్యం కావాలనుకుంటున్నాది. శారద కేం తక్కువైందని? చదువుకన్న ఆడవాళ్ళు ఎంతకైనా తెగిస్తారు. విదేశీ వ్యామోహంలో వారిని అనుకరించుకోవాలని తమ జీవితాలలో చిచ్చు రేపుకుంటున్నారు. ఇలాంటి స్త్రీ సాన్నిధ్యాన్నతాను ఆశించాడు? రేపు ఆమె వుద్యోగస్తురాలైతే ఆమె భూమ్మీద నడుస్తుందా?

లేదు. ఆమె ఉద్యోగం చేయడం తాను సహించలేడు. స్త్రీలు వుద్యోగాలకు అనర్హులని తన అభిప్రాయం కాదు. అయితే అవసరం వున్న వారే వుద్యోగాలకు ప్రయత్నించాలి. కాని అపర్ణ చెప్పినట్లు ఆర్థిక స్వాతంత్ర్యం కోసం భర్తలను ధిక్కరించడం కోసం కాదు. నారి హృదయం కోమలం అంటారు. పాషాణంలోనైనా కోమలత్వం వుంటుంది. ఈ కాలం స్త్రీలలో కాఠిన్యమే కాని ఆర్ద్రత లేదు.

అతనిలో అసహనం అధికమైంది.

తనూ ఏదో నిర్ణయం తీసుకోవాలి.

ఏమిటి?

??

*  *  *

"సారి! అపర్ణా! ఈ పరిస్థితుల్లో ఉద్యోగం చేయడం నావలన కాదు. నా భర్తను నీవు చాలా తప్పుగా అంచనా వేసుకున్నావు. అతనికి ముక్కు మీదకోపం అంటే నేను ఒప్పుకుంటాను. ఆ కోపం, అపర్ణా! గడ్డి మంటలా చప్పున చల్లారి పోతుంది. ఈ పిల్లలను పనివాళ్లకు అప్పగించలేను. తల్లివుండి కూడా వాళ్ళను తల్లి ప్రేమకు దూరం చేయలేను. నా స్వంత పిల్లలకు ప్రేమాభిమానాలు పంచలేని నేను పరాయి పిల్లలను ఎలా ఆదరంగా చూడగలను? ఇక ఆర్థిక స్వాతంత్ర్యం అంటావా? ఇప్పుడు నాకేం తక్కువైంది? తను జీతం తెచ్చి ఎవరికిస్తున్నారు? ఈ ఇంటి ఖర్చులు పెడుతున్న దెవరు? మరి నాకు ఆర్థిక స్వాతంత్ర్యం లేదని ఎందుకనుకోవాలి.

నా పిల్లలకు నాలుగు అక్షరం ముక్కలు అంటాలంటే నేను చాలా పరిశ్రమించాలి. వాళ్ళ భవిష్యత్తుని తీర్చిదిద్ద వలసిన బాధ్యత నా చేతుల్లో వుంది. ఆయనకు చెప్పే ఓపికా లేదు టైమూ లేదు. బయట పది మందికి విద్యాదానం చేసే కన్నా నా పిల్లలకే ఆదానం చెయ్యడం నా బాధ్యత.

స్నేహితురాలి వని నా కష్టం సుఖం నీకు చెప్పుకుంటాను. అయితే నా స్వర్గాన్ని నరకం చేసుకోవాలని అనుకోవడం లేదు. ఈ ఇల్లేనాకు స్వర్గం. ఈ ఇల్లే నాకు నందనవనం." అంది శారద దృఢంగా. □

బాంబినో ఒక అద్భుత మైన వెర్మిసెల్లిని పరిశుభ్రమైన పద్ధతిలో అధునాతన ఇటాలియన్ యంత్రములతో తయారు చేయబడినది. మిక్కిలి ప్రోటీన్లు కలిగి యుండి క్రొవ్వు పదార్థములు లేకుండుటయే బాంబినో విశిష్టత. వండినప్పుడు కాని, తరువాత కాని ముద్దగా కాకపోవుటయే బాంబినో ప్రత్యేకత. నిమిషములలో బాంబినోతో ఎన్నిరకము లైన, నోరూరించే వంటకాల, ఫలహారాలు తయారు చేయవచ్చును. ఇంకా బాంబినోతో ఎంతో పొదుపు కూడా. నేడే వాడి చూడండి. మీకే తెలుస్తుంది.



**బాంబినో కట్‌లెట్ :**

5 కప్పుల బాంబినోను ఉడకబెట్టి తీసి ఆరబెట్టి ఉంచండి కీమానుకూడా ఉడకబెట్టి ప్రక్కన పెట్టండి. ఆరు లవంగాలు, ఏలక్కాయ, వెల్లిగడ్డలోని 5 పాయలు, అల్లం ముక్కలు దంచి ముద్ద చేయాలి కళాయిలో నూనె మరగించి, కీమాను, బాంబినోను మసాలా ముద్దను ఈ కళాయిలో వేసి గరిటతో కలపాలి! తర్వాత దీనిని దించి గ్రుడ్డు పచ్చసొన, మొక్కజొన్న పిండి కలిపి మూడు కట్‌లెట్‌లు చేయండి. తర్వాత దీనిని తెల్లసొనలో ముంచి రొట్టె ముక్కలు రుద్ది బాగా వేయించండి.




బాంబినో వంటల విధానం తెలిపే పుస్తకం కొరకు వ్రాయండి.

జన జీవన్ ఫుడ్స్
ప్రైవేటు లిమిటెడ్,
1వ ఫ్లోర్, బషీర్‌బాగ్ ప్యాలెస్,
హైద్రాబాద్.

**వెర్మిసెల్లిని**

IS 1485




తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి!



# హైదరాబాద్ నోట్‌బుక్

## డాక్టర్ స్వామి జ్ఞానానంద:-

ఎందరో మహానుభావులు - అందరికిని వందనంబు - అన్నారు త్యాగయ్యగారు. ఆయన ఎందరు, మహానుభావులను దర్శించారో! నేను ఆసేతుశీతనగరం, ఆ హంపీ హరప్పం తిరిగిన తిరుగుళ్ళలో ఎందరో మహానుభావులను దర్శించాను. జడభరతుల వలె ఉంటూ నిరంతరం సమాధి నిష్ఠులైనవారిని, ఎవరిని చూచినా పరమాత్మగానే భావించేవారిని, అక్షరం ముక్క చదువకపోయినా అక్షర పరబ్రహ్మ రహస్యాలను కదళీపాకంగా, కరబదర సమంగా చెప్పి చూపుతున్న వారిని, ప్రజాసామాన్యావర్జనకు మాయలు, గారడీలు చేసినా, మాయను దాటి మూలతత్త్వాన్ని సాక్షాత్కరించుకొన్న వారిని, జ్ఞాన విజ్ఞానాల సమన్వయంతో ఆధునికులకు నచ్చజెప్పుతున్న వారిని, దగ్గర కూర్చుంటేనే అజ్ఞానాన్ని పోగొట్టేవారిని, పాండిత్యాలు, ప్రభుతలు పరమాత్మను అందుకోవని తమ పాండిత్యాన్ని కుప్పగా ఆధ్యాత్మికాచార్యుని సన్నిధిని పోసి మూర్ఖత్వాన్ని వరించిన మహామహులను - ఇలా ఎందరినో దర్శించాను. స్వామి డాక్టర్ జ్ఞానానంద - నేను దర్శించిన వారందరినీ కలబోసిన మహానుభావులుగా కనిపించారు. ఆయన 1896 డిశంబరు 5న జన్మించారు. అంటే 90 ఏళ్ళయింది ఇలాటి మహా యోగి, మహా తత్త్వవేత్త, మహా విజ్ఞానశాస్త్రజ్ఞుడు తెలుగుదేశంలో జన్మించడం గర్వకారణంగా భావిస్తాను. ఆయన తెలుగువారైనా, యావద్భారతానికి చెందిన మహా యోగిపుంగవులు. స్వామి జ్ఞానానంద 90వ జయంత్యుత్సవాన్ని పశ్చిమగోదావరి జిల్లా గౌరగనమూడి గ్రామంలోని ఆయన సమాధి వద్ద నిర్వహిస్తున్న శ్రీ భూపతిరాజు పద్మనాభరాజును ఇటీవల కలుసుకున్నప్పుడు ఆయన ఉత్సవ సన్నాహాలను గురించి తెలియజేశారు. ఆయన రాష్ట్రప్రభుత్వ వ్యవసాయ శాఖలో డెప్యూటీ డైరెక్టర్ పదవి నిర్వహించి విశ్రాంతి పొందినవారు. శ్రీ స్వామి జ్ఞానానంద చరితామృతాన్ని తదితర గ్రంథాలను ముద్రించడానికి హైదరాబాద్ వచ్చారు. ఈ సందర్భంలో ఆశ్చర్యకరమైన శ్రీ స్వామి జ్ఞానానంద జీవిత విశేషాలు తెలుగువారు తెలుసుకోడం అవసరం. శ్రీ జ్ఞానానంద పూర్వాశ్రమ నామధేయం భూపతిరాజు -లక్ష్మినరసింహరాజు తలిదండ్రులు శ్రీమతి సీతయ్యమ్మ శ్రీ శ్రీరామరాజు-గార్లు. శ్రీ జ్ఞానానందకు చిన్ననాటి నుంచే ఆధ్యాత్మిక చింత ఉండేది. తణుకు మాధ్యమిక పాఠశాలలో చదువుతుండగా, మహారాష్ట్రం నుంచి ఒక స్వాములవారు వచ్చి కృష్ణ మంత్రం ఉపదేశించారట. అప్పటినుంచి శ్రీ జ్ఞానానంద జీవితాంతం కృష్ణ భక్తులుగా ఉన్నారు. ఆయన నరసాపురం ఉన్నత పాఠశాలలో చదువుతున్నప్పుడు వివాహం జరిగింది. కాని, ఆయన శ్రీరామకృష్ణ పరమహంసలాగ గృహస్థ బ్రహ్మచారిగానే ఉన్నారు. 1917లో స్కూలు ఫైనల్ పరీక్ష తప్పినట్లు తెలిసింది. ఆ సాకుతో ఆయన కొంత రైలు మీద, కొంత కాలినడకన పయనించి ఖరగ్‌పూర్ చేరారు. తరువాత నేపాల్ సరిహద్దులలోను, మౌంట్ ఆబూగిరి శిఖరాలలోను, హిమాలయ స్వర్గాశ్రమంలోను, కాశ్మీరంలోను, బదరి గంగోత్రి గిరి కందకాలలోను 18 వేల అడుగుల ఎత్తున అతి శీతల వివిక్త ప్రదేశాలలో దిగంబరులై తపస్సు చేశారు. ఆయన హిమానీనదాలపై పరుగులు తీస్తుంటే అందరూ ఆశ్చర్యంగా చూచేవారట. ఇతరులు ఆయన కాలుతున్న వీపు మీద కొంకర్లు పోయిన తమ చేతులను కాచుకొనేవారట. హిమాలయంలోని స్వర్గాశ్రమంలో ఒక వంగదేశ స్వామి ఆయనకు సన్యాస దీక్ష ఇచ్చి, స్వామి జ్ఞానానంద అనే తురియాశ్రమనామం ప్రసాదించారు



డాక్టర్ స్వామి జ్ఞానానంద

ఆయన వివిధ యోగ ప్రక్రియలు చేశారు. హఠయోగంతో దేహంలో అణువణువూ తన చెప్పుచేతల్లో పెట్టుకొన్నారు. తిండితిప్పలూ లేక వారాల తరబడి చేసిన తపస్సులో సమాధ్యవస్థలో దర్శించిన దివ్యతాత్త్విక పరమార్థ విభూతులను "పూర్ణసూత్ర" అనే పేరుతో క్రోడీకరించారు. ఆంగ్లంలో వీటి వివరణాదులు 1927 నాటికి పూర్తయాయి. దీనిని సుందరంగా ముద్రించాలనే సంకల్పంతో జర్మనీ వెళ్ళారు. ఇది ఆయన జీవితాన్ని పూర్తిగా మార్చివేసింది. పాశ్చాత్యులకు ఆధ్యాత్మిక విషయాలు బోధించాలని, దానికోసం ఆధునిక విజ్ఞాన శాస్త్రపాండిత్యం అవసరమని ఆయన గ్రహించారు విద్య, అవిద్య పరతత్త్వమనే నాణేనికి రెండుపార్శ్వాలని, పరిపరతత్త్వ అవగాహనకు జ్ఞాన విజ్ఞానాలు రెండూ రెండు చేతుల వంటివనీ, ఆత్మసాక్షాత్కార పరమార్థ విహాయస విహారానికి రెండు రెక్కలవలె అవి ఉపకరిస్తాయని ఆయన భావించారు. విజ్ఞాన శాస్త్ర అధ్యయన పరిశోధనకు పూనుకున్నారు. గణిత, భౌతిక, విద్యుదయస్కాంత, పరమాణుభౌతిక, ఉష్ణ, కాంతి, వాతావరణాది శాస్త్రాలలో ప్రామాణికమైన పరిశోధనలు జరిపారు జెకోస్లోవాకియాలోని ప్రాగ్ విశ్వవిద్యాలయం ఆయన పరిశోధనకు మెచ్చి డి.ఎస్.సి. బిరుదు ఇచ్చింది. ఇంతలో ద్వితీయ ప్రపంచ సంగ్రామ మేఘాలు జర్మనీలో ముసురుకోడంతో ఆయన జర్మనీ నుంచి ఇంగ్లండుకు వెళ్ళారు. అక్కడ లివర్‌పూర్ విశ్వవిద్యాలయంలో సర్‌జేమ్స్ డాడ్విన్‌తో పాటు భౌతిక పరమాణు శాస్త్రాలలో పరిశోధనలు జరిపారు. ఆ పరిశోధన విశేషాలకు లివర్‌పూర్ విశ్వవిద్యాలయం ఆయనను పి. హెచ్.డి. బిరుదంతో గౌరవించింది. లండన్‌లోని ఇన్‌స్టిట్యూట్‌ఆఫ్ ఫిజిక్స్ గౌరవఫెలోషిప్పుతో సత్కరించింది. యుద్ధం ముమ్మరం కావడంవల్ల పరిశోధనకు కావలసిన ఐసోటోపులు ఇంగ్లాండులో లభించనందున ఆయన అమెరికాకు వెళ్ళారు హైవా క్యువా అనే ఆయన గ్రంథాన్ని న్యూయార్క్‌లోని డవాన్ నాస్ట్రాండ్ కంపెనీ ముద్రించింది. ఆయన బీటారే స్పెక్ట్రోస్కోప్‌లో విశ్వవిఖ్యాతమైన పరిశోధనలు జరిపారు. అమెరికా ఆయనను సిగ్మాక్షి అనే అత్యంత ప్రతిష్ఠాకరమైన శాస్త్ర విజ్ఞాన సంస్థ సభ్యత్వంతో సన్మానించింది. ఆయన 1938లో

కలకత్తాలో జరిగిన సైన్స్ కాంగ్రెస్‌లో ప్రముఖ పాశ్చాత్య శాస్త్రజ్ఞులతో పాటు పాల్గొన్నారు. ఇంతలో 1947లో భారతదేశం స్వతంత్రమైంది. ఆయన భారతదేశానికి తిరిగివచ్చారు. అప్పటి ప్రధాని పండిట్ జవహర్‌లాల్‌నెహ్రూ కోరికపై ఆయన నేషనల్ ఫిజికల్ లేబరేటరిస్‌లో ఎలెక్ట్రిసిటీ ఎలెక్ట్రాన్స్ విభాగంలో చేరారు. 1954లో ఆంధ్ర విశ్వవిద్యాలయం పరమాణు విజ్ఞాన విభాగాన్ని రూపొందించి నిర్వహించడానికి ఆయనను ఆహ్వానించింది. ఆయన ఆ శాఖకు అధినేతగాను, ఆచార్యుడుగాను వుండి ప్రపంచంలోనే ఆ శాఖకు గొప్ప యశస్సు కలిగించారు. ఆయన పర్యవేక్షణలో కొన్ని పదులమంది పరమాణు శాస్త్రంలోను, తదనుబంధ శాస్త్రాలలోను డాక్టరేట్లు సంపాదించారు. ఆయన జర్మనీలో వున్నప్పుడు నేతాజీ సుభాష్‌చంద్రబోస్‌కు అతిథిగాను ఉన్నారు. ఆయన జర్మనీలో షడ్దర్శనాలను గురించి, భారతీయ సంస్కృతిని గురించి చేసిన 150 ప్రసంగాలలో నాలుగుమాత్రమే దార్శనిక మహాప్రవచన అనే పేరుతో ప్రచురితమయాయి. ఆయన

## హైదరాబాద్ నోట్‌బుక్

సమాధ్యవస్థనుగురించి, రాజయోగాన్ని గురించి వ్రాసిన ఆంగ్ల కవితాఖండికలు గ్లింప్సెస్ అనే పేరుతో సంపుటంగా ప్రచురితమయ్యాయి. పూర్ణసూత్ర సంస్కృతాంధ్రానువాదాలతో ముద్రితమైంది. ఆయన అంతర్జాతీయ వేదాంత సభ (రిహమదాబాద్) అధ్యక్షోపన్యాసం, ఆయన తన కుటుంబం వారికి, భక్తులకు, శిష్యులకు, అభిమానులకు వ్రాసిన లేఖలు శ్రీ జ్ఞానానంద లేఖావళిగా అచ్చుయాయి. ఆయన పరమాణుశాస్త్రంపైన, ఇతర భౌతిక శాస్త్రాలపైన పెక్కు గ్రంథాలు రచించారు. ఆయన 1969లో సిద్ధి పొందారు. ఆయన చరిత్ర శ్రీ స్వామి జ్ఞానానంద చరితామృతం అనే పేర ఆయన స్వీయ చరిత్రతో పాటు 90వ జయంత్యుత్సవంలో ఆవిష్కరిస్తామని శ్రీ భూపతిరాజు పద్మనాభరాజు తెలిపారు.

**ఉపశ్రుతి :**

సార్, మీరు ఎందరితో నో కలిసి పనిచేశానంటారు. ఏమేమో చేశానంటారు. మి మాటలలో అంత జ్ఞానం సంపాదించినట్లు కనిపించదే– అన్నారొకరు. వెర్రివాడా, భర్తృహరి అననే అన్నాడు కుండను తీసుకువెళ్లి బావిలో ముంచినా సముద్రంలో ముంచినా. కుండంత నీరే నింపుకుంటుంది కాని, ఎక్కువ నీరు ఎట్లా నింపుకొంటుంది ?– అని ప్రశ్నించాను అతన్ని.

–తిరుమల రామచంద్ర

## ఉత్తరాలు....

### నిదర్శనాలు

డా జయ్ దుబాషిగారి రచనలు-స్వచ్ఛమైన జాతియ భావుకతకు నిదర్శనాలు రాజకీయపు టద్దాలు పెట్టుకుని చదివే పాఠకులు ఆవేశపడకండా అర్థం చేసుకుంటే ... అతనిలో 'మంచి' రచయితని చూస్తారు.

ఏ. ఆర్. మూర్తి, కడప

### న్యూఢిల్లీ లేఖ

15-21 నవంబరు సంచికలో డాక్టర్ జయ్ దుబాషిగారి "మధ్య తరగతిని అలక్ష్యం చేస్తే ముప్పు" లేఖ చాలా బాగుంది. మన దేశంలో మధ్య తరగతివారు జనాభాలో మూడవ వంతు ఉన్న కారణంగా వారిని ఎటువంటి అలక్ష్యానికి గురి చేయరాదు.

సత్తి ఉమా మహేశ్వరరెడ్డి, కొంకుదురు




*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna, Phones : P. B. X. : 61247, 61248 & 75667.*

